# ప్రపంచప్రఖ్యాతి గాంచిన కేరళ ఆయుర్వేద వైద్యశాల వారి ప్రత్యేక చికిత్సలు!! (ఆపరేషన్‌లు లేకుండా)

## H.I.V / A.I.D.S. H.I.V / A.I.D.S. వ్యాధిగ్రస్తులకు శుభవార్త!!

H.I.V / A.I.D.S లు నయముకాని వ్యాధులని అనుకుంటున్నారా? దక్షిణ కాలిఫోర్నియా యూనివర్శిటీ వారి పరిశోధన ప్రకారం 'మానవ శరీరంలోని A.P.O.B.EC-3G అనే ఎంజైము ఉంటుంది. H.I.V శరీరములోనికి ప్రవేశించిన వెంటనే దాన్ని అడ్డుకునే సామర్థ్యం కల్గిన ఎంజైము శరీరములోని ప్రతి కణములోను ఉంటుంది.' శరీరములోని ప్రతికణములో ఉన్న బలహీనపడిన A.P.O.B.EC-3G ఎంజైమును శక్తివంతం చేస్తే అది H.I.V ని నాశనం చేస్తుంది. మా మందులు వైరల్ లోడ్‌ని తగ్గించి CD-4 కౌంట్ పెరిగి సాధారణ స్థితికి వస్తుంది. H.I.V సోకిన వ్యక్తిని A.I.D.S నుండి కాపాడవచ్చు. H.I.V /A.I.D.S లు ప్రాణాంతకాలు కావు. CD-4 కౌంట్ (Immunity)ని 90 రోజులలో మన మందుల ద్వారా 800 నుండి 1500వరకు పెంచుకొని పూర్తి జీవితకాలం ఆరోగ్యముగా జీవించవచ్చును. 15 రోజులలో మీకు గుణము కనిపించును.

## కేన్సర్ - CANCER కేన్సర్ - CANCER - వ్యాధిగ్రస్తులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

* మెదడు * నోరు * థైరాయిడ్ గ్రంథి * స్తనములు * ఊపిరితిత్తులు * అన్నవాహిక * జీర్ణాశయము * పసరుతిత్తి * కాలేయము * పాంక్రియాసిస్ * మూత్రపిండములు * ప్రోస్టేటు గ్రంథి * మూత్రకోశము * జీర్ణ కోశము * ప్రేగులు * గర్భాశయ కంఠము (సెర్విక్స్) * గర్భాశయము * అండములు * పురుషాంగము * వృషణములు * న్యూరోబ్లాస్టోమా * కండరములు * ఎముకలు * చర్మము * లింఫ్ గ్రంథులు ఎంతో మంది క్యాన్సర్ వ్యాధిగ్రస్తులకు చికిత్స చేస్తున్నటువంటి కేరళ ఆయుర్వేద వైద్యశాల. రేడియేషన్ థెరపీ, కీమోథెరపి, హార్మోన్ థెరపి, బయోలాజికల్ థెరపి, మరియు ఇతర వైద్యపద్ధతులను తీసుకుంటున్న వారు కూడా మా ఆయుర్వేద మందులు వాడవచ్చును.

## షుగర్ DIABETES MELLITUS అతి మూత్రము DIABETES INSIPIDUS వ్యాధి బాధితులకు శుభవార్త!!

అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE - II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDM) కొద్ది రోజులలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE -1 DIABETES. INSULIN DEPENDENT DIABETES MELLITUS. (IDDM) 60 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషంట్లకు మానని పుళ్లు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును. (PER MONTH Rs.2000/-) TYPE - II COURSE 3 MONTHS. TYPE - 1 COURSE 6 MONTHS.

## సంతానం లేని (Infertility-Sterility) దంపతులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్న (OLIGOSPERMIA) మగవారికి కణాలలో కదలిక (MOTILITY) లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoospermia) వెరికోసీల్‌వీన్స్ (Varicoseviens) (Per month Rs.4000/-) Course : 3 months, స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదలకాక పోవుట, అండవాహికలు మూసుకొని పోవుట (Fallopian Tubes Block), గర్భాశయ పొరలకు వ్యాధి సోకినా, ప్రొలాక్టిన్ హార్మోన్ ఎక్కువశాతములో ఉన్నా, లోపలి ద్రవాల్లో ఆమ్లగుణము (Acid) ఎక్కువగా వున్నా, ఎండోమెట్రియాసిస్, అండములు చాలా చిన్నవిగా వున్నా తరచూ గర్భ స్రావములు జరుగుచున్నా, గర్భాశయ లోపములకు, రసాయన వాజీకరణ పద్ధతుల ద్వారా ప్రత్యేక చికిత్స చేయబడును. (Per Month Rs.4000/-) Course : 3 months.

**STOP!! ఆల్కహాల్, స్మోకింగ్, గుట్కా, డ్రగ్స్ మానండి! త్రాగే వారికి తెలియకుండా మాన్పించండి!! (Per Month Rs.1500/-) Course : 2 months.**

**నత్తిని తగ్గించుటకు** (Stammering): (Per month Rs.2000/-) Course : 3 months. **చెవిపోటు** (Ear ache): చెవినుండి చీము కారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము ఆపరేషన్ లేకుండా, (Per month Rs.900/-) Course : 3 months.

## బట్టతల!! Baldness! నెరసిన జుట్టు!! Grey Hair!

చుండ్రు, జుట్టు రాలుట, పేను కొరుకుడు, జుట్టును నల్లగా వొత్తుగా, పొడువుగా పెంచి బట్టతల నెరసిన జుట్టును నివారించును. Kerala Herbal Hair Tonic (Oil) 100ml Rs.500/-, 250ml Rs.1100/-, Kerala Herbal Shampoo - 100ml Rs.50/-; 250ml Rs.120/-; Herbal Hair Capsules 60 - Rs350/- (Per Month Rs.900) Course : 6 Months.

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

జలుబు, దగ్గు, ఆయాసం, తుమ్ములు, పిల్లికూతలు, కఫ్ఫం, ముక్కునుండి నీరు కారుట, ఊపిరి ఆడకపోవడము, సైనసైటిస్ (Sinusitis) ఇసినోఫీలియా (Eosinophilia) దుమ్ము, ధూళి, ఏసి, ఐస్‌వాటర్, మంచు చల్లగాలుల వల్ల కలుగు ఎలర్జీ వ్యాధులకు అన్ని రకముల శ్వాసకోశ సమస్యలకు Asthma Sanjivini 200ml Rs.350/- (Per month Rs.700/-) Course : 9 months.

**నూతన యవ్వన శక్తికి, శీఘ్రస్కలనము**: హస్త ప్రయోగమువలన దుర్బలత్వము, నపుంసకత్వము (Impotency) అంగస్తంభన సరిగా లేకపోవుట, లైంగిక వాంఛ లేకపోవుట (Libido), రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట, వృషణములు కుచ్చించి పోవుట (Atrophy of Tests). (Per month Rs.3000/-) Course : 3 months.

**సుఖవ్యాధులు, వ్రణములు, పుండ్లు** : గనేరియా, సిఫిలిస్, (per month Rs.1500/-) Course : 3 Months. **హెర్పిస్ సింప్లెక్స్** (HERPES SIMPLEX) (Per month Rs.3000/-) Course : 3 months.

**కీళ్ళు, కండరాల నొప్పులకు** : నరముల వాపు, నడుము నొప్పి, మెడనొప్పి, వెన్ను నొప్పి (Per month Rs.900/-) Course : 3 months. **తుంటి నొప్పి** (Sciatica) (Per month Rs.2500/-) Course : 3 months.

**లివర్ వ్యాధులు, లివరు గట్టి పడుట** (Cirrhosis) **లివర్‌లో చీము** (Abscess) **లివర్ వాపు, నొప్పి** (Hepatitis) **ప్లీహాము వాచుట** (Enlarged Spleen) (Per month 4000/-) Course: 3 Months

**సోరియాసిస్** (Psoriasis) (Per month Rs.3000/-) Course : 3 months : ✓ **బొల్లి** (Leucoderma). (Per month Rs.3000/-) Course : 3 months.

**మూర్ఛ** (Fits) **అపస్మారకము** (Epliepsy) (Per month 3000/-) Course: 3 Months, **జ్ఞాపకశక్తి తగ్గిపోవుట** (Loss of Memory) **నిద్రపట్టకపోవుట** (Insomnia), (Per month Rs.2000/-) Course:3months

**స్థూలకాయము** (Obesity) : అధిక బరువును, లావును తగ్గించుటకు (No Diet. No Exercise) (Per month Rs.2000/-) Course : 3 months.
సన్నగా బలహీనముగా నుండు వారు, బరువు పెంగి, లావుకావటానికి, ఎత్తు పెరుగుటకు, (21సం॥లోపు వారు) (Per month Rs.2000/-) Course : 3 months.

**మూత్ర పిండముల వాపు: మూత్రపిండములలో రాళ్ళు** (KIDNY STONES) **పిత్తాశయములో రాళ్ళు** (Gall Blader Stones) **క్లోమ గ్రంథి యందు రాళ్ళు** (Stones in Pancreass) (Per month 3000/-) Course: 3 Months

**స్త్రీల శరీరంపై వచ్చు అవాంచిత రోమములు (UN WANTED HAIR) తిరిగి మొలవకుండా చేయుటకు** :(Per month Rs.3.000/-) Course : 1 month.

**గ్యాస్‌ట్రబుల్, ఎసిడిటీ, అల్సర్** (Per month Rs.900/-) Course : 3 months. Piles Fissers (Per month Rs.900/-) Course : 3 months. **FISTULA** (Per month Rs.2000/-) Course : 3 months.

**స్తనముల బిగువుకు** : స్త్రీల స్తనముల సైజు పెంచుటకు/తగ్గించుటకు/స్త్రీల ✓ పొత్తికడుపు మీద (SCRATCH MARKS) చారలు, గీతలు పోవుటకు (Per month Rs.1000/-) Course : 3 months

✓ **పక్షవాతం** (PARALYSIS) (Per month Rs.6000/-) Course : 3 months. **PROSTATE ENLARGE / THYROID / HERNIA / HYDROCELE** (Per month Rs.3000/-) Course : 3months.

✓ **B.P / మలబద్ధకం** (Per month Rs.300/-) Course : 3 months. **పులిపిర్లు** (WARTS) (Rs.300/-) **HEPATITS / HERPES / FITS / OBEYSITY / PSORIASIS / VITILIGO / THYRIOD**

10 A.M. TO 8 P.M.

# కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఓడియన్ 70 ఎంఎం థియేటర్ ఎదురుగా, రెమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, TQS Showroom పైన, చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదారాబాద్-20. ఫోన్ : 65526109, 9392355590, 9866155109

**Note** : పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు. ఉత్తరాలద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు ఏపీలో పోస్టల్ /కొరియర్ ఛార్జీ రూ॥ 100/-. ఇతర రాష్ట్రాలవారు రూ.250/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా పంపువారు Kerala ayurveda vaidyasala పేరు మీద ఇక్కడ రాసినట్టుగా వ్రాసి పంపవలెయును మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించువారు 10 A.M. - 8 P.M. Sunday 10 A.M to 2 P.M అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.

3-11-2010

**rage** mobiles






# SOUND KA DHAMAKA

## RX 201 WITH WOOFER

• Big Screen (6.1 cm) • Dual Sim Dual Standby • Answering Machine • 1.3 MP Camera with Video Recording • Auto Call Recording • Remote Control (HID) • ebuddy/facebook/yahoo/opera mini • Background Sound-effect • Black List Feature • 2.5mm Audio Jack • Universal Charging Port • Wireless FM with Scheduler & Recorder • Mobile Tracker • Java Application • Privacy Protection




Pre-loaded Memory Card



Anti-Mosquito Software



Multiple Battery Slots

For any queries SMS RAGE < your query> send it to 54545, call (toll free no.) 1800-103-2566 or log on to www.rage-mobile.com

*Conditions apply

**BRANCH OFFICE: SUNSTIKE TELECOM PVT. LTD.** #155, Street No. 6, Beside Andhra Bank Lane, Ashok Nagar, Hyderabad- 500020. Ph: 040-40111639

**REGIONAL DISTRIBUTOR FOR CENTRAL ANDHRA** M/s Abhishek Marketing - 0866 6697776, 2576668

**REGIONAL DISTRIBUTOR FOR TWIN CITIES & TELANGANA**: Space Technolozgies, 7-3-196/1, Portion-A, 1st Floor, Laxmi Complex, R.P. Road, Secunderabad, Ph: 040-66339343, 9246824633

*FOR TRADE ENQUIRY CONTACT: 9611125068*

సంపుటి -33, సంచిక - 10
394వ సంచిక, పేజీలు : 132
నవంబరు 2010

# చతుర





కవర్ పేజీ : సమంత
ఫొటోగ్రాఫర్ : జయకృష్ణ
ముఖపత్రాలంకరణ : రాజుయాట

ఆ వరాహరాజాలు మిగతా జంతువులకు విప్లవం గురించి బోధించసాగాయి.
'విప్లవం వస్తే నాకు చక్కెర పలుకులు దొరుకుతాయా?' అడిగిందో ఆడగుర్రం.
'లేదు, అప్పుడు చక్కెర ఉండదు' చెప్పింది ఓ నాయక వరాహం.
'చక్కెర ఎందుకుండదు?' ఆందోళన చెందింది ఆడగుర్రం.
'గడ్డి, దాణాల సమృద్ధివల్ల చక్కెర అవసరమే నీకుండదు' అంది నాయక వరాహం.
'అప్పుడు కూడా మెడలో ఈ రంగుల రిబ్బన్లు వేసుకోవచ్చా?' మళ్లీ ఆడగుర్రం ప్రశ్న.
'కామ్రేడ్! నీ రిబ్బను బానిసత్వ చిహ్నం' విసుక్కుంది వరాహం.
20వ శతాబ్దపు రాజకీయ వ్యంగ్య నవల **జార్జ్‌ఆర్వెల్ జంతుక్షేత్రం** చతుర పాఠకుల కోసం..

18వ పేజీలో..

బొమ్మలు : బాలు

అపార్ట్‌మెంటాలజీ 34

# అత్తగారూ - సెల్‌ఫోనూ - ఒక పోలీసు



యర్రంశెట్టి శాయి

(గత సంచిక తరువాయి)

"దద్దనకం దద్దనకం దద్దనకం ధా! విజయ్ టెర్రరిస్ట్ అన్న విషయం నాకు మూడేళ్ళ కిందటే తెలిసింది. అతను చేసిన విధ్వంసాలు అన్నీ ఇన్నీ కాదు. నాకు తెలిసి డెబ్బయ్ ఎనిమిది మందిని హత్య చేశాడు"

అతని స్టేట్‌మెంట్ చూసి మేమంతా షాకయ్యాం.

"వీడెవడసలు? విజయ్ మర్డర్లు కూడా చేశాడంటాడు.." అడిగాడు శంకరమూర్తి ఆశ్చర్యంగా.

"ఈ తుగ్లక్ వెధవలకి వీడెక్కడ దొరికాడసలు" కోపంగా అన్నాడు జగన్.

"వ్వాట్! 78 మందిని హత్య చేశాడా?"

"దద్దనకం ధా! నేను చూడకుండా చేసిన నూటపాతిక కాక!"

"ఓగాడ్! అన్ని హత్యలు చేసినా అతడిని పోలీసులు పట్టుకోలేదా?"

"దద్దనకం దద్దనకం దద్దనకం ధా! అతడు లేపేసిన 78 మందిలో 68 మంది అతడిని పట్టుకోడానికి వచ్చిన పోలీసులే"

"వీడెవడు బాస్.. మనకి షాక్ మీద షాకులిస్తున్నాడు?" అన్నాడు బోస్.

"డప్పు శీనుగారూ! విజయ్‌కి ఆల్ ఖైదాతో ఏమైనా సంబంధాలున్నాయా?"

"దద్దనకం ధా! సంబంధాలేంట్రా పిచ్చిసన్నాసుల్లారా? రోజూ సాయంత్రం ఆరుగంటల నుంచీ రాత్రి రెండింటి వరకు ఒబామా బిన్‌లాడెన్‌తో మాట్లాడుతూంటే నేను వినేవాడిని"

"ఒబామా బిన్‌లాడెన్ కాదు.. ఒసామా బిన్‌లాడెన్ కదూ?"

"ఎవడో ఒకడు వంకాయ్‌గాడు.. దద్దనకం ధా!"

"మరి ముస్తాక్ అహ్మద్ అనే విజయ్ అలాంటి నేరాలు ఘోరాలు చేస్తుంటే మీరు పోలీసులకెందుకు తెలియజేయలేదు?"

"దద్దనకం దద్దనకం దద్దనకం ధా! పాగల్‌సాలే.. పోలీసులకు చెప్పేదేంట్రా? నేనే పోలీస్ ఆఫీసర్ని!"

మాతోపాటు ఆ తుగ్లక్ జర్నలిస్టు ప్రశ్నల పాండు కూడా షాకయ్యాడు.

"వెంగమాంబా! ఈ టెర్రరిస్ట్ విజయ్ కేసు అనుకోని మలుపులు తిరుగుతోంది వెంగమాంబా! మనకు విజయ్ గురించి ఎవరికీ తెలీని నిజాలు బయటపెట్టిన కీలకమైన వ్యక్తి డప్పు శీను.. స్వయంగా ఒక

పోలీస్ ఆఫీసర్ అయ్యుండి కూడా.. ఇంత కాలం ఆ విషయాలు బయటపెట్టకుండా ఎందుకు దాచారు? ఇంతకాలం దాచి మరి ఇప్పుడెందుకు బయటపెట్టారు? అదీ కేవలం మన ప్రిస్టేజియస్ తుగ్లక్ ఛానెల్‌కే ఎందుకు అందించారు? ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానం లేకపోవటమే ఒక ప్రశ్నగా మిగిలింది వెంగమాంబా!"

"డప్పు శీనుగారూ! మీరు పోలీస్ డిపార్ట్‌మెంటులో వర్క్ చేస్తున్నట్లు చెప్పారు! మీరే హోదాలో పని చేస్తున్నారు? ఏ పోలీస్ స్టేషన్లో వర్క్ చేస్తున్నారు? "

"దద్దనకం ధా! నేను సీబీఐ ఆఫీసర్ని.. భే! బంగ్లాదేశ్ హెడ్‌క్వార్టర్స్"

ప్రశ్నలపాండు ఇంకా ఎక్సయిట్ అయ్యాడు.

"వెంగమాంబా డప్పుశీను బంగ్లాదేశ్ సీబీఐ ఆఫీసర్‌నని స్వయంగా అంగీకరిస్తున్నాడు వెంగమాంబా! అంటే ఈ ముస్తాక్ అహ్మద్ అనే విజయ్ బంగ్లాదేశ్ ఏజెంటా అన్న కోణంలో కూడా దర్యాప్తు జరపాల్సి ఉంది. ఇంత పెద్ద లెవల్లో టెర్రరిస్ట్ కార్యకలాపాలు జరుపుతున్న విజయ్‌లాంటి ఉగ్రవాదుల ఆటకట్టించడానికి మన తుగ్లక్ చానెల్ చేపట్టిన ఈ స్పెషల్ ఇన్వెస్టిగేషన్ ఇంటర్నేషనల్ లెవల్లో జరుగుతోందంటే.. అది ఒక ఇండియన్ రీజనల్ చానెల్ హిస్టరీలో ఒక అద్భుతమైన విజయంగా మేము భావిస్తున్నాం!"

"అవును ప్రశ్నల పాండూ! నువ్ క్రిమినల్స్‌కి వేసే ప్రతి ప్రశ్నా ఒక బాంబ్‌లాగా పేలటం వల్లే మన తుగ్లక్ చానెల్‌కు విజయాల పరంపర కొనసాగుతోంది"

ఆమె కూడా తన సొంత డబ్బా కొట్టుకున్నాక కెమెరా మళ్ళీ ప్రశ్నల పాండూ, డప్పు శీనుల మీదకొచ్చింది.

"డప్పు శీనుగారూ.. మీరు బంగ్లాదేశ్ నుంచి ఇండియా ఎప్పుడు వచ్చారు? మీక్కూడా ఆల్ ఖైదాతో ఏమయినా లింకులున్నాయా? లేక మీరు బంగ్లాదేశ్ గూఢ



చారిగా ఇక్కడికొచ్చారా? "

సరిగ్గా అప్పుడే ఓ మెంటల్ హాస్పిటల్ వ్యాన్ వచ్చి ఆగింది. అందులో నుంచి నలుగురు వార్డ్ బాయ్‌లు హడావుడిగా దూకారు. వాళ్ళను చూడగానే డప్పుశీను 'దద్దనక ధా' అంటూ పరుగెత్తబోయాడు. కానీ వాళ్ళు అతనిని పట్టేసి వ్యాన్‌వేపు లాక్కెళ్తూంటే ప్రశ్నల పాండూ షాకయిపోయి, వాళ్ళను అడ్డగించాడు.

"ఇదిగో! మా తుగ్లక్ చానెల్ ఒక ఇంటర్నేషనల్ లెవల్ టెర్రరిస్ట్ ముఠాను రెడ్ హాండెడ్‌గా కార్నర్ చేస్తున్న టైమ్‌లో.. డప్పు శీనూని ఎందుకు వెంటాడి పట్టుకున్నారు? మీరు మఫ్టీలో ఉన్న సీబీఐగా మేము భావించవచ్చా? "

వాళ్ళు షాకయ్యారుగానీ వెంటనే కోలుకుని విరగబడి నవ్వారు.

"థూ..నీ.. మీ చానెలోళ్ళకి ఏమయినా తెలివుందా? పిచ్చోడిని పట్టుకుని గంట నుంచీ ఇంటర్వ్యూ చేస్తున్నారు. పైగా వీడ్ని బంగ్లాదేశ్‌లో పోలీసాఫీసరంటున్నారంటే పాగల్‌గాడు ఆడా? మీరా? అని



డౌటుగా ఉంది"

ప్రశ్నల పాండు షాకయ్యాడు.

"అంటే వీడు మెంటలా?"

"మా మెంటల్ దవాఖానాలో రెండేళ్ళ నుంచి ఉన్నాడు. పది దినాల కిందట పారి పోయిండు! ఆడిని ఎతుకుతూంటే మీ చానెల్లో కనిపించాడు. థూ.. నీ.. ఎసంటి ఛానెల్స్ దొరికినయ్‌రా భయ్! పాగల్ గాళ్ళు!" అంటూ ఆ పిచ్చాడిని వ్యాన్‌లో వేసుకుని వెళ్ళిపోయారు వాళ్ళు.

వెంటనే కెమెరా లింక్ కట్ అయింది.

వెంగమాంబా స్క్రీన్ మీదకొచ్చేసింది.

"అనివార్య కారణాలవల్ల ఇంటర్వ్యూ కొనసాగించలేకపోతున్నాం. ఇప్పుడు టెర్ర రిస్ట్ విజయ్ ఇంటి దగ్గర ఏంజరుగుతుందో చూద్దాం.." అంటూండగానే కెమెరా మళ్ళీ రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్‌కు వచ్చేసింది.

"రాజూ! ఇప్పుడు టెర్రరిస్ట్ విజయ్ ఇంటి దగ్గర పరిస్థితి ఎలా ఉంది?"

"చాలా గందరగోళంగా ఉంది వెంగ మాంబా! మరి కాసేపట్లో పెద్ద ఎత్తున పోలీసులకు లంచాలు కొట్టి బెయిల్ మీద ఇంటికి చేరుకుంటున్నట్లు సమాచారం అందుతోంది" అంటూండగానే విజయ్ ఇంట్లోకి అడుగుపెట్టాడు, హమీద్‌మియాతో పాటు.

వెంటనే రాజు అతని మీద దండెత్తాడు.

"నమస్తే టెర్రరిస్టుగారూ!"

"టెర్రరిస్ట్ అన్నావంటే పళ్ళు రాలతయ్"

"ఓకే విజయ్‌గారు.. మీరు టెర్రరిస్ట్ కార్య కలాపాల్ని ఎన్నో ఏటనుంచి చేస్తున్నారు?"

"పుట్టిన ఆరోనెలనుంచే ప్రాక్టీస్ చేస్తున్నా"

"మీ సెల్‌కి టెర్రరిస్టుల నుంచి వచ్చిన ఫోన్‌కాల్ ఆధారంగా మిమ్మల్ని ఆరెస్ట్ చేసి నట్లు తెలుస్తోంది.. మీరేమంటారు?"

"మీ చానెల్స్‌కి కూడా టెర్రరిస్టులు, నక్సలైట్ల నుంచి ఫోన్స్ వస్తూంటాయ్ కదా! మరి మీరంతా కూడా ఆల్‌ఖైదాగాళ్ళేనా?"

ఈలోగా విజయ్ అత్తగారు రాధాబాయ్ కల్పించుకుంది.

"ఇగో! అసలా సెల్‌ఫోన్ మా అల్లుడికి రోడ్ మీద దొరికింది- అది మాది కాదు"

విజయ్ అదిరిపడ్డాడు.

"వ్వాట్? నాకు దొరికిందా?"

"అయినా.. అలాంటి వస్తువులు రోడ్ మీద దొరికినప్పుడు వెంటనే అది పోలీసు లకు హేండోవర్ చేయాలి కదా?" అడి గాడు జర్నలిస్ట్.

"నీకు దొరికిన వస్తువులు నువ్వెన్నిసార్లు పోలీసులకిచ్చావ్?" అడిగాడు జగన్ ఓమూల నుంచీ.

"నాకెక్కడ దొరికేడ్చినయ్?"

"అందుకే నీతులు చెప్తున్నావ్!"

అప్పుడే పోలీస్ ఇన్‌స్పెక్టర్ హడావుడిగా లోపలికొచ్చాడు.

"మిస్టర్ విజయ్ -ఆ సెల్‌ఫోన్ అసలు ఓనర్ దొరికాడు. వాడే అసలు టెర్రరిస్ట్! ఆ ఫోన్ నీదగ్గర ఉండటంవల్ల నువ్వే టెర్రరిస్ట్ అనుకున్నాం! సారీ ఫర్ ఇన్‌కన్వీనియెన్స్"

మేమంతా హేపీగా తప్పట్లు కొట్టి విజ య్‌ని పైకెత్తేశాం.

# HIV / AIDS వారికి శుభవార్త

మీరు గాని, మీ డాక్టర్‌తో గాని వచ్చి నిజనిర్ధారణ చేసుకొని 15 రోజులలోనే 25శాతం (4వ వంతు) ఖచ్చితంగా లక్షణములు తగ్గించుకొని మంచి ఆకలిని, నిద్రను పొంది, భయము, ఆందోళన మరియు ఆవేదన తగ్గించుకొని క్రమేణా కంట్రోల్, నార్మల్, నెగెటివ్ ఏది కావాలో అంతవరకు మందులు వాడి మీరే పొందండి.

HIV/ ఎయిడ్స్ వైరస్ క్షీణించే మందు ప్రపంచంలో ఇంతవరకు లేకపోవుటచే HIV పెరుగుచుండుట వలన ఎల్లప్పుడూ శరీరం వేడిగా ఉండి క్షీణించుచుండుట, ఆకలి లేకపోవుట ఈ రెండు లక్షణములు ఎన్ని రకముల మందులు వాడినను మనిషి జీవించి ఉండగా తగ్గుట కల్ల. కానీ మా మందులు HIV వైరస్‌ను నిముషములో నశింపచేయు శక్తి కలిగివుండుటవలన 48 గంటలలోనే అతి వేడి తగ్గి మంచి ఆకలి, నిద్రను పొంది శరీరం క్షీణించుట, తగ్గుటవలన 15 రోజులలోనే భయము, ఆందోళన తగ్గి మంచి ధైర్యవంతులు కాగలరు. అందువలన టి.బి. మరియు కేన్సర్ ముదిరిన వారు తప్ప 4 నెలలు మందులు వాడి, మేము చెప్పిన పత్య పానాదులు జీవితాంతం పాటించుచున్నవారు మాత్రమే రక్షించబడుచున్నారు. ఇది సరికాదు అని నిరూపిస్తే 2 లక్షల రూపాయల బహుమతి ఇవ్వబడును. మా మందులు ICMR, CCRAS, NACO, NARI వారిచే ప్రశంసించబడి, GMP సర్టిఫికెట్ పొందిన జి.పి.నేచురల్ హెర్బ్స్ ఫార్మాస్యూటికల్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారిచే తయారుచేయబడి సెంట్రల్ గవర్నమెంటు వారిచే పేటెంటు హక్కు పొంది 1500 కేసులు చేసిన ఏకైక సంస్థ. ఫ్రీ కన్సల్టేషన్, హెర్పిస్, హైపటైటిస్-బి, ఆస్తమ, మూర్ఛ, చర్మము, కీళ్ళు, నరములు, స్త్రీ, పిల్లల, లివర్ సంబంధిత దీర్ఘ వ్యాధులకు సంప్రదించండి.



డా॥ పి.యస్.వి.సత్యనారాయణ
Expert Physician
(ఎయిడ్స్ / కేన్సర్)

**డా॥ పి.యస్.వి.సత్యనారాయణ,**
గారిని ఎయిడ్స్ వైద్యం గురించి
వైద్య ఆరోగ్య శాఖ న్యూఢిల్లీ వారి ప్రశంసలు.

1. నేషనల్ ఎయిడ్స్ కంట్రోల్ ఆర్గనైజేషన్ (NACO) తేదీ: 13 /11/00 మీరు ఆరుగురు ఎయిడ్స్ పేషెంట్లకు వైద్యం చేసి నివారణ (CURE) చేసినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాము. మా సంస్థ మిమ్మల్ని ప్రోత్సహాస్తుంది. ఈ సహస్రాబ్దిలో ఎయిడ్స్ రోగుల (400 మంది) కోసం సల్పిన కృషి ఎంతో ప్రోత్సాహకరముగా ఉంది. ఆ నెగెటివ్ పేషెంట్ల వివరాలు 1) కుమార్ 21 సం॥ 2) కీరవాణి 1 1 /2 సం॥ 3) శైలజ 20 సం॥ 4) రమణ 40 సం॥ 5) రవళి 18 సం॥ 6) వెంకట్ 21 సం॥పైన తెలిపిన వివరములతోపాటు 1275 మంది చికిత్స పొందిన వారి వివరములు కూడా తెలుసుకోవచ్చును.

2. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసెర్చ్ (ICMR) తేదీ: 28-2-97 నిపుణుల కమిటీచే మీరు పంపిన ఫలితములు ఆమోదించబడి నిజనిర్ధారణ కొరకు నేషనల్ ఎయిడ్స్ రీసర్చ్ ఇనిస్టిట్యూట్ పూనేకు పంపడమైనది. వివరముల ఫలితం ఈ క్రింద పేర్కొనబడినది.

3. నేషనల్ ఎయిడ్స్ రీసెర్చ్ ఇనిస్టిట్యూట్ (NARI)28-9-01 ఈ తేదీన మీరు ఇచ్చుచున్న నాలుగు రకముల మందులు ఎక్కవ మోతాదులో కూడా ఏవిధమైన దుష్ప్రభావములు లేవు మరియు రక్తములో ఉన్న (HIV) వైరస్‌ను క్షీణింపచేయుచు ఇమ్యూనిటీని పెంపొందించు శక్తి కలిగియున్నది.

4. సెంట్రల్ కౌన్సిల్ ఫర్ రీసెర్చ్ ఇన్ ఆయుర్వేద అండ్ సిద్ధా (CCRAS) 29-05-02 ఈ తేదీన ఇప్పటివరకు మీరు దాదాపు 400 మంది HIV/ఎయిడ్స్ రోగులకు చికిత్స చేసారని రికార్డులు రుజువులు, నివేదికలు తెలుపుతున్నాయి. ప్రస్తుత కాలంలో పట్టిపీడిస్తున్న HIV/ఎయిడ్స్ అనే జటిల సమస్యను పరిష్కరించేందుకు శాస్త్రీయ పద్ధతులలో మీరు గణనీయంగా కృషి చేసారని కౌన్సిల్ అభిప్రాయం పడింది మరియు టాక్సీ సిటీ (TOXICITY) స్టాండర్డైజేషన్ & టెస్టులు చేయించుకొని గుడ్ మెడికల్ ప్రాక్టీసనర్ అనిపించుకోండి అని ప్రసంసించినారు. పై టెస్ట్‌లో (IICT) వారిచే చేయించబడిన వివరములు.

5. ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ కెమికల్ టెక్నాలజీ (IICT) 11-07-05 ఈ తేదీన ఒక కేజీ బరువుగల వ్యక్తికి 2000 మిల్లీగ్రాములు (2గ్రాములు) ఇచ్చిననూ ఏ విధమైన దష్ఫలితములు లేవు అంటే 60 కేజీలు బరువుగల మనిషికి 2X60=200 గ్రాములు ఒక్కరోజు మోతాదులో ఇచ్చినను ఏ విధమైన (సైడ్ ఎఫెక్ట్స్) దుష్ఫలితములు లేవని నిర్ధారించబడినది. మేము 4 నెలలు (120 రోజులు) ఇచ్చు పూర్తి మందులకు సమానం.

కోర్టు తీర్పు తేదీ 26-04-05 సి.సి.నెం.934 ఆఫ్ 2002 డా॥ పి.యస్.వి. సత్యనారాయణ క్వాలిఫైడ్ ఆయుర్వేదిక్ డాక్టర్. మందుల తయారు చేయుటకు లైసెన్స్ ఉండుటవలన అమ్ముకోవచ్చు. పేషెంట్స్‌కు కూడా ఇవ్వవచ్చు అని కోర్టు నిర్ధారించినది.

గమనిక: యథార్థ విషయాలు పట్టించుకోకుండా కొంత మంది అసూయ, అవినీతిపరులైన డాక్టర్లు మీడియాల యొక్క దుష్ప్రచారం నమ్మి మీ ఆరోగ్యం, మనసును పాడు చేసుకోకండి. ఏమాత్రం హృదయం ఉన్న వారెవరైనా మాకు ముందుగా తెలియపర్చి అధికార పూర్వకంగా వచ్చి సంప్రదించి రుజువులు చూసుకొని మాట్లాడమనండి.

జి.పి.ఇనిస్టిట్యూట్ (హాస్పిటల్)
ఆఫ్ ఆల్టర్‌నేటివ్ థెరపీస్ అండ్ రీసెర్చ్ సెంటర్
నెం. 1-8-499/6, శ్రీ వెంకటేశ్వరస్వామి గుడివీధి,
చిక్కడపల్లి, హైదరాబాద్-20
Ph: 66615411,27605827,
Cell: 98490 07228, 98493 96838

"నేను నిజంగా టెర్రరిస్ట్‌ని కాదు గనుక - ఈ కేసు నిలవదని నాకు తెలుసు! కానీ ఈ తుగ్లక్ చానెల్ వెధవలు నాకు చేసిన డామేజీకి వీళ్లను వదల్డానికి వీల్లేదు. ముందు రుజువు చేసుకోకుండా ఎవరినిప డితే వాడిని క్రిమినల్ అనీ, దొంగలనీ, రేపి స్టనీ, వరకట్న దోషి అనీ- ఇష్టం వచ్చినట్లు అడ్డమైన అభూత కల్పనలూ టెలికాస్ట్ చేసి - రాష్ట్రమంతా న్యూసెన్స్ క్రియేట్ చేసినం దుకు ఫిజికల్ బాదుడు బాదితే గానీ ఇంకో సారి ఒళ్ళు దగ్గర పెట్టుకోరు" అన్నాడు విజయ్ ఆవేశంగా.

దాంతో మా అపార్ట్‌మెంట్స్‌వాళ్ళందరూ తుగ్లక్ చానెల్ కెమెరా మీదా, జర్నలిస్ట్ మీదా విరుచుకుపడ్డారు.

ఆ తరువాతేం జరిగిందో మాకు తెలీదు గానీ గంట తర్వాత మేమందరం పోలీస్ స్టేషన్లో ఉన్నాం.

హమీద్‌మియాతో పోలీస్ ఇన్‌స్పెక్టర్ మాట్లాడుతున్నాడు.

"ఆ చానెలోడిది తప్పే అనుకోండి! అయినా చట్టం మీ చేతిలోకి తీసుకున్నారు కాబట్టి కేస్ తప్పదు"

"సరే కానీండి! ఎంతదూరం వస్తుందో మేమూ చూస్తాం" అన్నాడు మొహిందర్ సింగ్.

ఇన్‌స్పెక్టర్ నవ్వాడు.

"కానీ ఎంత కాలమని లాకప్‌లో ఉంటారు? మీ ఆఫీసులు, ఇంటి వ్యవహా రాలకూ ప్రాబ్లెమ్ కదా? "

"మేమెందుకుంటాం? బ్రోకర్లకు డబ్బు పారేస్తే బెయిల్ నిమిషాల్లో దొరుకుద్ది"

"పోనీ ఆ బ్రోకర్లకిచ్చేది మాకే పారేస్తే మేమే వదిలేస్తాం కదా? "

"అన్నా! నాక్కూడా నాల్రూపాయలు ఇమ్మనన్నా! నన్ను మరీ టూమచ్‌గా బాదారు" అన్నాడు దూరంనుంచి జర్నలిస్ట్ రాజు.

©

## సరదాగా మనీకోసం

మేమంతా అపార్ట్‌మెంట్స్‌లోని సమ స్యలు పరిష్కరించుకోవడానికి మీటింగ్ పెట్టుకున్నాం! ఆదివారం కావటంవల్ల హౌస్‌ఫుల్ అయింది మీటింగ్ ఏరియా.

మీటింగ్ మధ్యలో బోస్ హడావుడిగా వచ్చాడు. నేనూ, బోస్, విజయ్‌యాదవ్ - ముగ్గురమూ ఒకటే ఆఫీస్‌లో పనిచేస్తుండ టంవల్ల తనకే ప్రాబ్లెమ్ వచ్చినా బోస్ మమ్మల్నే డిస్టర్బ్ చేస్తుంటాడు.

పక్కకెళ్ళాక "ఏంటి మేటరు? " అనడి గాడు విజయ్‌యాదవ్.

"నేను ఇవాళ హాస్పిటల్లో చేర్తున్నా" అన్నాడు హేపీగా.

మా ఆఫీస్‌లో ఎవరయినా సరే హాస్పి టల్లో చేరాల్సి వచ్చినప్పుడు ఇలాగా హేపీగా నవ్వుతూ- సింగపూర్‌లో సెటిలవు తున్న లెవెల్లో ఆ విషయం చెప్తుంటారు.

మాకు అర్థమయింది.

బోస్ హాస్పిటల్లో చేరుతున్నాడంటే అర్థం- మా కంపెనీ ప్రతి ఎంప్లాయీకీ ఇచ్చే రెండు లక్షల రూపాయల మెడికల్ రీఎంబర్స్‌మెంట్ కాజేయటానికే అని వేరే చెప్పక్కర్లేదు.

మెడికల్ రీఎంబర్స్‌మెంట్ ఫ్రాడ్ కథ ఇలా ఉంటుంది- మా ఆఫీస్ ఉద్యోగి ముందుగా ఏదో ఒక సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ ఇన్‌ఛార్జ్‌ని కలుసుకుంటాడు.

"మీ హాస్పిటల్లో నేను మేజర్ ఆపరేషన్ కోసం చేరాననుకోండి! ఆ ఆపరేషన్ చేయ డానికి రెండు లక్షలు ఖర్చవుతుందికదా! నిజానికి నాకే రోగమూ లేదనుకోండి! అయినా ఏదో ఒక మాయరోగం ఉందని చెప్తాను. వెంటనే మీరు టెస్ట్‌లు చేసి ఆప రేషన్ అవసరం అంటారు.

ఆ రెండు లక్షలూ మా ఆఫీస్ వాళ్ళు

మీకు చెక్కిస్తారు. మీరు ఆ చెక్కు తీసుకుని అందులో లక్ష రూపాయలు నొక్కేసి మిగతా లక్ష నాకిచ్చేస్తారు. దాంతో నేను హేపీ. ఏ ఆపరేషనూ చేయకుండానే లక్ష కొట్టేస్తారు. కాబట్టి మీరూ హేపీ! ఎంప్లాయీకి ఖర్చుపెట్టాం కదా అని మా కంపెనీ హేపీ! ఎలావుంది స్కీమ్?" అనడుగుతాడు.

స్పెషలిస్టులు ఎగిరి గంతేసి ఒప్పుకుంటారు. ఇదీ జరిగే తతంగం.

ఆ లెక్క ప్రకారమే బోస్ హాస్పిటల్లో చేరాడు.

మాలోమేము- సాయం చేసుకునే టైప్ కాబట్టి వెంటనే నేనూ, విజయ్‌యాదవ్ మా బాస్‌రూమ్‌లోకి పరుగెత్తాం.

"సార్! మీకీ విషయం తెలుసా?"

"ఏంటది?"

"అదేసార్- మన బోస్‌కి రాత్రి పాపం చాలా సీరియస్ అయింది. హాస్పిటల్లో చేరాడు" చెప్పాను నేను.

మా బాస్‌కు ఈ వ్యవహారమంతా ముందే తెలుసు. అయినా అదేం తెలీనట్లు నటిస్తాడు.

"అరే.. అలాగా? ఏమైంది పాపం?"

"తెలీదుసార్! డాక్టర్లు టెస్ట్ చేస్తున్నారు"

"అయ్యో! ఎంతో మంచి వ్యక్తి! మనాఫీస్‌కి అతనొక ఎసెట్" అన్నాడు బాస్.

"నేను సాయంత్రం వచ్చి బోస్‌ని చూస్తాను! ఏ హాస్పిటల్లో ఉన్నాడు" అడిగాడు మా బాస్ రత్నం.

"కనకధార సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ సార్. థర్డ్‌ఫ్లోర్‌లో ఉంటాడు సార్" చెప్పాడు విజయ్‌యాదవ్.

"పాపం! అతడున్న రూమ్‌లో ఎల్‌సీడీ టీవీ ఉందా?"

"లేద్సార్- ఆర్డినరీ టీవీ ఉంది"

"వెంటనే ఎల్‌సీడీ టీవీ ఉన్న రూమ్‌కి మార్చమనండి! రెంట్ ఎంతయినా ఫరవాలేదు. ఇలాంటి పరిస్థితిలో ఉన్నప్పుడు



మనిషికి మాగ్జిమమ్ కంఫర్ట్స్ అవసరం"

"అబ్బ! మీదెంత జాలిగుండె సార్"

"సరే - సాయంత్రం ఒకసారి వెళ్ళి చూసొద్దాం!" అంటూండగానే ఓ సూట్‌వాలా రూమ్‌లోకొచ్చాడు.

"హలో రత్నం! నా పేరు పుష్పారావ్. ఇంటిపేరు తుమ్మెద. మన పంజాబ్ హెడ్డాఫీస్ నుంచి వచ్చాను. నన్ను అర్జంటుగా ఈ ఆఫీస్ బాస్‌గా టేకోవర్ చేయమని మన ఎండీగారు ఇక్కడికి పంపించారు. దిసీజ్ ది ట్రాన్స్‌ఫర్ ఆర్డర్" అంటూ ఓ లెటర్ మా బాస్‌కిచ్చాడు.

మాతోపాటు రత్నమూ షాకయ్యాడు.

ఆ లెటర్ తీసుకుని చదివాడు.

"మైగాడ్! నన్ను నోయిడా బ్రాంచ్‌కి ట్రాన్స్‌ఫర్ చేశారా?" అన్నాడు దిగాలుపడిపోతూ.

నోయిడాకి ట్రాన్స్‌ఫర్ చేయడమంటే పనిష్మెంట్ అని మా అందరికీ తెలుసు. వెంటనే తన సీట్లో పుష్పారావ్‌ని కూర్చోబెట్టి, మమ్మల్ని పరిచయం చేశాడు రత్నం.

సాయంత్రంవరకూ ఆఫీసంతా అదే చర్చ కొనసాగింది.

మధ్యలో బోస్ ఫోన్ చేశాడు.

"బ్రదర్! నాకు వచ్చింది హార్ట్ ఎటాక్!" అని నేనూ మా స్పెషలిస్ట్ డాక్టరూ కలిసి డిసైడ్ చేశాం. రేపు ఎర్లీమానింగ్ ఆపరేషన్ జరుగుతున్నట్లే లెక్క" అన్నాడు.

ఆఫీస్‌లో బాస్ మారిపోయిన సంగతి చెప్పి 'బెస్టాఫ్ లక్' చెప్పాం.

ఆ సాయంత్రం అందరం కలిసి ఇళ్ళకు బయల్దేరబోతూండగా కొత్త బాస్ నుంచి పిలుపు వచ్చింది విజయ్‌యాదవ్‌కి.

వెంటనే లోపలికొచ్చాడు విజయ్. అప్పుడు నేను బాస్ దగ్గరే ఉన్నా!

"విజయ్‌యాదవ్ మీ సెక్షన్‌లో పనిచేస్తున్న బోస్ అనే అతను సడెన్‌గా హాస్పిటల్లో జాయినయ్యాడని తెల్సింది. ఏ హాస్పిటల్? "

"అదేసార్ జనరల్‌గా మా ఆఫీస్ స్టాఫ్ ఏ ప్రాబ్లెమ్ వచ్చినా కనకధార సూపర్ స్పెషాలిటీలోనే జాయినవుతూంటారు"

"ఓ! కనకధార అంటే వర్షంలా గోల్డ్ కురుస్తుందన్నమాట!"

అది జోక్ అనుకుని మేము కొంచెం ఓవర్‌గా నవ్వాం! కానీ బాస్ నవ్వలేదు.

"అవునూ! ఆ హాస్పిటల్లో చాలా సౌకర్యాలున్నాయా.. అందరూ అక్కడే జాయినవ్వుతున్నారు? " అడిగాడు పుష్పారావ్.

"అవున్సార్! అక్కడ బ్రేక్‌ఫాస్ట్, లంచ్-అన్నీ సూపర్ సార్. ఇక ట్రీట్‌మెంట్ సంగతి సరేసరి! అంతా ఫారిన్ రిటన్డ్ డాక్టర్లే"

"యా! నేనూ విన్నాను. అన్నట్లు ఆ హాస్పిటల్లో మెడికల్ బిల్ రీఎంబర్స్‌మెంట్ ఫ్రాడ్‌కూడా సూపర్‌గానే చేస్తారా? "

"అవున్సార్, సూపర్ క్వాలిటీ" అనేదో చెప్పబోయి నాలిక్కరచుకున్నాడు విజయ్ యాదవ్.

"అహహ! అలాంటిదేమీ.. ఐమీన్..."

పుష్పారావ్ హేపీగా నవ్వాడు.

"ఏంటి? అలాంటిదేమీ లేదా? "

"అస్సల్లేదు సార్" అన్నాన్నేను.

"అయినా మెడికల్ బిల్ రీఎంబర్స్‌మెంట్‌లో ఫ్రాడేముంటుంది సార్? వాళ్లు ట్రీట్‌మెంట్ ఇస్తారు. అవసరమైతే ఆపరేషన్ చేస్తారు. మన ఆఫీస్ వాళ్లిచ్చే చెక్ తీసుకుంటారు" నన్ను కవర్ చేశాడు విజయ్‌యాదవ్.

"అంతేనా? ఆ తరువాత ఇంకేం కథ లేదా? " పుష్పరాజ్ అడిగేసరికి నాకు కొంచెం భయం పట్టుకుంది.

"వీడెవడోగానీ కొంచెం ముదురు కేస్ లెక్కున్నాడు" అన్నాడు విజయ్‌యాదవ్ నా చెవిలో.

"అవునవును"!

"తర్వాత ఇంకేం కథలుంటాయ్‌సార్? " ఏమీ తెలీనట్లు అమాయకంగా మొఖం పెట్టి అడిగాడు విజయ్.

"మీరు మహా ఇన్నోసెంట్ అయినా అయ్యుండాలి.. లేదా మహా ముదుర్లయినా అయ్యుండాలి" అన్నాడు పుష్పారావ్ మావంక డౌటుగా చూస్తూ.

మా గుండెల్లో రాయి పడింది.

"ఎందుకలాంటి డెసిషన్‌కు వచ్చారు సార్? "

"ఎందుకంటే - మన ఆఫీస్ ఇచ్చే మెడికల్ రీంబర్స్‌మెంట్‌లో సగం హాస్పిటల్ వాళ్లు, సగం మీరు కొట్టేస్తున్నారని విజిలెన్స్ రిపోర్ట్ వచ్చింది హెడ్డాఫీస్‌కి. అసలు నన్నిక్కడికి ఇంత అర్జెంటుగా ట్రాన్స్‌ఫర్ చేయడానిక్కూడా అదే కారణం!"

"అలాగా సార్? " అన్నాడు విజయ్.

"నిజానికి చాలా మంది ఆపరేషన్లు కాదు కదా.. జలుబుకి కూడా ట్రీట్‌మెంట్ తీసుకోకుండా లక్షలు కాజేస్తున్నారని రుజు

వులున్నాయ్"

రుజువుల వరకూ వస్తే మేమింకేం మాట్లాడతాం? ఎందుకయినా మంచిదని సైలెంట్‌గా ఉండిపోయాం.

"ఇప్పుడు ప్రస్తుతం ఎంత మంది మన స్టాఫ్ హాస్పిటల్లో ఉన్నారో మీకు తెలుసా? " అడిగాడు పుష్పారావ్

"బోస్ ఒక్కడే సార్"

"అయితే రేపే మనం ముగ్గురం ఒక సారి బోస్‌ని చూడ్డానికెళ్దాం"

మాగుండెల్లో పెద్దసైజ్ రాయి పడింది.

కొంపదీసి బోస్ జబ్బుమీద డౌటొచ్చి ఉంటుందా? అదే కరెక్టయితే చాలా పెద్ద ప్రాబ్లెమ్!

మా మీటింగ్ అవగానే వెంటనే ఇద్దరం హాస్పిటల్‌కి చేరుకున్నాం. కానీ బోస్ తన రూమ్‌లో కనిపించలేదు. డాక్టర్లు, నర్సులు ఎవర్నడిగినా తెలీదన్నారు.

బోస్ సెల్ ఆఫ్ చేసి ఉంది.

"కచ్చితంగా వీడు ఐమాక్స్‌కు వెళ్లి ఉంటాడు" అన్నాడు విజయ్.

"అవును! ఛాన్స్ దొరికితే చాలు సినిమా కెళ్లటం వీడికి అలవాటు"

"తీరా రేపొద్దున్న మనం బాస్‌ని తీసుకెళ్లేసరికి ఇలాగే బెడ్‌మీద లేడనుకో! కొంప మునిగిపోతుంది"

"రాత్రి మళ్లీ ఫోన్ చేసి జాగ్రత్తగా ఉండమని చెప్దాంలే"

ఇద్దరం ఇళ్లకెళ్లిపోయాం. రాత్రి పదకొండింటికి ఫోన్ లిఫ్ట్ చేశాడు బోస్.

జరిగిందంతా చెప్పేసరికి బోస్ గాబరా పడ్డాడు.

"లేనిపోని ప్రాబ్లెమ్‌లో ఇరుక్కున్నానే! ఇప్పుడేం చేద్దాం? " అడిగాడు బోస్.

"నిండా మునిగాక చలెందుకు? అయినా రేపు మేము బాస్‌ని హాస్పిటల్‌కి తీసుకొచ్చేసరికి ఎలాగూ పదకొండయిపోతుంది. అప్పటికే ఆపరేషనయిపోయినట్లూ, ఇంకా అనస్తీసియా ఎఫెక్ట్‌లోనే



స్పృహ లేకుండా ఉన్నట్లూ వీరనటన ప్రదర్శించు! దాంతో బాస్ హేపీగా ఫీల్ అయి వెళ్లిపోతాడు"

"సరే" అన్నాడు నీరసంగా

మర్నాడు అనుకున్నట్లే బాస్‌తో కలిసి హాస్పిటల్‌కి చేరుకున్నాం.

ఐసీయూలోకి వెళ్తుంటే నర్స్ పరుగుతో వచ్చి అడ్డుగా నిలబడింది.

"పేషెంట్ పేరేమిటి? " అడిగింది.

"బోస్ అనీ.. బైపాస్ సర్జరీ కేస్"

"ఉదయమే ఆపరేషనయిందండీ! పేషెంట్ ఇంకా స్పృహలోకి రాలేదు"

"ఒక్కసారి చూసి వెళ్లిపోతాం" అన్నాడు పుష్పారావ్.

నర్సు తప్పుకుంది.

ముగ్గురం బోస్ బెడ్ దగ్గరకెళ్లాం! నిజంగా ఆపరేషన్ జరిగినట్లే మొత్తం అట్మాస్ఫియర్ సృష్టించారక్కడ.

బోస్ స్పృహలో లేనట్లు పడుకుని ఉన్నాడు.

"ఓకే పదండి పోదాం" అన్నాడు.



ముగ్గురం బయటికొచ్చాం!

"బోస్‌ని ఐసీయూ నుంచి రూమ్‌కి షిఫ్ట్ చేశాక నాకు చెప్పండి! ఎందుకంటే అదే రోజు నేను ఒక హార్ట్ స్పెషలిస్ట్‌ని తీసుకెళ్లి బోస్‌కి జరిగిన ఆపరేషన్ చెక్ చేయిస్తాను. ఆపరేషన్‌కి రెండు లక్షలు ఖర్చవుతుంది అని ఆ స్పెషలిస్ట్ సర్టిఫికెట్ ఇస్తేనే హెడ్డాఫీస్ ఆ డబ్బులకు రీఎంబర్స్‌మెంట్ చెక్ పంపిస్తుంది" అన్నాడు బాస్.

బోస్ మెడకు బాస్ ఉచ్చు బిగించినట్లనిపించింది.

"అలాగే సార్" అన్నాడు విజయ్.

బాస్ వెళ్లిపోయాక ఇద్దరం మళ్లీ బోస్ దగ్గరకు పరుగెత్తాం.

అప్పటికే వాడు ఐసీయూ నుంచి తన రూమ్‌కు వెళ్లి చికెన్ బిర్యానీ తింటూ కనిపించాడు.

"ఒరేయ్! నీ బిర్యానీ తగలెయ్య! ఓ పక్క నీ ప్రాణం మీద కొచ్చిందిరా వ్యవహారం!"

"ఏమయింది? "

"నువ్ ఐసీయూ నుంచి రూమ్‌కి రాగానే బాస్ ఒక హార్ట్ స్పెషలిస్ట్‌ని తీసుకొచ్చి నీ ఆపరేషన్ డిటెయిల్స్ అన్నీ స్టడీ చేయిస్తాడంట! ఆ హార్ట్ స్పెషలిస్ట్ కూడా నీకు నిజంగానే ఆపరేషన్ అయినట్లూ, ఆ ఆపరేషన్‌కి రెండు లక్షలు ఖర్చు అవుతుందనీ లెటర్ రాసి మన బాస్‌కివ్వాలంట! ఆ లెటర్‌ని బాస్ హెడ్డాఫీస్‌కి పంపితేనే నీకు రీఎంబర్స్‌మెంట్ చెక్ వస్తుందట!"

బోస్ మొఖంలో కళ తప్పింది.

"ఓగాడ్! ఇప్పుడెలా! భలే ఇరుక్కుపోయానే"

"లక్ష రూపాయలు ఫుక్కట్‌గా సంపాయించాలంటే రిస్క్ కూడా ఉంటుందోయ్"

"ఒరేయ్! ఇప్పుడెలా ఈ న్యూసెన్స్ నుంచి తప్పించుకోవటం! ప్లీజ్ ఎమయినా అయిడియా ఇవ్వండ్రా!" కంగారుగా అడిగాడు.

"మేమూ అదే ఆలోచిస్తున్నాం"

ముగ్గురం బీరు కొట్టి ఆలోచించినా ఉపాయం తట్టటం లేదు.

"ఒక వేళ బాస్ తీసుకొచ్చే హార్ట్ స్పెషలిస్ట్‌కి ఇదంతా మెడికల్ ఫ్రాడ్ అన్న మేటర్ తెల్సిపోయిందనుకో! అప్పుడేం జరుగుద్ది? " దౌటుగా అడిగాడు బోస్.

రీఎంబర్స్‌మెంట్ ఫ్రాడ్ కేస్ ఇప్పటికి మన కంపెనీ హెడ్డాఫీసులో ఒక్కటే జరిగిందంట! వెంటనే అతన్ని జాబ్ నుంచి డిస్మిస్ చేశారట"

విజయ్ యాదవ్ ఇచ్చిన ఇన్‌ఫర్మేషన్‌తో బోస్ షాక్ తిన్నాడు.

"ఓగాడ్! నిజంగానా? "

"సెంట్‌పర్సెంట్ నిజం!"

"ఓ గాడ్.. ఓ గాడ్!"

రెండో బీర్‌బాటిల్ కూడా ఖాళీ చేశాక విజయ్ యాదవ్‌కి బ్రహ్మాండమైన అయిడియా వచ్చింది.

*(మిగతా వచ్చే సంచికలో)*

ట్యాంక్ బండ్ 33 కథలు






# తాతబ్బాయి

ఎన్నాళ్ల నుంచో హైదరాబాద్‌లోని ట్యాంక్ బండ్‌ను, హుస్సేన్ సాగర్‌లోని బుద్ధవిగ్రహాన్ని చూడాలన్నది తాతబ్బాయి కోరిక. అది తీరని కోరికగానే మిగిలిపోతుందేమోనని నిరాశపడుతున్న సమయంలోనే అతనికో మంచి అవకాశం వచ్చింది. అందుకే ఆ సాయంత్రం ఆరుగంటలకల్లా

పనులు పూర్తిచేసుకుని ట్యాంక్‌బండ్‌కు చేరుకున్నాడు.. రెయిలింగ్ పక్కనే ఉన్న చెక్కబెంచీ మీద కూర్చుని ఆ జలాశయాన్ని, అందులో కొలువైన బుద్ధభగవానుడ్ని తనివితీరా చూస్తున్నాడతను.

పేరులో తాత ఉంది కాబట్టి తాతబ్బాయి అంటే ముసలోడేంకాదు.. పైలాపచ్చీసు వయసులోని వాడే! గుంటూరు జిల్లాలోని ఓ పల్లెటూరు అతనిది. హైస్కూల్లో చదివే రోజుల్లో అందరూ ట్యాంక్‌బండ్ గురించి, బుద్ధవిగ్రహం గురించి గొప్పగా మాట్లాడడం అతనికెంతో ఆసక్తి కలిగించింది. పేపర్లలో కూడా వాటి గురించి చదివేసరికి ఆసక్తి మరింత బలపడింది. పదోతరగతితోనే చదువు మానేసిన అతను పేదరికం కారణంగా సొంత ఊళ్లోనే ఓ చిన్న కిళ్లీకొట్టు పెట్టుకుని బతుకీడుస్తున్నాడు.. మూడేళ్లక్రితం పెళ్లి అయింది. ఇద్దరు పిల్లలు. కుటుంబ బాధ్యతలు.. గొర్రెతోక ఆదాయంతో ఇక ఆ కోరిక తీరే మార్గమే లేకపోయింది.. ఆ పరిస్థితుల్లో ఓ రోజు తాతబ్బాయి ఊరికి చెందిన రాజశేఖరంగారు తాతబ్బాయిని పిలిపించాడు. హైదరాబాద్‌లో ఉంటున్న తన కూతురు దగ్గరకు వెళ్తున్నాననీ.. ఆరోగ్యం బాగా లేనందున కాస్త తోడుగా రమ్మనీ పిలిచాడు. రానుపోనూ ఛార్జీలు, ఖర్చులు పెట్టుకుంటానని కాస్త మనిషి సాయంగా రమ్మని అభ్యర్థించాడు.

ఇకనేం? తాతబ్బాయి రొట్టె విరిగి నేతిలో పడింది. హుషారుగా సరేనన్నాడు. అలా హైదరాబాద్‌కు వచ్చి ట్యాంక్‌బండ్‌ను చూసే తన చిరకాల వాంఛను నిజం చేసుకున్నాడతను. అతనలా తాదాత్మ్యంలో ఉండగా..

"ఏయ్ ఎవర్నువ్వు? " అనే ప్రశ్న వెనక నుంచి వినబడింది.

ఉలిక్కిపడి వెనుతిరిగి చూసిన తాతబ్బాయి వంక కోపంగా మింగేలా చూస్తూ నిలబడి ఉన్నాడో పెద్దాయన.

"ఏంటలా చూస్తున్నావ్? ముందిక్కణ్నుంచి లెగు" అన్నాడు దాష్టీకంగా.

తాతబ్బాయికి మండింది. ఎవడు వీడు? నన్ను లెమ్మంటాడేంటి? పోనీ మర్యాదగా చెబితే పెద్దమనిషని లేచేవాడేమో కానీ ఏంటీ దబాయింపు? అనుకొని మొండిగా 'లేవనుగాక లేవను' అన్నాడు.

"ఎందుకు లేవవు.. ఇది నా బెంచీ. ఏడాది నుంచీ రోజూ ఇక్కడే కూర్చుంటున్నాను.." అరిచాడా పెద్దాయన.

"అయితే ఏంటట? నేనొచ్చేసరికి నువ్వు ఉన్నావా? లేవు. ఖాళీగాఉంది కూర్చున్నా. అయినా అంత పట్టుదలేంటి? ఆ పక్కన బెంచీలు ఖాళీగానే ఉన్నాయిగా పోయి కూర్చోరాదా? " గట్టిగానే జవాబిచ్చాడు తాతబ్బాయి.

పెద్దాయన బూతులు తిట్టాడు.. తాతబ్బాయి కూడా తగ్గలేదు.. మాటకు మాట! తిట్టుకు తిట్టు చెల్లబెట్టాడు.

చుట్టూ చేరిన జనం కొందరు తాతబ్బాయిని సమర్థించారు. 'పోనీ పెద్దాయన అడిగాడని ఆ పోరగాడు లేవచ్చు గదా? ' అని ఇంకొందరు పెద్దాయనకు వత్తాసు పలికారు.

ఏదేమైనా సరే లేవనుగాక లేవను అని భీష్మించుకు కూర్చున్నాడు తాతబ్బాయి. తన అందమైన కోరిక తీర్చుకునేవేళ ఈ తద్దినం ఏమిటని మనసులో మాత్రం విసుక్కున్నాడు.

జనం ఎవరిదారిన వారు వెళ్లిపోయారు. పెద్దాయన తిట్టుకుంటూనే పోయి పక్క బెంచీమీద కూర్చున్నాడు. చంకకు తగిలించుకున్న సంచీ తీసి ఒళ్లోపెట్టుకున్నాడు. అప్పటిదాకా పెద్దగొంతుతో తనతో లడాయి వేసుకున్న, బూతులు తిట్టిన పెద్దాయన ఎందుకో ఉన్నట్టుండి భోరు

మని ఏడ్చాడు.

చటుక్కున ఆ వైపు చూశాడు తాతబ్బాయి.

అంత పెద్దాయన బేలగా ఏడుస్తూ కన్నీళ్లు పెట్టడం అతని మనసుకు చేదుగా అన్పించింది. ఒకవేళ పిచ్చివాడేమో అనుకున్నాడు. తర్వాత అతన్ని పిచ్చివాడనుకున్నందుకు మనసులో బాధపడ్డాడు. పోనీ తనే అవతల బెంచీమీద కూర్చుంటే పోయేదేమో? తండ్రివయసు పెద్దమనిషిని పట్టుకుని ఎడాపెడా దులిపేశాడు. అంత పెద్దాయన ఓ మాటంటే- పడితే మాత్రం పోయేదేముంది? అనవసరంగా ఆయన మనసు బాధపెట్టాను అనుకున్నాడు. పశ్చాత్తాపం కలిగింది. నిజానికి తన తప్పు లేకున్నా ఓ పెద్దాయనను ఎదిరించి ఆయన మనసు గాయపర్చానే అని ఎంతో ఫీలయ్యాడు.

మెల్లగా లేచి ఆయన దగ్గరకు వెళ్లాడు.

"బాబాయ్.. పెద్దోడివి.. అనవసరంగా నిన్ను బాధపెట్టాను.. రా వచ్చి నీ బెంచీ మీద నువ్వే కూర్చో! నేనిక్కడ కాసేపు కూర్చుని వెళ్తాను" అన్నాడు ప్రేమగా.

పెద్దాయన ఏం మాట్లాడలేదు. ఓసారి కళ్లెత్తి తాతబ్బాయి ముఖంలోకి నిర్లిప్తంగా చూశాడు. తర్వాత తలొంచుకుని తన బ్యాగ్‌లో చెయ్యిపెట్టి ఏవో పుస్తకాలు వగైరాలు బయటకు తీయడం మొదలెట్టాడు.

రెండు నిముషాలు అక్కడే నిలబడి అతనేం మాట్లాడకపోయేసరికి తిరిగి తన బెంచీకి చేరుకున్నాడు తాతబ్బాయి.

మరో రెండు నిముషాల తర్వాత అక్కడికి ఓ ఆటో వచ్చింది. అందులో నుంచి ఓ పాతికేళ్ల యువతి దిగింది. పెద్దాయన దగ్గరకు వెళ్లి ఏదో మాట్లాడింది.. తనవైపు చేయిచూపి ఆయన ఏదో చెప్పడం తాతబ్బాయి గమనిస్తూనే ఉన్నాడు.

వెంటనే ఆమె తాతబ్బాయి దగ్గరకు వచ్చింది. ఆమెను చూసి లేచి నిలబడ్డాడతను.

"ప్లీజ్ ఏమనుకోకండి.. ఆయన మా నాన్నగారు.. గత ఏడాది ఇదేరోజు సరిగ్గా ఇక్కడి నుండే మా తమ్ముడు సాగర్‌లో దూకి ఆత్మహత్య చేసుకున్నాడు. చదివిన చదువుకు తగిన ఉద్యోగం రాలేదని వాడా ఘాతుకానికి ఒడిగట్టాడు. దూకే ముందు చాలాసేపు ఇదే బెంచీమీద కూర్చున్నాడని పోలీసులు చెప్పారు. అప్పటినుంచి నాన్నగారు ప్రతిరోజూ సాయంత్రం ఇక్కడకి వచ్చి ఇదే బెంచీమీద కూర్చుని వాడి

**మరో రెండు నిముషాల తర్వాత అక్కడికి ఓ ఆటో వచ్చింది. అందులో నుంచి ఓ పాతికేళ్ల యువతి దిగింది. పెద్దాయన దగ్గరకు వెళ్లి ఏదో మాట్లాడింది.. తనవైపు చేయిచూపి ఆయన ఏదో చెప్పడం తాతబ్బాయి గమనిస్తూనే ఉన్నాడు.**

ఫొటోను చూసుకుంటూ ఓ రకమైన ఆత్మ సంతృప్తి అనుభవిస్తున్నారు. అదీగాక ఇవ్వాళ తమ్ముడు పోయినరోజు.. అందుకే.." దుఃఖంతో ఆమె గొంతు పూడుకుపోయింది.

తాతబ్బాయి కళ్లలో అప్రయత్నంగా నీళ్లు.. చివాలున పెద్దాయన వైపు నడిచి "బాబాయి నేనూ నీకొడుకు లాంటివాడినే. నన్ను క్షమించు.. నాకిదంతా తెలీక.." అంటూ పాదాలకు నమస్కరించాడు.

పెద్దాయన ఆప్యాయంగా అతని తలని మిరాడు.

ఆ యువతి అప్పటికే ఆ బెంచీమీద కూర్చుని విచారంగా సాగర్‌వంక చూస్తోంది. కళ్లనుండి నీటి ముత్యాలు జాలువారుతున్నాయి..

– చంద్రప్రతాప్

# కథా కమామీషు..

# జంతుక్షేత్రం

పాఠకులకు ఈనెల చతుర అందిస్తున్న 'జంతుక్షేత్రం' నవల జార్జ్ ఆర్వెల్ రచన. స్టాలిన్‌కు వ్యతిరేకంగా 1943-44 మధ్య కాలంలో రాసిన ఈ నవలను ప్రచురించేందుకు మొదట్లో ఎవ్వరూ ముందుకు రాలేదు. ఆ తరువాత అతికష్టంమీద వెలుగు చూసిన ఈ నవల ఎందరో మేధావుల మన్ననలను చూరగొంది.



జార్జ్ ఆర్వెల్

ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడిన స్టాలిన్‌ను ఆటపట్టిస్తూ నవల రాయడం, దాన్ని ప్రచురించడం అప్పట్లో సాహసమే.

అయితే 'జంతుక్షేత్రం' పేరుతో జార్జ్ ఆర్వెల్ ఆయనపై ఓ వ్యంగ్య నవలను రాశాడు. అంతవరకూ ఆర్వెల్ పుస్తకాల్ని ప్రచురిస్తూ వచ్చిన గోల్లాంజ్ సంస్థ కూడా దీన్ని తిప్పి పంపింది. సుప్రసిద్ధ కవి, రచయిత టి.ఎస్. ఈలియట్ డెరెక్టర్‌గా పని చేస్తున్న ఫేబర్ అండ్ ఫేబర్ సంస్థ కూడా దీని ప్రచురణకు నిరాకరించింది.

ఎట్టకేలకు 1945 ఆగస్టు 17న సెక్కర్ అండ్ వార్‌బర్గ్‌వారు ఈ నవలను లండన్‌లో ప్రచురించారు. సంచలన విజయం సాధించింది. అనతికాలంలోనే ఫ్రెంచిభాషలోకి అనువాదమైంది. అమెరికాలో 1946లో దీన్ని ప్రచురించారు.

## నవల ప్రత్యేకత

1923-2005 మధ్య ఆంగ్లంలో వచ్చిన నూరు గొప్ప నవలల జాబితాలో జంతుక్షేత్రం ఒకటి. ఈ జాబితాను టైమ్ మ్యాగజైన్ విడుదల చేసింది. మోడ్రన్ లైబ్రరీ రూపొందించిన 20వ శతాబ్దపు గొప్ప నవలల జాబితాలో కూడా 31వ స్థానాన్ని కైవశం చేసుకుంది.

## నేపథ్యం

ఆర్వెల్ రాసిన నవలల్లో ప్రఖ్యాతి గాంచినది జంతుక్షేత్రం. కారల్ మార్క్స్-లెనిన్ సిద్ధాంతాల నేపథ్యంలో 1917లో జరిగిన బోల్షివిక్ విప్లవంలో జార్‌పాలనకు అంతం పలకడం, స్టాలిన్-ట్రాట్‌స్కీ మధ్య అధికారంకోసం పెనుగులాట, వెనుకబడిన రష్యాలో పారిశ్రామికీకరణ, ఉత్పత్తి పెంచేందుకు కార్మికులు చేపట్టిన స్టెఖనోవైట్ ఉద్యమం, సోషలిస్టు సిద్ధాంతాలు కనుమరుగు కావడం, పర్జింగ్‌లో పట్టుబడిన పార్టీ వ్యతిరేకుల్ని శిక్షించడం, హిట్లర్‌తో సంధి, ట్రాట్‌స్కీ దేశం వదలి పారిపోవడం, సిద్ధాంతాలకు ఆచరణకూ పొంతనలేక కమ్యూనిస్టుపాలన అంతంకావడం

## ఈ నవల ఇప్పుడెందుకు?




**ఏడు దశాబ్దాల క్రితం క్రాంతదృష్టితో భవిష్యత్ప రిణామాలను చూడగలగడం జార్జ్ ఆర్వెల్ దార్శ నికతకు నిదర్శనం. జంతుక్షేత్రం నవలలో ఆర్వెల్ వ్యక్తం చేసిన భయాలు, అనుమానాలు కాలక్రమే ణా నిజమవుతూ వచ్చాయి. అంతేకాదు.. ఈ నవల ఇరవై ఒకటో శతాబ్దపు నేటి రాజకీయ పరిస్థితు లకూ అచ్చంగా వర్తిస్తుంది. ప్రస్తుత రాజకీయ వ్యవస్థను ప్రతిబింబించే సమకాలీనత ఇందులో అ డుగడుగునా కనిపిస్తుంది. ఈ నవలను చదువుతుం టే మన చుట్టూ తిరిగే నాయకమ్మన్యులు, వారి ప్రగ ల్భాలు, చేష్టలు మన మనోఫలకంపై కదలాడడం ఖా యం. అందుకే ఈ నవలా పఠనం నేటి తరానికి అత్యావశ్యకం.**

తదితరాలు ఈ నవలకు నేపథ్యం. వీటన్నిం టినీ జంతుపాత్రలద్వారా అత్యంత వ్యంగ్య వైభవంతో చెప్పాడు రచయిత.

ప్రభుత్వాల జెండాలు, రంగులు ఏవైన ప్పటికీ వ్యక్తిస్వేచ్ఛను హరించేందుకు అవి పనిచేస్తాయని ఆర్వెల్ ఈ నవలలో తీ వ్రంగా హెచ్చరించాడు. ప్రజల్లోని చైత న్యలేమిని ఆసరాగా చేసుకుని పాలకులు భావోద్వేగాల్ని నియంత్రిస్తూ తిమ్మిని బ మ్మిచేసినట్లు ప్రచారం చేసుకుంటారని అం టాడు. పౌరుల ఆలోచనల్ని కట్టడి చేస్తూ, పాలకులు తమకు అనుగుణంగా మలచు కుంటారని చెబుతాడు. మార్పుకోసం చే సే తిరుగుబాటు కొద్దిమంది చేతుల్లో అధికారాన్ని కేంద్రీకృతం చేసి, నియంతృ త్వానికి దారితీస్తుందంటాడు. అధికారం మనిషిని పతనం చేస్తుందని చెప్పాడు.

ఈ నవలను మరింత విశాలంగా పరిశీలిస్తే ఇందులోని జంతుక్షేత్రం మొత్తం మానవ సమాజానికి వర్తిస్తుంది. ఇందులో అధికారంకోసం నాయకుల పెను గులాటలను దుయ్యబట్టాడు. నాయకులు వల్లించే ఆదర్శాలకు, ఆచరణకు తేడాను ఎత్తి చూపాడు.

ఉన్నత ప్రపంచంకోసం అర్రులుచాచే ప్రజలను పాలకులెలా మోసగిస్తారో, మ భ్యపెడతారో ఈ నవల తెలియజేస్తుంది. అన్యాపదేశంగా, ప్రతీకాత్మకంగా కథను చెప్పడమే ఈ అల్లెగారికల్ నవల ప్రత్యే కత. అన్యాయాన్ని, మూర్ఖత్వాన్ని, క్రూర త్వాన్ని ఎండగడుతూ నియంతలను, నియంతృత్వాన్ని అక్ష రాక్షరంలో ఎద్దేవా చేస్తాడు ఆర్వెల్. భవిష్యత్తు పరిణామా లను ముందుగానే ఊహించిన దార్శనిక రచయితగా జార్జి ఆర్వెల్‌ను ప్రపంచం కొ నియాడింది.

### సెల్యులాయిడ్‌పై ..

జంతుక్షేత్రం నవలను 1954లోనే యానిమేటెడ్ ఫిల్ముగా మలిచారు. నవ లలో మాదిరిగా కాకుండా, నాయకుడు నెపోలియన్ రెండోసారి జరిగిన తిరుగు బాటులో పదవీచ్యుతుడైనట్లు అందులో చూపించారు. 1999లో మరోసారి దీన్నే సినిమాగా తీశారు. ఇందులో సోవియట్ యూనియన్‌లాగే నెపోలియన్ శకం కూడా కుప్పకూలినట్లు చూపించారు.

# జార్జ్ ఆర్వెల్ గురించి...

బర్మాలో 1903లో జన్మించిన జార్జ్ ఆర్వెల్ అసలు పేరు ఎరిక్ హఫ్ బ్లెయిర్. తండ్రి కస్టమ్స్, ఎక్సైజ్ ఉద్యోగి. ఆర్వెల్ పుట్టిన తర్వాత వారి కుటుంబం ఇంగ్లండుకు మారింది. పేదవిద్యార్థిగా ఆర్వెల్ స్కూల్‌లో న్యూనతా భావానికి గురయ్యాడు. దాంతో ఒంటరితనాన్ని ఇష్టపడ్డాడు. ఆ ఒంటరితనమే అతడిని సాహిత్యంవైపు మళ్లించింది. పద్దెనిమి దేళ్లకే బెర్నార్డ్ షా, హెచ్.జి.వెల్స్, గాల్స్‌వర్తీ వంటివారి సాహిత్యాన్నంతా అపోశన పట్టే శాడు. స్విఫ్ట్, జార్జ్ గిస్సింగ్, డికెన్స్ రచనలూ అతడికెంతో ప్రీతి. తర్వాత కేంబ్రిడ్జిలో చదువు కునే అవకాశం వచ్చినప్పుడు అతడి ట్యూటర్, 'నీకు కావాల్సినంత చదువు ఉంది. విదేశాల్లో ఏదైనా ఉద్యోగంలోకి చేరి, ప్రపంచాన్ని చూడు' అని సలహా ఇచ్చాడు.

దాంతో అతడు ఇండియన్ ఇంపీరియల్ పోలీస్ ఉద్యోగిగా బర్మాలో ఐదేళ్లు (1922-27) పనిచేశాడు. 1927లో ఇంగ్లండుకు సెలవులపై వెళ్లాడు. నిజానికి ఉద్యోగం మానేయాలనుకుని అప్పటికే నిర్ణయించుకున్నాడు. వలసపాలన దురాగతాలను ప్రత్యక్షంగా చూడటంవల్ల సామ్రాజ్యవాద యంత్రాంగంలో పోలీసుగా పనిచేయడాన్ని ఇచ్ఛగించలేదు. ప్రజలపై అణ చివేతకు పాల్పడే బ్రిటీష్ ప్రభుత్వానికి ఓ పరి కరంగా ఉపయోగపడటం మనస్కరించలేదు. తీవ్రంగా కలత చెందాడు. బర్మాను వదిలిపెట్టే టప్పుడు అతడి మానసిక పరిస్థితి గురించి ఇలా రాసుకున్నాడు- 'అన్ని ప్రభుత్వాలు ప్రజ లను అణచివేస్తాయి. కేవలం సామ్రాజ్య వాదాన్నే కాదు..మనిషిపై మనిషి చేసే ఏరకం దౌర్జన్యమైనా నశించిపోవాలనే కోరుకుంటాను. అణచివేతకు గురవుతున్న ప్రజలపక్షాన నిలబడి క్రూరపాలకులపై పోరాడతాను'

### నిరుద్యోగిగా అష్టకష్టాలు..

ఆర్వెల్ 1928లో పారిస్‌కు వెళ్లాడు. అక్కడ పుస్తకాలు, వ్యాసాలు రాస్తూ జీవితం గడ పాలనుకున్నాడు. తీవ్రమైన ఆర్థిక ఇబ్బందు లకు గురయ్యాడు. చివరకు అంట్లు తోమే పనీ చేశాడు. తనలాగే వేలాదిమంది యువకులు నిరుద్యోగంతో బాధపడటం గమనించాడు. వారిని చూసి దోపిడీకి, పీడనకూ గురవుతున్న ప్రజల పక్షం వహించాలనుకున్నాడు. 1929 చివర్లో ఇంగ్లండ్‌కు తిరిగి వచ్చాడు. పేదల స్థితి గతులను అధ్యయనం చేసేందుకు దేశమంతా కలియ తిరిగాడు.

### నిరుద్యోగంతో ...

తర్వాత 1929-35 మధ్య ప్రైవేట్ టీచర్‌గా పనిచేస్తూనే పుస్తకాలు రాస్తూ, మరోపక్క జర్న లిస్ట్‌గా పనిచేస్తూ కాలం గడిపాడు. 1935లో ఓ మారుమూల పల్లెటూరిలో పబ్ నడుపుతూ, జనరల్ షాపు పెట్టుకుని వారానికి ఓ పౌండ్ మిగిల్చేవాడు.

అప్పటికే బర్మీస్ డేస్ (1934), ఎక్లెర్జిమన్స్ డాటర్ (1935) లాంటి నవలల ద్వారా ప్రసిద్ధి చెందాడు. ఇంగ్లండులోని సాహితీవేత్తల మధ్య తానొక రచయితగా గుర్తింపు పొందుతున్న కాలమది. ది న్యూ ఇంగ్లిష్ వీక్లీ మేగజైన్‌కు క్రమం తప్పకుండా రాయడం ప్రారంభించాడు. అంతలోనే విగాన్‌లో ప్రచురణకర్త విక్టర్ గొల్లాంజ్ అతడికి 500 పౌండ్లను అడ్వాన్సుగా ఇచ్చి, పారిశ్రామికంగా ముందున్న ఉత్తర ఇంగ్లండులో నిరుద్యోగ పరిస్థితుల గురించి ఓ పుస్తకం రాయమన్నాడు.

### స్పెయిన్ అంతర్యుద్ధంలో..

పరిస్థితుల అధ్యయనానికి ఉత్తర ఇంగ్లండుకు బయలుదేరాడు. 1936 జూన్ 9న ఎయిలీన్‌ను వివాహమాడాడు. తన అనుభవాలను 'ది రోడ్ టు విగాన్ పియర్' రచనలో తెలియజేశాడు. ఆ ఏడాది డిసెంబరులోనే పాత్రికేయుడిగా స్పెయిన్‌కు వెళ్లాడు. అక్కడ ఫాసిస్టు పాలకుడు ఫ్రాంకోకు వ్యతిరేకంగా రిపబ్లికన్ల పక్షం వహించి అంతర్యుద్ధంలో పాల్గొన్నాడు. పార్టిడో ఒబ్రెరో డి యూనిఫికేషన్ మార్క్సిస్టా (పి.ఒ. యు.ఎమ్) అనే మిలిటెంట్ మార్క్సిస్ట్ పార్టీలో కంపెనీ కమాండర్‌గా పనిచేశాడు. దురదృష్టవ శాత్తు స్టాలినిస్ట్ కమ్యూనిస్టులచేత ఇబ్బందుల పాలయ్యాడు. యుద్ధంలో గాయపడ్డాడు. భవి

## 'జంతుక్షేత్రం' లోని ప్రధాన పాత్రలు

### జంతువులు

మేజర్ : జంతువాదం సిద్ధాంత కర్త ముసలి అడవి పంది.

నెపోలియన్ : ప్రధాన నాయకుడు బెర్క్‌షైర్ జాతి పంది.

స్నోబాల్ : నెపోలియన్ ప్రత్యర్థి మాటకారి వరాహం.

స్క్వీలర్ : నెపోలియన్ నమ్మిన బంటు, మాటకారి పంది.

మినిమస్ : పాటలు రాసే వరాహకవి

బాక్సర్ : కార్మిక ప్రతినిధి, బలిష్ఠమైన అమాయక గుర్రం

క్లోవర్ : బగ్గీలాగే నడివయస్సు ఆడగుర్రం

బెంజిమన్ : ముసలి గాడిద

మురియల్ : చదవడం తెలిసిన తెలివైన తెల్లమేక

మోలీ : జోన్స్‌కిష్టమైన పొగరుబోతు ఆడగుర్రం

మోజెస్ : జోన్స్ పెంపుడు కాకి, గూఢచారి

### మనుష్యులు

జోన్స్ : మేనర్ క్షేత్రం యజమాని

పిల్కింగ్టన్ : ఫాక్స్‌వుడ్ క్షేత్రం యజమాని

ఫ్రెడెరిక్ : పించ్‌ఫీల్డ్ క్షేత్రం యజమాని

వింఫర్ : కపట వకీలు, జంతుక్షేత్రం వాణిజ్య ప్రతినిధి.

---

ష్యత్తులో ఆ గాయమే రెండో ప్రపంచ యుద్ధంలో పాల్గొనకుండా కట్టడిచేసింది. తాను అరెస్టయి జైలు పాలయ్యే పరిస్థితి తలెత్తడంతో 1937 జూన్‌లో స్పెయిన్ నుంచి తప్పించుకుని వచ్చేశాడు.

### నియంతృత్వంపై అక్షరసమరం

1936-37 నుంచి తన రచనలన్నిటినీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నియంతృత్వానికి వ్యతిరేకంగా ఎక్కుపెట్టాడు. డెమాక్రటిక్ సోషలిజాన్ని బోధించాడు. రష్యాలోని స్టాలిన్ నేతృత్వంలోని కమ్యూనిజం కూడా జర్మనీలో హిట్లర్, స్పెయిన్‌లో ఫ్రాంకో పాలనలాగే నియంతృత్వమని చాటాడు.

రెండో ప్రపంచ యుద్ధంలో బి.బి.సి భారత విభాగంలో జర్నలిస్టుగా చేశాడు. యుద్ధం ముగిసిన తర్వాత తన ఉద్యోగాన్ని వదిలేసి, మళ్లీ రచనా వ్యాసంగంలో తలమునకలయ్యాడు. 1945లో ఆర్వెల్ దంపతులు ఓ అబ్బాయిని దత్తత తీసుకున్నారు. యుద్ధం చివరి ఘట్టాల గురించి 'అబ్జర్వర్' పత్రికకు రాసేందుకు ఆర్వెల్ ఫ్రాన్స్‌కు వెళ్లాడు. యుద్ధంలో సైనికుడిగా పాల్గొనకపోయిన అతడికి ఆ అవకాశం రావడం అదృష్టంగా భావించాడు.

అయితే క్యాన్సర్‌వ్యాధి వల్ల భార్య మరణించడంతో అక్కడినుంచి తిరిగి వచ్చేశాడు. ఆ తరువాత స్కాట్లాండులోని హైబ్రైడ్స్‌వద్ద జూరా అనే దీవిలో ఒంటరిగా జీవించసాగాడు.

అక్కడే '1984' నవల రాశాడు. కేవలం ఆర్థిక భద్రత కోసం నియంతృత్వ పాలనలో ప్రజలు మగ్గరాదని చెప్పాడు. శారీరక బాధలు, ఆధ్యాత్మికంగా జరిగే హింసను గూర్చి రాశాడు. తనకు క్షయవ్యాధి సోకిందని భయపడి, కాట్స్‌వల్డ్స్‌లోని గ్లాసెస్టర్‌షైర్ శానిటోరియంలో చేరాడు. తర్వాత లండన్‌లోని యూనివర్సిటీ కాలేజ్ హాస్పిటల్‌కు తరలించారు. అక్కడే రచయితలైన మాల్కోమ్ మగ్గరిడ్జ్, ఆంథోనీపావెల్, డేవిడ్ ఆస్టర్ సమక్షంలో సోనియా బ్రౌన్‌వెల్‌ను ద్వితీయ వివాహం చేసుకున్నాడు. స్విట్జర్లాండ్‌లోని శానిటోరియానికి వెళ్లి క్షయవ్యాధి నుంచి కోలుకుని, రోజూ కొన్ని గంటలపాటు రచనలు చేయాలనుకున్నాడు. అప్పుడతడు జోసెఫ్‌కాన్రాడ్ గురించి రాస్తున్నాడు. అయితే అతడి కల నెరవేరలేదు. 1950, జనవరి 21 రాత్రి మృత్యువు ఆయనను కబళించింది. ©

ఏ శ్రమా చేయక మన జంతుజాతి శ్రమను దోచుకు తింటున్నాడు మనిషి. అతను మనలా పాలివ్వడు, గుడ్లు పెట్టడు, నేల దున్నడు. అన్నీ మనతోనే చేయిస్తూ, బతికేందుకేదో కాస్త తిండి పడేస్తున్నాడు. అంచేత మానవుడే మన శత్రువు. మన ఆకలికి, కఠిన శ్రమకు కారణమైన మనిషి అధికారాన్ని తొలగిద్దాం! కామ్రేడ్స్ తిరగబడండి! భూమ్మీదనుంచి మనిషిని నిర్మూలిద్దాం! మన జీవితాల్ని బాగుచేసుకుందాం! విప్లవం వర్ధిల్లాలి!! అంటూ ఆ వృద్ధ వరాహరాజం జంతువుల సమావేశంలో ఆవేశంగా ప్రసంగిస్తోంది.

ఇంతకీ ఆ జంతువులు మనిషిని నాశనం చేయగలిగాయా? తరతరాల దోపిడీ, పీడనలనుండి బయటపడ్డాయా? విప్లవం వర్ధిల్లిందా? ఇరవయ్యో శతాబ్దపు రాజకీయాలపై వచ్చిన ప్రపంచ ప్రసిద్ధ వ్యంగ్య నవల జార్జ్ ఆర్వెల్ **జంతుక్షేత్రం** నవంబరు చతుర కానుక.



మేనర్ క్షేత్రం యజమాని జోన్స్ కోళ్ళ గూడును మూసి దానికి తాళం వేశాడు. అయితే బాగా తాగి ఉండటంవల్ల దాని కిటికీ మూయడం మరిచిపోయాడు.

అతను తడుముకుంటూ వెళ్లి పెరడు దాటి, తన బూట్లను వాకిలి మూలకు విసిరేసాడు. గ్లాసులో మిగిలిన బీరు చుక్కలను గొంతులోకి వంపుకొని, అప్పటికే గురక పెడుతున్న భార్య పక్కనే ఒరిగాడు.

పడకటింటి వెలుతురు ఆరిపోగానే పెరట్లోని అన్ని మూలల్లో అలజడి, కదలికా మొదలయ్యాయి. అడవిపంది ముసలి మేజర్‌కు అంతకుముందు రోజూ రాత్రి ఓ కల వచ్చిందని, ఆ కలను అది ఇతర జంతువులకు చెప్పాలనుకుంటున్నదని ఆ రోజు పగటిపూటే అన్ని జంతువులకూ సమాచారం అందింది. అందువల్ల యజమాని జోన్స్ నిద్రపోగానే జంతువులన్నీ ధాన్యాగారంలో కలుసుకోవాలని నిర్ణయించుకున్నాయి. ముసలి మేజర్ ఆ క్షేత్రంలో అన్ని జంతువుల చేత చాలా గౌరవింపబడేది కనుక దాని విలువైన పలుకుల కోసం అవి వేచిచూడసాగాయి.

ఆ ధాన్యాగారం చివరన ఓ మూల ఎత్తైన ప్రదేశంలో మెత్తగా పరిచిన గడ్డి మీద మేజర్ ఆసీనురాలైంది. దాని తల పైన ఓ దీపం వేలాడుతోంది. పన్నెండేళ్ల మేజర్ ఈ మధ్య కొంచెం లావెక్కి గంభీరంగా కనిపిస్తోంది.

కొద్దిసేపటికే అన్ని జంతువులూ ఒకటొకటిగా అక్కడికి వచ్చి, తమ తమ స్వభావరీత్యా సర్దుకున్నాయి. ముందుగా ఫించర్, బ్లూబెల్, జెస్సీ.. అనబడే కుక్కలూ, వాటి వెనకాలే పందులూ వచ్చి- ముందు పరిచిన గడ్డిపై కూర్చున్నాయి. బగ్గీని లాగే గుర్రాలు బాక్సర్, క్లోవర్‌లు- గడ్డిపై ఉన్న ఏ చిన్న జంతువూ తమ గిట్టల కింద పడకుండా.. జాగ్రత్తగా అడుగులో అడుగువేస్తూ వచ్చి కూర్చున్నాయి.

క్లోవర్ లావుగా తయారైన ఓ నడి వయస్సు ఆడ గుర్రం. నాలుగు పిల్లలను కన్నాక అది తన పూర్వపు రూపాన్ని కోల్పోయింది. బాక్సర్ బలిష్ఠంగా ఉండి రెండు మూడు గుర్రాలకు సరితూగేది. దాని మూతి పైకి జారిన ఓ తెల్లని చార వల్ల అదో మందమతిలా కనిపించేది. నిజానికది పెద్ద తెలివైనదేమీ కాదు. అయితే అది తన ఉన్నతమైన వ్యక్తిత్వం, అమితమైన శక్తి వల్లా అన్ని జంతువుల గౌరవం పొందుతోంది.

ఆ గుర్రాల వెనకాలే మురియల్ అనే తెల్ల మేకా, బెంజిమన్ అనే గాడిద వచ్చాయి. బెంజిమన్ ఆ కమతంలో అన్నిటికన్నా వయస్సులో పెద్దది. అది చాలా తొందరగా సహనం కోల్పోయేది. అది మితభాషే కానీ దాని ప్రతి మాటా వ్యంగ్యంగా ఉండేది. బైటికి ఒప్పుకోకపోయినా అది బాక్సర్‌ను అభిమానించేది. ఆదివారాల్లో అవి రెండూ- తోట వెనకాల ఉన్న పచ్చిక బయళ్లలో మాట్లాడకుండా, గంటల తరబడి మేసేవి.

ఈ గుర్రాలు అలా కూర్చోగానే, తల్లిని పోగొట్టుకున్న బాతు పిల్లలు కొన్ని గునగునా నడుస్తూ, బలహీనంగా కేరింతలు కొడుతూ క్లోవర్ పక్కన వచ్చి కూర్చున్నాయి. క్లోవర్ వాటి చుట్టూ తన కాలితో దడి కట్టగానే అవి వెచ్చగా నిదురపోయాయి. వాటి వెనకాల జోన్స్ ముద్దుల పట్టీ.. బొద్దుగా, తెల్లగా ఉండే మోలీ అనే ఆడగుర్రం దర్పంగా ఓ చెరుకుగడ నములుతూ వచ్చి ముందు వరుసలో కూర్చుని, తన జూలుకు వేలాడే ఎర్ర రిబ్బను అందరి కళ్లలో పడాలని, దానిని పదేపదే అటుఇటూ ఊపసాగింది. చివరగా వెచ్చని ప్రదేశం కోసం అటు ఇటు చూస్తూ వచ్చిన

# విద్యాసాగర్ దాతృత్వం

అప్పటి నిజం

పశ్చిమ బెంగాలులో 1865లో కరువు వచ్చింది. సుప్రసిద్ధ భారతీయ పండితుడు, మహా మానవతావాది అయిన ఈశ్వరచంద్ర విద్యాసాగర్ బుర్ద్వాన్‌లో ఒక ముష్టి అబ్బాయిని కలిసాడు. ఆ అబ్బాయి అందర్నీ డబ్బు దానం చేయమని అడగసాగాడు. ఆ అబ్బాయి కళ్లల్లో ఎంతో తేజం ఉన్నా ముఖం మాత్రం పాలిపోయి వుండటం విద్యాసాగర్ దృష్టిని దాటిపోలేదు.

'నేను నీకు నాలుగు పైసలు ఇచ్చాననుకో..' అని విద్యాసాగర్ ఆ అబ్బాయితో అన్నాడు.

'తమాషా చేయకండి సార్' అన్నాడు అబ్బాయి.

'తమాషా చేయడంలేదు బాబు! నేను ఇచ్చిన నాలుగు పైసలతో నీవు ఏంచేస్తావు?'

'రెండు పైసలు తినడానికి ఖర్చు చేసి మిగతా రెండు పైసలు మా అమ్మకు ఇస్తాను'

'నేను నీకు రెండు అణాలు ఇచ్చాననుకో..' అని మళ్ళీ అన్నాడు విద్యాసాగర్.

ఈ మాటలతో విసుగు చెందిన ఆ అబ్బాయి ఇదేదో ఇచ్చే బేరం కాదని అక్కడినుండి వెళ్లిపోయే ప్రయత్నంలో ఉన్నాడు. విద్యాసాగర్ ఆ అబ్బాయి చేయి పట్టుకొని ఆపాడు.

'సరే! ఏం చేస్తావో చెప్పు?' అని మళ్ళీ అడిగాడు.

అబ్బాయి కళ్ళనుంచి నీళ్లు జలజలా కారసాగాయి.



'నాలుగు పైసలు బియ్యం కొని మిగతా డబ్బు మా అమ్మకు ఇస్తాను' అని నిజాయితీగా సమాధానం చెప్పాడు.

'మరి పావలా ఇస్తే ఏం చేస్తావ్?' అడిగాడు విద్యాసాగర్.

'రెండణాలు రెండు రోజుల భోజనం కోసం ఖర్చు చేస్తాను. మిగతా రెండణాలతో మంచి మామిడి పండ్లు కొని వాటిని నాలుగు అణాలకు అమ్ముతాను. ఆ విధంగా వ్యాపారం చేసి మా అమ్మకు సహాయపడుతూ నా సొంతకాళ్లపై బతికేందుకు ప్రయత్నిస్తా.'

విద్యాసాగర్ అతడికి ఒక రూపాయి ఇచ్చాడు. ఆ అబ్బాయి సంతోషంతో అక్కడినుండి పరుగులు తీశాడు.

రెండేళ్ల తర్వాత విద్యాసాగర్ బుర్ద్వాన్‌కు ఏదోపని మీద మళ్ళీ వచ్చాడు. ఒక లావుపాటి ఒడ్డూపొడుగూ ఉన్న ఒక యువకుడు తన దుకాణం నుండి బయటికొచ్చి విద్యాసాగర్‌కు నమస్కారం చేశాడు.

'అయ్యా! మా దుకాణంలో కాసేపు విశ్రమించమని ప్రార్థిస్తున్నాను' విన్నవించుకున్నాడు.

'నీవు ఎవరో నాకు తెలియదు' అన్నాడు విద్యాసాగర్ ఆశ్చర్యంతో.

ఆ యువకుడికి కళ్ళనిండా నీళ్ళు నిండుకొచ్చాయి. రెండేళ్ల క్రితం ఆయన తనకు ఎలా సహాయపడ్డాడో గుర్తుచేశాడు. ఈ చిన్న దుకాణం తనదేనని కూడా చెప్పాడు. అది విన్న విద్యాసాగర్ ఆ దుకాణంలో కాసేపు కూర్చుని ఆ అబ్బాయిని మనసారా దీవించాడు. ఇలాంటి సహాయ సహకారాలను అందించి ఎంతోమంది జీవితాలను నిలబెట్టాడు విద్యాసాగర్.

మార్జాలరాజం- బాక్సర్, క్లోవర్‌ల మధ్య స్థానం సంపాదించింది. మేజర్ మాట్లాడినంతసేపూ ఒక్క మాటా వినకుండా మ్యావ్, మ్యావ్ అంటూనే ఉందది.

జోన్స్ పెంపుడు కాకి మోజెస్ మినహా అన్ని జంతువులూ అక్కడ హాజరయ్యాయి. మోజెస్ తలుపు వెనకాల దూలంపై నిద్రపోతోంది.

అన్ని జంతువులూ సౌకర్యంగా కూర్చున్నాయని నిశ్చయించుకుని మేజర్ తన గొంతు సవరించుకుంది. 'సహచరులారా! మీరు ఈ పాటికి నాకొచ్చిన చిత్రమైన కల గురించి వినే ఉంటారు. ఆ కల గురించి తర్వాత చెబుతా. దానికన్నా ముందు మీకు చెప్పాల్సింది మరొకటుంది.

నేనెక్కువ కాలం జీవిస్తాననే నమ్మకం లేదు. కానీ చనిపోయే ముందు నా జ్ఞానాన్ని మీతో పంచుకోవాలనుకుంటున్నాను. ఒంటరిగా ఆలోచించడానికి నా గూటిలో నాకెంతో సమయముండేది. ఈ భూమ్మీద అన్ని బుద్ధి జీవుల్లాగే నేనూ ఆలోచించానని సగర్వంగా చెప్పగలను.

మిత్రులారా! మనం జీవిస్తున్న పరిస్థితులెలా ఉన్నాయి? నిజాలు మాట్లాడుకుందాం. మన జీవితాలు దుర్భరమైనవి. చాకిరీతో నిండినవి. క్షణికమైనవి. మనం బతకడానికెంత తిండి అవసరమో అంతే తిండి పెడుతున్నారు. పని చేయగల ప్రతి జంతువు ఒంట్లోంచి చివరి రక్తపు బొట్టు ఇంకిపోయేవరకూ పని రాబడుతున్నారు. మనం పనికి రామని ఏ క్షణాన తేలిపోతుందో, ఆ మరుక్షణమే మనల్ని పాశవికంగా వధిస్తున్నారు. ఈ ఇంగ్లండ్ మొత్తం మీద ఒక్క జంతువు కూడా వృద్ధాప్యం మీద పడ్డాక సంతోషాన్ని గానీ, విశ్రాంతిని గానీ, స్వేచ్ఛనుగానీ ఎరగదు. ప్రతి జంతువు జీవితమంతా చాకిరీ, బానిసత్వంలోనే కునారిల్లిపోతోంది. కానీ ఇది ప్రకృతి సహజమా? ఈ భూమి తనపై సంచరించే జీవాలన్నిటికీ సౌభాగ్యకరమైన జీవితం ఇవ్వలేనంతటి దుర్భరమైనదా? లేదు మిత్రులారా, లేదు! మన ఇంగ్లండ్ భూమి సారవంతమైనది. ఇక్కడి ప్రకృతి కరుణామయి. ఈ భూమి ప్రస్తుతం ఉన్న జంతువులకన్నా ఎక్కువ జంతువులనే పోషించగలదు. మన మేనర్ క్షేత్రమే- వేలాది జంతువులను.. గొప్ప భోగభాగ్యాలతో, గౌరవ మర్యాదలతో పోషించగలదు. ఐనా మనమెందుకిలాంటి దుర్భర స్థితిలో జీవిస్తున్నాం?'

మేజర్ కొద్ది సేపాగింది.

'ఎందుకంటే మన శ్రమా, ఉత్పత్తీ మొత్తం ఈ మానవుడు దోచుకుంటున్నాడు. ఒక్క ముక్కలో చెప్పాలంటే- మానవుడే మన శత్రువు. ఈ మొత్తం వ్యవహారంలో మానవుణ్ని తొలగించండి.. మన ఆకలికీ, కఠిన శ్రమకూ మూలకారణం తొలగిపోతుంది.

మానవుడొక్కడే ఏ శ్రమా చేయకుండా ఇతరుల శ్రమను దోచుకుతినే జీవి. అతను పాలివ్వలేడు. గుడ్లు పెట్టలేడు. నాగలితో దున్నలేడు. వేగంగా పరిగెత్తి కుందేళ్లను పట్టలేడు. ఐనా అన్ని జంతువులూ అతనికి లొంగి ఉండాల్సిందే! వాటితో పని చేయించుకుని, కేవలం ఆ పని చేయడానికి మాత్రమే తగినంత తిండి పెట్టి మిగతాది దోచుకుంటున్నాడు.

మనం చెమటోడ్చి భూమిని దున్నుతాం. మన మలమూత్రాలే ఈ నేలకు ఎరువు. ఐనా మనవి అని చెప్పుకోవడానికి ఈ చర్మం, ఎముకలు తప్ప ఏమీ లేనివాళ్లం. ఈ ఆవులు తమ జీవితకాలంలో ఎన్నివేల లీటర్ల పాలిచ్చి ఉంటాయి? ఐనా వాటి దూడలు అంత అర్భకంగా ఎందుకున్నాయి? ఎందుకంటే ఆ పాలలో ప్రతి చుక్కా మన శత్రువు గొంతులోకే

పోతోంది కనుక.

ఇక కోళ్ల సంగతి. వాటి గుడ్లలో ఎన్ని పిల్లలుగా మారాయి? వాటన్నిటినీ జోన్స్ మార్కెట్లో అమ్మి సొమ్ము చేసుకోలేదా? క్లోవర్.. వృద్ధాప్యంలో నీకు ఆసరా కావాల్సిన నీ నాలుగు పిల్లలేవి? ప్రతి పిల్లకీ ఏడాది వయసు రాగానే ఈ జోన్స్ అమ్ముకోలేదా? ఈ చాకిరీకి నీవు ఆశించే ప్రతిఫలం ఏమిటి? కడుపునిండా తిండి.. ఉండడానికో శుభ్రమైన పాక.

మన దుర్భర జీవితాలు మరణంలోనైనా సహజంగా ముగుస్తున్నాయా అంటే అదీ లేదు. ప్రతీ జీవీ కత్తికి ఎరగాక తప్పడంలేదు. నా ముందున్న ఈ పంది పిల్లలను చూశారా- మరో ఏడాదిలో వాటి తలలన్నీ తెగిపడతాయి. ఆవులు, గొర్రెలూ, కోళ్లు- అన్నీ చివరికి కత్తికి ఎర కావాల్సిందే. కుక్కలు, గుర్రాలైనా అంతే. ఏ రోజు నీ కండలు కరిగిపోతాయో, ఆ రోజే మన యజమాని జోన్స్ నిన్ను కసాయికి అమ్మేస్తాడు. ఆ కసాయి నిన్ను కోసి, బాగా ఉడికించి, వేట కుక్కలకు ఆహారంగా వేస్తాడు. ఇక కుక్కల సంగతా! అవి పళ్లూడి ముసలివయిపోగానే, వాటి మెడకో రాయికట్టి దగ్గర్లోని చెరువులో తోసి చంపుతాడు.

వీటన్నిటినీ బట్టి మనకు స్పష్టంగా అర్థమయ్యేదేమంటే, మన ఈ దయనీయ జీవితానికి కారణం- మనిషి. అతడి అధికారాన్ని తొలగించండి - మన శ్రమంతా మనకే దక్కుతుంది. మనం స్వేచ్ఛా జీవులమవుతాం, సంపన్నులమవుతాం.'

మేజర్ చుట్టూ చూసింది.

'దానికి మనమేం చేయాలి? రేయి పగలూ కష్టపడి, శరీరమూ, మెదడూ మేళవించి.. మనిషి అధికారాన్నుంచి బయట

పడాలి. ఇదే నా సందేశం. కామ్రేడ్స్! తిరగబడండి!

ఆ తిరుగుబాటు ఎప్పుడొస్తుందో నాకూ తెలీదు. ఓ వారంలో రావచ్చు. లేదా వందేళ్లు పట్టొచ్చు. కానీ ఏదో ఓ రోజు మాత్రం వచ్చి తీరుతుందని నేను నమ్ముతాను. మిగిలిన జీవితమంతా ఆ లక్ష్యం మీదనే మీరు కేంద్రీకరించండి.

ఈ సందేశాన్ని మన ముందు తరాలకు నిరంతరాయంగా అందించండి. అప్పుడే భవిష్యత్ తరాలు విజయం కోసం పోరాడతాయి.

మిత్రులారా! మన కార్యదీక్ష ఎన్నడూ సడలరాదు. ఏ పిడివాదమూ మనల్ని

## కొత్తగాలి...

**గుండె**
**విశ్రాంతి కోరింది**
**మండే**
**చితిగా మారింది**

– *కిలారు వెంకటేష్ చౌదరి,*
హైదరాబాద్

బలహీనపరచరాదు. మనిషికీ, జంతువుకీ ఒకే లక్ష్యాలుంటాయనీ, ఒకరి శ్రేయో సంపదలే మరొకరివనీ ఎవరు చెప్పినా నమ్మకండి. అవన్నీ అబద్ధాలు. మనిషికి స్వలాభం తప్ప మరే లక్ష్యమూ లేదు. మన జంతు సమూహమంతా ఏకతాటిపై నిలవాలి. మనుషులంతా మన శత్రువులు. జంతువులన్నీ స్నేహితులు.'

అదే సమయంలో అక్కడ పెద్ద గలభా చెలరేగింది. తమ కన్నాల్లోంచి బయటికి వచ్చి, వెనుక కాళ్లపై నిలబడి, మేజర్ మాటలను వింటున్న నాలుగు పందికొక్కులను గమనించిన కుక్కలు హఠాత్తుగా వాటి మీదకు లంఘించాయి. కానీ పందికొక్కులు చివరి క్షణంలో గమనించి, తమ కన్నాల్లోకి జొరబడి బతికిపోయాయి.

మేజర్ అన్నింటినీ నిశ్శబ్దంగా ఉండమని కోరింది.

'మిత్రులారా! ఇక్కడ ఒక విషయం మీద మనకు స్పష్టత ఉండాలి. వెనుక కాళ్లపై నిలబడే ఎలుకలు, కుందేళ్లలాంటి జీవాలు మన మిత్రులా, శత్రువులా? నేనీ ప్రశ్నను ఓటింగ్‌కు పెట్టదల్చుకున్నాను.'

వెంటనే ఓటింగ్ జరిగిపోయింది. అలాంటి జీవాలు తమ మిత్రులే అని ఎక్కువ శాతం సమర్థించాయి. నాలుగు ఓట్లు చెల్లలేదు. మూడు కుక్కలు, ఓ పిల్లి రెండు పక్కలా ఓటేశాయని తర్వాత తెలిసింది.

మేజర్ తిరిగి కొనసాగించింది- 'మనిషినీ, అతని చేతలనూ నిరంతరం వ్యతిరేకించండి. రెండు కాళ్లపై నిలబడేదేదైనా మన శత్రువే. నాలుగు కాళ్లున్నవీ, రెక్కలున్నవీ మన మిత్రులు.

మనిషితో పోరాడే క్రమంలో ఎన్నడూ మనిషి చేతలను అనుకరించకండి. మనిషిని ఓడించాక అతని చెడు అలవాట్లను నేర్చుకోకండి. జంతువులేవీ ఇళ్లలో నివసించకూడదు. పరుపులపై నిద్రపోరాదు. మద్యం సేవించరాదు. పొగ త్రాగరాదు. డబ్బును తాకరాదు. వ్యాపారం చేయరాదు. మనిషి అలవాట్లన్నీ చెడ్డవే.

ఇక అన్నిటినీ మించి- ఏ జంతువూ ఇతర జంతువులపై ఆధిపత్యం చెలాయించరాదు. బలమైనవీ, బలహీనమైనవీ, మందబుద్ధివీ- అన్ని జంతువులూ సమానమే!

ఇపుడు మీకు నాకు వచ్చిన కల గురించి చెబుతాను. ఆ కలను ఎలా వర్ణించను! మనిషి ఈ భూమ్మీది నుంచి నిర్మూలించబడ్డాక మన జీవితాలెలా ఉంటాయో

తెలిపే కల అది. చాలా ఏళ్ల క్రితం నేను మరచిపోయిందేదో ఆ కల నాకు గుర్తు చేసి నేను పంది పిల్లగా ఉన్నప్పుడు మా అమ్మా, ఇతర పంది తల్లులూ - తమకు మాత్రమే తెలిసిన ఓ రాగంలో ఆ పాట పాడేవి. ఆ రాగం నాకు బాగా జ్ఞాపకమే. కానీ అది నేను మరిచిపోయి చాలా కాల మైంది.

నిన్న రాత్రి కలలో నాకు హఠాత్తుగా ఆ రాగం గుర్తుకొచ్చింది. రాగమే కాదు- ఆ పాట మొత్తం నా నోటికొచ్చేసింది. ఏ పదాలనైతే తరతరాల మన జంతుజాతి పాడేదో ఆ పదాలన్నీ నాకు వచ్చేశాయి. ఇప్పుడు మీ కోసం నేనా పాటను పాడ తాను.

మిత్రులారా! నాకు వయసు పైబడింది. నా గొంతు కొంచెం జీరగా ఉండొచ్చు. కానీ ఒక్కసారి మీకా రాగం పట్టుబడ్డాక మీరు మీ తీయని కంఠాలతో ఆ పాటను పాడుకోవచ్చు. ఆ పాట పేరు -స్వేచ్ఛా గీతం.

ముసలి మేజర్ గొంతు సవరించుకుని పాడసాగింది. దాని గొంతు కొంచెం బొంగురుపోయినా అది బాగానే పాడింది. ఆ రాగం అక్కడున్న అన్ని జంతువులనూ కదిలించింది. ఆ పాట ఇలా సాగింది...

జంతువులార జంతువులార
ధరణిపైని సహచరులార
ముందున్న రోజులు మనవే
భవిష్యత్ గీతం వినరే ॥
అణిచే మానవులు నశించ
సిరులన్నీ మనలనే వరించు
పంటలన్నీ దక్కును మనకే
కష్టాలన్నీ మనకికమరపే॥
ముక్కున కడియాలు, వీపున జీనులు
గొలుసుల బాధలు ఉండనే ఉండవిక
వధ్యశాలల కసాయిల చెర తప్పేను
వినిపించవు వీపున కొరడా మోతలు॥
ఉండబోదిక తిండి భయం
కోరిన గింజలు నిరంతరం
గోధుమ గడ్డీ ఉలవలు
విన్నంతనె తనువున పులకలు॥
గింజలతో పొలాలన్నీ పొంగీ
నీళ్లతో చెరువులన్నీ నిండీ
మనం స్వేచ్ఛాగీతం పాడే సమయం
గాలులు మంద్రంగా వీచే తరుణం ॥
మరణం తథ్యం, విముక్తి మన కర్తవ్యం
విముక్తి మన కర్తవ్యం
కోళ్లూ కుక్కలు, ఆవులూ గుర్రాలు
అన్నిటి లక్ష్యం జంతు ప్రపంచం ॥
జంతువులార జంతువులార
ధరణిపైని సహచరులార
ముందున్న రోజులు మనవే
భవిష్యత్ గీతం వినరే॥

ఆ పాట పాడుతుంటే జంతువులన్నిటినీ వాటికే తెలీని ఆవేశమేదో ఆవహించింది. మేజర్ పాట ముగించేలోగా అవన్నీ తమంతట తామే ఆ పాటను పాడటం ప్రారంభించాయి. వాటిల్లోని మందమతులు కూడా ఆ రాగాన్నీ, పాటలోని పదాలనూ అందుకున్నాయి. ఇక పందులు, కుక్కల్లాంటి కొన్ని తెలివైన జంతువులైతే నిమిషాల్లోనే పాటను కంఠతా పట్టేశాయి.

కొద్దిసేపటి తర్వాత క్షేత్రంలోని జంతువులన్నీ ముక్తకంఠంతో స్వేచ్ఛాగీతం ఆల

## కొత్తగాలి...

**ప్రేమ పేరుతో**
**వయసు దోపిడి**
**పెళ్లి పేరెత్తితే**
**కట్నం కోసం రాపిడి**

– జి. గ్రీష్మ, కరీంనగర్

పించసాగాయి. అవి ఎంత సంబరంగా ఉన్నాయంటే.. ఆ పాటను ఆపకుండా ఐదుసార్లు ఆలపించాయి. ఆపేవారు లేకుంటే రాత్రంతా పాడుతూనే ఉండేవి. అయితే ఈ శబ్దాలతో మెలకువ వచ్చిన యజమాని జోన్స్, తన పెరట్లోకి ఏ నక్కో ప్రవేశించిందని భావించి, ఒక్క ఉదుటన పరుపుమీది నుంచి దూకి, గది మూలన నిలబెట్టిన తుపాకి లాక్కుని గాలిలోకి కాల్చాడు.

వెంటనే జంతువులన్నీ తమ తమ స్థానాల్లోకి, పక్షులు వసారాల్లోకి నిశ్శబ్దంగా జారుకున్నాయి. కాసేపట్లో మేనర్ క్షేత్రం మొత్తం నిద్రలోకి జారుకుంది.




**మూ**డ్రోజుల తర్వాత ముసలి మేజర్ నిద్దట్లో ప్రశాంతంగా మరణించింది. ఆ తర్వాత మూడు నెలలు చాలా రహస్య తతంగం నడిచింది. మేజర్ మాటలు ఆ క్షేత్రంలోని తెలివైన జంతువులకు జీవితం లోని ఓ కొత్త కోణాన్ని ఆవిష్కరించాయి. మేజర్ ఊహించిన ఆ విప్లవం ఎప్పుడు వస్తుందో, అసలది తమ జీవిత కాలంలో సాధ్యమవుతుందో తెలీదుకానీ, దానికి సిద్ధం కావడం మాత్రం తమ కర్తవ్యంగా భావించాయవి.

జంతువులన్నిటినీ చైతన్యపరచి, వాటికి క్రమశిక్షణ నేర్పే బాధ్యత సహజంగా జంతువులలో తెలివైన వరాహజాతి మీద పడింది.

వాటిలో నెపోలియన్, స్నోబాల్ అనే అడవి పందులు రెండున్నాయి. అవి బాగా బలిసాక అమ్మడం కోసమని జోన్స్ వాటిని దిట్టంగా మేపుతున్నాడు.

భీకరంగా కనిపించే నెపోలియన్ ఓ బెర్క్‌షైర్ మగపంది. అది ఎక్కువగా మాట్లాడేది కాదుగానీ తాననుకున్నది మాత్రం సాధించేది. స్నోబాల్, నెపోలియన్ కన్నా చురుకైనది. అవసరానికి తగినట్టు మాట్లాడటంలోనూ, పరిస్థితులను తనకనుగుణంగా మార్చుకోవడంలోనూ దిట్ట. కానీ దాని వ్యక్తిత్వం చాలా అల్పమైనది.

ఇక క్షేత్రంలోని మిగతా పందులన్నీ మామూలు ఊరపందులే. వాటిలో బాగా ప్రాచుర్యం పొందినది స్క్వీలర్. అది ఓ చిన్నటి లావాటి పంది. దాని బుగ్గలు గుండ్రంగా, కళ్లు చురుగ్గా ఉండేవి. అది చకచకా కదిలేది. కర్కశమైన కంఠం కలిగి ఉండేది. మంచి మాటకారి. ఏదైనా వాదించేటప్పుడు అది తన తోకను అటుఇటూ కదుపుతూ, ఇతరులను సమ్మతింపజేసేందుకు శతవిధాలా ప్రయత్నించేది. స్క్వీలర్ నలుపును తెలుపుగా నమ్మించగలదని ప్రతీతి.

నెపోలియన్, స్నోబాల్, స్క్వీలర్- ఈ మూడు కలిసి మేజర్ బోధనలను ఓ ఆలోచనా విధానంగా మార్చి దానికి 'జంతువాదం' అని పేరు పెట్టాయి. అవి వారంలో కొన్ని రాత్రులను ఎన్నుకుని, జోన్స్ నిద్రపోగానే ధాన్యాగారంలో సమావేశమై, జంతువాదం గురించి మిగతా జంతువులకు బోధించేవి.

మొదట్లో ఆ మూడింటికీ మిగతా జంతువుల సందేహాలు చిరాకు పుట్టించేవి. వాటి మూర్ఖత్వం దిగులు కలిగించేది. కొన్ని

జంతువులు యజమాని జోన్స్ పట్ల కృతజ్ఞత కలిగి ఉండాలనీ, జోన్స్ మన అన్నదాత, అతను లేకపోతే మనం తిండి లేక చావమా అనీ.. విప్లవం ఎలాగూ రాక తప్పనిదైతే దాని గురించి మనం ఇన్ని ప్రయత్నాలు చేయడం అవసరమా అని ప్రశ్నించేవి. ఇలాంటి ప్రశ్నలు జంతుస్ఫూర్తికి విరుద్ధమని వాటికి అర్థమయ్యేట్లు చెప్పడం నెపోలియన్ బృందానికి చాలా కష్టమయ్యేది.

ఈ ప్రశ్నలన్నిటిలోకి చెత్త ప్రశ్నను జోన్స్ ముద్దుల గుర్రం మోలీ అడిగింది. 'విప్లవం తర్వాత నాకు చక్కెర పలుకులు దొరుకుతాయా' అని.

## కొత్తగాలి...

**బట్ట విప్పి బతకడానికి**
**సినిమా**
**బతికి బట్ట కట్టడానికి**
**నాటకం**
**తంటాలు పడుతున్నాయి**

– చక్కా చెన్న కేశవరావు, కావలి

'లేదు, మన క్షేత్రంలో చక్కెర ఉండదు' స్నోబాల్ స్థిరంగా చెప్పింది. 'అప్పుడు నీకు చక్కెర అవసరం ఉండదు. నీకప్పుడు గడ్డి, దాణాలకు కొదవ ఉండదు!'

'నేను అప్పుడు కూడా నా మెడలో ఈ రంగుల రిబ్బన్లను వేసుకోవచ్చా?' మోలీ తిరిగి ప్రశ్నించింది.

'కామ్రేడ్! ఎంతో గర్వంగా ధరించే ఆ రిబ్బను నీ బానిసత్వానికి చిహ్నం. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు రిబ్బన్లకన్నా ఎన్నో రెట్లు గొప్పవని నీవర్థం చేసుకోవడం లేదు' స్నోబాల్ విసుక్కుంది.

మోలీ మౌనం వహించింది. కానీ దానికా సమాధానం అంత నచ్చినట్టు లేదు. ఇక జోన్స్ పెంపుడు కాకి మోజెస్ చేస్తున్న అబద్ధపు ప్రచారాలను తిప్పి కొట్టడానికి ఆ జంతవులకు తల ప్రాణం తోకకు వచ్చేది.

మోజెస్ ఈ మూడింటి మీదా గూఢచర్యం నెరిపేది. అది ఏ మాటనైనా చక్కగా నమ్మబలికేది. మరణించాక జంతువులన్నీ మిఠాయి పర్వతం అనే ప్రదేశానికి వెళతాయట. ఆ ప్రదేశం ఆకాశానికి కొద్దిగా పైన ఉంటుందట. అక్కడ వారంలో ఏడు రోజులూ ఆదివారాలేనట. అక్కడ ఏడాది పొడవునా పచ్చటి గరికా, చక్కెర పలుకులూ దొరుకుతాయట. మోజెస్ సోమరిపోతని అన్ని జంతువులూ దాన్ని ఈసడించుకునేవి. అయితే కొన్ని మాత్రం ఆ మిఠాయి పర్వతం నిజంగా ఉందని నమ్మేవి. అలాంటి ప్రదేశమేదీ లేదని మిగతా జంతువులను నమ్మించడం నెపోలియన్ బృందానికి ప్రాణాంతకమయ్యేది.

బాక్సర్, క్లోవర్‌లు ఇప్పుడు ఈ వరాహ గురువులకు ప్రియశిష్యులైనాయి. ఆ రెండు గుర్రాలు తమంతట తాము ఆలోచించడానికి చాలా కష్టపడేవి. కానీ ఒక్కసారి ఆ వరాహరాజాలను తమ గురువులుగా స్వీకరించాక వాటి బోధనలను మిగతా జంతువులకు అక్షరం పొల్లుపోకుండా కచ్చితంగా ఉదాహరణలతో సహా వివరించేవి. అవి రహస్య సమావేశాలలో ఎన్నడూ ముందుండేవి. సమావేశం ముగింపులో పాడే స్వేచ్ఛాగీతం గానంలో వాటి గొంతు ప్రస్ఫుటంగా వినిపించేది.

★ ★ ★

విప్లవం ఊహించిన దానికన్నా ముందుగానే వచ్చింది. అనుకున్న దానికన్నా సులభంగానే వచ్చింది.

జోన్స్ కష్టపడి పనిచేసే రైతే కానీ అతనికీ మధ్యకాలం కలిసి రావడం లేదు. ఒక భూతగాదాలో అతను చాలా డబ్బు కోల్పోయి, తాగుడుకు అలవాటు పడ్డాడు. అతను రోజుల తరబడి తన వాలుకుర్చీలో కూర్చుని మద్యం సేవిస్తూ, తన ముద్దుల కాకికి బీరులో ముంచిన బ్రెడ్డు ముక్కలను తినిపిస్తూ కాలం గడిపేవాడు. అతని పనివాళ్లు సోమరులు, విశ్వాసహీనులయ్యారు. పొలాలన్నీ కలుపుతో నిండిపోయాయి. ఇంటి పెచ్చులూడసాగాయి. కంచెలన్నీ తొక్కివేయబడుతున్నాయి. జంతువులన్నీ సగం కడుపులతో మాడుతున్నాయి.

జూన్ మాసంలో గడ్డి కోతకు వచ్చింది. ఏదో సందర్భం మీద విల్లింగ్‌డన్ వెళ్లి 'రెడ్ లయన్' అనే బారులో తాగుతూ కూర్చున్న జోన్స్ ఆదివారం మధ్యాహ్నం వరకూ తిరిగి రాలేదు. పనివాళ్లు ఉదయమే పాలు పితికి, జంతువుల తిండి గురించి పట్టించుకోకుండా కుందేళ్లు పట్టడానికి వెళ్లిపోయారు. బారునుంచి తిరిగొచ్చిన జోన్స్ సోఫాలో పడుకుని, ముఖంపై ఓ పేపర్ కప్పుకుని గుర్రు పెట్టసాగాడు.

సాయంత్రమైనా జంతువులకు తిండి పెట్టే దిక్కు లేదు. ఇక జంతువులు దీనినెంత మాత్రమూ సహించలేకపోయాయి. ఓ ఆవు తన కొమ్ములతో స్టోర్ రూం తలుపులను కుమ్మేసింది. దాంతో జంతువులన్నీ ఆ గదిలోకి జొరబడి దొరికిన దానినల్లా తిని కడుపు నింపుకోసాగాయి.

అదే సమయంలో జోన్స్ నిద్ర లేచాడు. జరుగుతున్నది చూసి ఒళ్లు తెలీని కోపంతో అనుచరులను కేకేసాడు. మరుక్షణంలో జోన్స్, అతని అనుచరులు జంతువుల మధ్య జొరబడి, దొరికిన జంతువునల్లా కొరడాతో బాదసాగారు.

ఆకలితో ఉన్న జంతువులు దీనిని ఇక ఎంతమాత్రమూ ఓర్చుకోలేక పోయాయి. ముందుగా ఏ ప్రణాళికా లేకున్నా జంతువులన్నీ మూకుమ్మడిగా తమను బాదుతున్న మనుష్యులపై తిరగబడ్డాయి. జోన్స్‌కు, అతని అనుచరులకు ఒకేసారి అన్నివైపుల నుంచీ తోపులూ, తన్నులూ పడ్డాయి. ప్రతీ రోజూ మౌనంగా దెబ్బలు తినే జంతువులు తమ మీద తిరగబడతాయని వాళ్లు కలలో కూడా ఊహించలేదు.

మరికొద్ది సేపటికే వాళ్లు అక్కడే ఉండి తమను తాము రక్షించుకునే ప్రయత్నాలు మానేసి కాళ్లకు బుద్ధి చెప్పారు. జంతువులు సమరోత్సాహంతో వాళ్లను తరుముతుండగా.. జోన్స్ బృందం పడుతూ, లేస్తూ పారిపోసాగింది.

జోన్స్ భార్య పడకగది కిటికీలోంచి జరుగుతున్నది చూసి, చేతికందిన నాలుగైదు విలువైన వస్తువులను కంగారుగా ఓ సంచీలో కుక్కుకుని దొడ్డిదారి గుండా పరుగుతీసింది.

జోన్స్‌నూ, అతని సేవకులనూ తరిమిన జంతువులు ముందుగా క్షేత్రపు సింహద్వారాన్ని మూసేసాయి. నమ్మశక్యం కానంత తొందరగా పూర్తయింది తిరుగుబాటు! మేనర్ క్షేత్రం జంతువుల పరమయింది! మొదట అవన్నీ క్షేత్రం లోపల ఏ మానవుడూ లేడని రూఢీ చేసుకున్నాయి. తిరిగి క్షేత్రపు ప్రధాన భవంతి వద్దకు వచ్చి జోన్స్ కర్కశ పాలనకు సంబంధించిన ఆనవాళ్లను తుడిచేయాలని నిశ్చయించుకున్నాయి.

సామానుల గది తెరిచి అందులోంచి ముకుతాళ్లూ, పగ్గాలూ, కుక్కలను కట్టేసే గొలుసులూ, పందులు, గొర్రెలను నిర్వీర్యం చేయడానికి ఉపయోగించే కత్తెరలూ- అన్నీ తీసి బావిలో పడేసాయి. గుర్రపు జీనులూ, కళ్ల గంతలూ, చెర్నాకోలలూ... అన్నీ మంటల్లో మాడిపోయాయి. జంతువులన్నీ ఆ మంటల చుట్టూ గంతులేసాయి.

గుర్రాల మెడలనూ, తోకలనూ అలంకరించే రిబ్బన్లను స్నోబాల్ మంటల్లోకి విసిరేసింది. 'రిబ్బన్లను దుస్తుల్లా పరిగణించాలి. అవి ధరించడం మానవుల నైజం. జంతువులన్నీ దిగంబరులే' అని తేల్చి చెప్పింది.

ఇది విన్న బాక్సర్ తను ఎండాకాలం ఈగల బారి నుంచి తప్పించుకోవడానికి ధరించే వెదురు టోపీని తెచ్చి మంటల్లోకి విసిరేసింది. కొద్దిసేపట్లో అక్కడ జోన్స్ ఆనవాళ్లేవీ మిగల్లేదు.

జంతువులన్నీ ధాన్యాగారంలోకి పోయి పొట్ట పట్టినంత తిండి తిన్నాయి. ఆ తర్వాత అన్నీ కలిసి స్వేచ్ఛా గీతాన్ని ఆపకుండా ఏడుసార్లు ఆలపించాయి. చివరకు అలసిపోయి ఒళ్లెరగనంత గాఢనిద్రలో మునిగిపోయాయి.

★ ★ ★

మరుసటిరోజు జంతువులన్నీ వేకువనే లేవగానే నిన్నటి రోజున జరిగిన అద్భుతం గుర్తుకు వచ్చి పచ్చికలోకి దౌడుతీసాయి. అక్కడికి దగ్గర్లో క్షేత్రం అంతా కనిపించే ఓ ఎత్తైన కొండ ఉంది. జంతువులన్నీ ఆ కొండ పైకెక్కి ఉదయిస్తున్న సూర్యుని వెలుతురులో క్షేత్రాన్నంతా తృప్తిగా చూసుకున్నాయి. ఔను- ఇప్పుడా క్షేత్రం తమ సొంతం! కనిపించేదంతా తమదే!

ఆ ఆనందంతో అవి బొంగరంలా గిర్రున తిరిగాయి. పైకీ కిందికీ గంతులేసాయి. మంచులో దొర్లాయి. నోటి నిండా తియ్యటి గడ్డి కుక్కుకున్నాయి. గిట్టలతో మట్టిని పెళ్లగించాయి. మట్టి వాసనను ఆనందంగా ఆస్వాదించాయి. క్షేత్రం చుట్టూ కలయతిరుగుతూ- నేలనూ, పండ్ల తోటనూ, పక్కనున్న చెరువునూ అప్పుడే

మొదటిసారి చూస్తున్నట్టు మురిపెంగా చూసుకున్నాయి.

చివరికన్నీ క్షేత్రం మధ్యనున్న భవంతి దగ్గరకు చేరుకున్నాయి. దాని లోపలికెళ్లా లంటే వాటికి భయమనిపించింది. కొద్దిగా ధైర్యం తెచ్చుకున్న స్నోబాల్, నెపోలియ న్‌లు తమ భుజాలతో మెల్లగా దాని తలు పులను నెట్టాయి.

జంతువులన్నీ ఒకే వరుసలో భయం భయంగా లోపలికి నడిచాయి. అడుగులో అడుగు వేసుకుంటూ ప్రతి గదినీ పరిశీలిం చాయి. అక్కడి ఖరీదైన సామాగ్రిని, నగి షీలు చెక్కిన మంచాలనూ, గోడకు వేలాడే పొడుగాటి అద్దాలనూ, బ్రస్సెల్స్ కార్పె ట్‌ను, విక్టోరియా రాణి చిత్తరువునూ అబ్బురపోయి చూసాయి.

అన్నీ తిరిగి మెట్లు దిగుతుండగా మోలీ అదృశ్యం అయిందని గుర్తించాయి. తిరిగి వెళ్లి చూడగా జోన్స్ భార్య అలంకరించు కొనే అద్దం ముందు మోలీ నిలబడి ఓ నీలం రిబ్బన్‌ను తన భుజం మీద వాలుగా వేలాడదీసుకుని మురిసిపోతూ కనిపించింది. అన్నీ దాన్ని తలా ఓ తిట్టు తిట్టి బయటికి లాక్కెళ్లాయి.

అక్కడ్నుంచి వంట గదిలోకి వెళ్లి అక్కడ వేలాడుతున్న మాంసంముక్కలను పెరట్లో పూడ్చేసాయి. పీపాలోని బీరు బాక్సర్ తన్నుతో మట్టిలో కలిసింది. జంతువులు మిగతావేవీ ముట్టలేదు. ఆ భవంతి ఓ జ్ఞాపికలా ఉండాలని అన్నీ తీర్మానించాయి. ఏ ఒక్క జంతువూ ఆ భవనంలో నివసించరాదని నిర్ణయించుకు న్నాయి.

జంతువులన్నీ ఫలహారాలు చేసాక నెపో లియన్, స్నోబాల్ అన్నిటినీ సమావేశపరి చాయి. 'కామ్రేడ్స్! ఈరోజు మనం కోత పని మొదలుపెడదాం. ఐతే దానికన్నా ముందు మనం చేయాల్సిన పనొకటుంది' అన్నాయి.

## నెహ్రూ చతురోక్తులు



మనదేశ మొదటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూను ఆప్యాయంగా చాచాజీ అని పిలుస్తారు. ఆయన జన్మ దినమైన నవంబరు 14ను బాలల దినో త్సవంగా ప్రకటించారు. ఈ సందర్భంగా ఆయన చతురోక్తులు కొన్ని..

### ఏమీ మొలవదంటే ఎలా?

ఇండో-చైనా యుద్ధం గురించి పార్లమెం టులో నెహ్రూ తన ప్రసంగంలో, 'ఒక్క గడ్డిపరక కూడా ఆక్సాయ్ చిన్ ప్రాంతంలో మొలవదు' అన్నారు. ఆ బంజరు భూమిని చైనా ఆక్రమించడంవల్ల పెద్దగా కోల్పోయిం దేమీ లేదని నచ్చజెప్పేందుకు చూశారు. పరిస్థితి చాలా గంభీరంగా ఉంది.

అంతలోనే మహావీర్ త్యాగి లేచి, తన బట్టతలను తడుముతూ 'ఇక్కడ కూడా ఏమీ మొలవదు. అలాగనీ దీన్ని ఎవరికైనా ఇచ్చివేయడమో, కత్తిరించి వేయడమో సరై నదేనా?' అన్నారు.

దాంతో అందరితోపాటు నెహ్రూ కూడా తేలికపడి బాగా నవ్వారు.

ఆ పందులు రెండూ తాము గత మూణ్నెళ్లుగా జోన్స్ పిల్లలు చెత్తలో పడే సిన పుస్తకాల ద్వారా చదవడం, రాయడం నేర్చుకున్నామని చెప్పాయి. నెపోలియన్ నలుపు, తెలుపు రంగులను తెమ్మని రెండుజంతువులకు పురమాయించి క్షేత్రం ముఖద్వారం వద్దకు నడిచింది. రంగులు రాగానే స్నోబాల్ తన రెండు గిట్టల మధ్యా జాగ్రత్తగా కుంచెను ఇరికించుకుని 'మేనర్ క్షేత్రం'ను కొట్టేసి, 'జంతు క్షేత్రం' అని లిఖించింది. అప్పట్నుంచీ దాని పేరు జంతు క్షేత్రంగా స్థిరపడింది.

తిరిగి జంతువులన్నీ భవంతి వద్దకు వెళ్లాక నెపోలియన్, స్నోబాల్‌లు ఓ నిచ్చెన తెచ్చి ధాన్యాగారం గోడకు ఆనించాయి. తమ ఈ మూణ్నెళ్ల అధ్యయనంతో తాము జంతువాదాన్ని ఏడు శాసనాలుగా సూక్ష్మీకరించామని చెప్పాయి. ఆ ఏడు శాసనాలు గోడమీద లిఖించబడతాయనీ.. క్షేత్రంలోని ప్రతి జంతువూ ఆ శాసనాలను తు.చ. తప్పకుండా ఆచరించాలనీ ప్రకటించాయి.

స్నోబాల్ కొంచెం కష్టపడి నిచ్చెన మీద నిలబడి రాయడానికి పూనుకుంది. దానికి కొన్ని మెట్ల కింద స్క్వీలర్ రంగు డబ్బాలు పట్టుకుని నిలబడింది. ఆ ఏడు శాసనాలు గోడమీద తెల్లటి రంగులో దూరం నుంచి కూడా చదవగలిగేంత పెద్దగా లిఖించబడ్డాయి.

ఆ ఏడు శాసనాలు...

1. రెండు కాళ్లమీద సంచరించే ప్రతి జీవీ మన శత్రువు.

2. నాలుగు కాళ్లమీద సంచరించే జీవులు, రెక్కలు కలిగిన జీవులు మన మిత్రులు.

3. ఏ జంతువూ దుస్తులు ధరించరాదు.

4. ఏ జంతువూ పరుపులపై నిద్రించకూడదు.

5. జంతువులేవీ మద్యం సేవించరాదు.

6. ఏ జంతువూ ఇతర జంతువుని చంపరాదు.

7. జంతువులన్నీ సమానం.

స్నోబాల్ ఆ ఏడు శాసనాలను బిగ్గరగా చదివి వినిపించింది. జంతువులన్నీ సంతృప్తిగా తలలూపాయి. కొన్ని తెలివైనవి అప్పుడే ఆ శాసనాలను బట్టీ పట్టడం ప్రారంభించాయి.

స్నోబాల్ కుంచె పక్కనే పడేసింది.

'ఇక అంతా కోతలకు సిద్ధం కండి. ఈ విషయంలో మనం మనుషులకన్నా మెరుగని నిరూపించుకోవాలి' అంది.

అదే సమయంలో అసహనంగా ఉన్న మూడు ఆవులు అంబా అన్నాయి. ఇరవై నాలుగు గంటలనుంచీ వాటి పాలు పితక్కపోవడంతో అవి తమ పొదుగుల భారాన్ని భరించలేకపోతున్నాయి. కొద్దిసేపు ఆలోచించిన పందులు పాత్రలను తెచ్చి విజయవంతంగా పాలను పిండాయి. ఈ విషయంలో వాటి డెక్కలు బాగా సాయపడ్డాయి. నిమిషాల్లో ఐదు పాత్రలలో నురగలు కక్కే పాలు ప్రత్యక్షమయ్యాయి.

మిగతా జంతువులు పాల వంక ఆసక్తిగా చూసాయి. 'ఈ పాలను ఏం చేయబోతున్నారు? ' ఒక జంతువు అడిగింది.

'జోన్స్ కొన్ని పాలను మాకు పెట్టే దాణాలో కలిపేవాడు' కోళ్లు చెప్పాయి.

'పాల గురించి తర్వాత ఆలోచిద్దాం. ముందు కోతల సంగతి చూడండి. కామ్రేడ్స్! అక్కడ కోతకు సిద్ధమైన గడ్డి మనకోసం ఎదురుచూస్తోంది. నేను కొద్ది నిమిషాల్లో వచ్చి కలుస్తాను' అంటూ నెపోలియన్ పాలను తీసుకొని లోపలికెళ్లింది.

జంతువులన్నీ పొలంవైపు కదిలాయి. సాయంత్రం అవి తిరిగి వచ్చేసరికి పాలు మాయమయ్యాయి.

## కొత్తగాలి...

**దర్జాలకు**
**ధన సంపద**
**పద్యాలకు**
**పద సంపద**

– అయినాల కనకరత్నాచారి
కొరిశపాడు, ప్రకాశం జిల్లా

# అతడికి నేనే స్నేహితుడ్ని!

ప్రపంచంలో ఎందరో దురదృష్టవంతులుంటారు. వారికి కష్టకాలంలో సహాయపడేవారు చాలా అరుదు. కనీసం ఒకింత సానుభూతి చూపేవారు కూడా ఉండరు. 'నా' అన్నవారు లేని నిర్భాగ్య దామోదరులకు దిక్కెవరు? ఆ దయామయుడైన దేవుడే ఎవరి రూపంలోనో కనిపించి, సానుభూతి కురిపించి అక్కున చేర్చుకుంటాడు.

అమెరికాలో ఓ దురదృష్టవంతునికి యావజ్జీవ కారాగారవాస శిక్ష పడింది. పుట్టుకతో దరిద్రుడు, అనాథ అయిన అతడు దయాభిక్షకోసం చేసుకున్న విన్నపాన్ని రాష్ట్రాధ్యక్షునికి పంపారు. సామాన్యంగా ఇలాంటి వినతిపత్రాలకు పెద్దమనుషుల రికమండేషన్ కూడా ఉంటుంది. కాని ఈ కేసు చాలా విచిత్రంగా ఉంది. శిక్ష పొందిన వ్యక్తి మూడు ముక్కల్లో రాష్ట్రపతిని దయాభిక్ష ఇవ్వమని వేడుకున్నాడు. రాష్ట్రపతి ఆసాంతం దాన్ని చదివి, ఆశ్చర్యపడి సెక్రటరీని పిలిపించాడు.



'ఇంత పెద్దదేశంలో ఇతనికి శిక్ష తగ్గించమని సిఫారసు చేసే వ్యక్తే లేడా? కనీసం కన్నీరు కార్చి, సానుభూతి చూపించే స్నేహితుడైనా లేడా?' అని ప్రశ్నించాడు.

అప్పుడు సెక్రటరీ, 'కేసు విచారణ జరుగుతున్నప్పుడు ఇతని తరపున వకీలు కాని, సాక్షులు కాని ఎవ్వరూ లేరు. చూడబోతే ఈ విశాల ప్రపంచంలో ఇతడు ఒంటరిగా కనిపిస్తున్నాడు' అని సమాధానం ఇచ్చాడు.

వెంటనే రాష్ట్రపతి, 'మిత్రులే లేని ఈ వ్యక్తికి నేను స్నేహితుణ్ణవుతాను. ఈ అదృష్టహీనునికి న్యాయం దొరకవలసిందే. నా దేశంలో అనాథలకు న్యాయం తప్పక లభించాలి. ఇతని కేసు పునర్విచారణ జరగాలి' అని రాసి, ముఖ్య న్యాయాధిపతికి పంపాడు.

ఆ అనాథకు ఈ సంగతి తెలిసింది. కానీ మొదట్లో నమ్మలేకపోయాడు. తర్వాత అధికారులు అంతా అతడికి వివరించారు. ఆ అదృష్టహీనుడు రాష్ట్రపతికి నిండు మనస్సుతో నమస్కారాలు చేశాడు. ఆ రాష్ట్రపతే బీదలపాలిట కల్పతరువైన అబ్రహామ్ లింకన్!

అప్పటి నిజం

# మిత్రుడికి చురక!

లింకన్‌ను స్నేహితుడు ఒకసారి, 'నీకు అధికారపు ఆచారాల పట్ల విసుగు, అసహ్యం కలుగవా?' అని తీవ్రంగా ప్రశ్నించాడు.



'కొన్నిసార్లు విసుగు పుడుతుంది. అది ఎలాంటిదంటే రైలులో ప్రయాణం చేసి, బండి దిగగానే- వెధవ రైళ్ళు. నాకు ఈ రైళ్ళంటేనే బొత్తిగా ఇష్టంలేదు. రైలు ప్రయాణం కన్నా నడిచిపోవడమే మంచిది- అనే వాళ్లలాగే నేనూ అప్పుడప్పుడు చిరాకు పడుతుంటాను. దానివల్ల ఏమైనా ప్రయోజనం ఉందా?' అన్నాడు లింకన్ మిత్రుడికి చురక వేస్తూ.




**ఎం**త చెమటను చిందించాయవి గింజలను, గడ్డిని వేరు చేయడానికి! వాటి శ్రమ వృథా కాలేదు. అవి ఊహించిన దానికన్నా ఎక్కువ పంట చేతికొచ్చింది.

మానవులు పనిముట్లను తమకనుకూలంగా తయారుచేసుకోవడంవల్ల ఏ జంతువూ వెనుక కాళ్లమీద నిలబడి వాటిని ఉపయోగించలేకపోయేది. కానీ తెలివైన పందులు ప్రతి సమస్యకీ ఏదో ఒక పరిష్కారం కనుగొనేవి.

నిజానికి పందులు ఏ పనీ చేసేవి కావు. కేవలం తమ తెలివితేటలతో ఇతర జంతువులను అజమాయిషీ చేసేవి. క్లోవర్, బాక్సర్‌ల మెడపై ఇప్పుడు నాగలి లేదు. మూతికి పగ్గాలు లేవు. కేవలం ఓ పంది ఆదేశం ప్రకారం 'ఆగండి కామ్రేడ్స్', 'కదలండి కామ్రేడ్స్' అనే మాటలతోనే అవి పొలమంతా కలియతిరుగుతున్నాయి.

ప్రతి చిన్నజంతువు కూడా పంట నూర్చడంలో తన పాత్ర పోషించింది. కోళ్లు, బాతులు కూడా చిన్న చిన్న గడ్డిముక్కలను ముక్కున కరచుకొని పనిచేసాయి. చివరికి మనుషులు పూర్తిచేసే దానికన్నా రెండురోజుల ముందే గింజలు నూర్చడం పూర్తయింది. ఆ క్షేత్రంలో మునుపెన్నడూ అంత పంటను చూడలేదేమో! ఎక్కడా వృథా అనేదే జరగలేదు. ఏ జంతువూ చిన్న గింజను కూడా దొంగిలించలేదు.

ఆ వేసవిలో పని అంతా గడియారంలా ఠంచనుగా జరిగిపోయింది. కలలో కూడా ఊహించనిది జరిగినందుకు జంతువులన్నీ ఉబ్బి తబ్బిబ్బవుతున్నాయి. నోట్లోకి వెళ్లే ప్రతి గింజా వాటికి అమితానందాన్నిచ్చేది. అది జోన్స్ దయతలచి పడేసింది కాదు, తాము కష్టపడి పోగేసింది! పనిలేకుండా కూర్చుని తినే సోమరి మనుషులెవరూ లేనందువల్ల అన్నిటికీ కావలసినంత తిండి ఉంది. విశ్రాంతి తీసుకునే అవకాశం ఉన్నా ఏ జంతువూ విశ్రాంతి కోరలేదు.

పని దగ్గర వాటికి చాలా ఇబ్బందులెదురయ్యాయి. ఉదాహరణకు వాటి వద్ద వరి నూర్చే యంత్రం లేదు. అయినా అవి నోటితోనే గింజలను వేరుచేసేవి. బాక్సర్ బలంతోటీ, పందుల తెలివితోటీ అవి అన్ని ఇబ్బందులను అధిగమించాయి. బాక్సర్ ఇప్పుడు అన్నిటికీ ఆదర్శం. జోన్స్ కాలంలోనే అది కష్టజీవి. ఇప్పుడది రెట్టించిన ఉత్సాహంతో క్షేత్రం మొత్తం తన భుజస్కంధాలపైనే నడుస్తోందా అన్నంతగా శ్రమిస్తోంది. అది ఎప్పుడూ పని చేస్తూనే కనిపించేది. ఎక్కడ కష్టమైన పని ఉందో అక్కడది ప్రత్యక్షం! ఎక్కువ పనిచేయాలనుకుని అది ఒక కోడితో తనను అన్నింటికన్నా అరగంట ముందే లేపాలని ఒప్పందం చేసుకొంది. అది తానెదుర్కొనే ప్రతి సమస్యకీ, ప్రతి ఎదురు దెబ్బకీ సమాధానంగా.. 'నేనింకా ఎక్కువ కష్టపడతాను' అని చెప్పుకునేది. అది దాని ఊతపదం అయ్యింది.

ప్రతి జంతువూ ఇప్పుడు శక్తికొద్దీ శ్రమిస్తోంది. దొంగతనం ప్రసక్తే లేదు. తిండి సరిపోవడం లేదని గొణగడం లేదు. పోట్లాడడం, కొరుక్కోవడం, రక్కడం, అలగడం, అసూయపడడం లేనేలేవు. ఏ జంతువూ పని ఎగ్గొట్టాలని చూసేది కాదు. ఒక్క మోలీ మాత్రం ఉదయాన

ఆలస్యంగా లేచేది. పొద్దు గూకేవేళ తన డెక్కలో రాయి దిగిందనో, మరొకటనో తొందరగా పని ముగించేది.

పిల్లి ప్రవర్తన కూడా వింతగా తయారైంది. ఎక్కడైనా పని ఉందని తెలిస్తే గంటలకొద్దీ మాయమయ్యేది. కానీ దాని కట్టుకథలు వంక పెట్టడానికి వీల్లేనివిగా ఉండేవి. దాని మృదువైన మ్యావ్‌మ్యావ్‌లు విని అది అబద్ధం చెబుతోందని నమ్మడం కష్టం. ముసలి బెంజిమన్ మాత్రం విప్లవం తర్వాత కూడా పెద్దగా మారలేదు. జోన్స్ కాలంలో ఎలా మెల్లిగా పని చేసేదో ఇప్పుడూ అలాగే చేస్తోంది. ఎన్నడూ పని ఎగ్గొట్టేది కాదు, ఎక్కువ పని తలకెత్తుకునేదీ కాదు. విప్లవం, దాని ఫలితాల గురించి అదెన్నడూ ఏ అభిప్రాయమూ తెలపలేదు.

ఆదివారం పనికి సెలవు దినం. ఫలహారం తర్వాత క్రమం తప్పకుండా ఆ క్షేత్రంలో ఓ కార్యక్రమం జరిగేది. ముందుగా జంతువులన్నీ ఓ జెండాను ఎగరేసేవి. స్నోబాల్ ఓ ఆకుపచ్చని గుడ్డమీద ఓ కొమ్ము, గిట్టలను చిత్రించింది. ఆకుపచ్చ రంగు ఇంగ్లండ్‌లోని పచ్చని పంటలకు చిహ్నమనీ, కొమ్ము గిట్టలు మానవ జాతి పీడన అంతమయ్యాక ఏర్పడబోయే జంతురాజ్యానికి చిహ్నమనీ వివరించింది.

జెండా ఎగరేసాక జంతువులన్నీ పశువుల పాకలో సమావేశమయ్యేవి. మరుసటి వారంలో చేయాల్సిన పనులు ఇక్కడ ప్రతిపాదించబడేవి. వాటిని అంగీకరించడమో, చర్చకు పెట్టడమో జరిగేది. తీర్మానాలను పందులే ప్రవేశపెట్టేవి. మిగతా జంతువులకు ఓటెలా వేయాలో తెలుసు కానీ ఈ తీర్మానాల గురించి ఒక్కదానికీ సొంతంగా ఆలోచించడం రాలేదు.

ఈ చర్చల్లో నెపోలియన్, స్నోబాల్ చాలా వాడిగా, వేడిగా పాల్గొనేవి. కానీ విచిత్రంగా అవి ఎన్నడూ ఏకాభిప్రాయానికి రాలేదు. రెండింటిలో ఏదైనా ఒకటి సలహా ఇస్తే రెండోది దాన్ని తప్పక ఖండించేది. స్వేచ్ఛాగీతం గానంతో సమావేశం ముగిసేది. సాయంత్రమంతా ఆటపాటలకు కేటాయించబడింది.

సామానుల గదిని పందులు తమ కోసం ఉంచుకున్నాయి. అవి వడ్రంగి పని, కమ్మర పని, ఇతర వృత్తి పనుల గురించీ జోన్స్ గదిలోని పుస్తకాలు చదివి ఆకళింపు చేసుకునేవి.

స్నోబాల్ జంతువులన్నిటికీ వివిధ సంఘాలనేర్పరచింది. ఈ సంఘాల విషయంలో దానికి తిండీ నిద్ర కూడా పట్టేది కాదు. అది కోళ్లకోసం గుడ్ల ఉత్పత్తిదారుల సంఘం, ఆవులకోసం పాల ఉత్పత్తిదారుల సంఘం, గొర్రెలకోసం ఉన్ని ఉత్పత్తిదారుల సంఘాలను ఏర్పరచింది. ఆ సంఘాల లక్ష్యం ఉత్పత్తిని పెంచడం. ఐతే చివరికి ఈ సంఘాలన్నీ విఫలమయ్యాయనే చెప్పాలి.

ఇక జంతువుల చైతన్యాన్ని పెంచడానికి, వాటి మధ్య శత్రుత్వం తొలగించడానికి కూడా కొన్ని కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి. ఉదాహరణకు.. పిల్లి కొన్ని రోజులపాటు 'బడికి పోదాం'లో చురుగ్గా పాల్గొంది. ఒకరోజు అది గోడమీద

## కొత్తగాలి...

ఆకుల్నీ
ఆకుల్తినే మేకల్నీ
దేన్నయినా తినేవాడే
మనిషి

– నమ్మి కనకనాగ్,
పెనుగొండ, ప.గో జిల్లా

## అక్షరాస్యుడిని!



గోవా పోర్చుగీసువారి ఆధీనంలో ఉన్నకాలమది. అక్కడి ప్రజలనుద్దేశించి ఉపన్యాసం చేసేందుకు నెహ్రూ వెళ్లారు. తన ప్రసంగ పాఠాన్ని చదువబోతుంటే పోర్చుగీసు పోలీసు వచ్చి, 'మీరిక్కడ ఉపన్యాసాలు చదవకూడదు. చదవలేరు' అని కోపంతో గట్టిగా అరిచాడు.

దానికి నెహ్రూ, 'నేను తప్పకుండా చదువుతాను.. ఎందుకంటే నేనొక అక్షరాస్యుడిని' అని హాస్యపూరితంగా సమాధానమిచ్చారు.

కూర్చుని తనకందనంత దూరంలో ఉన్న పిచ్చుకలకు నీతి బోధ చేస్తోంది. ఇప్పుడు జంతువులన్నీ సమానమనీ, కావాలంటే ఏ పిచ్చుకైనా తన పంజా మీద వాలి పరీక్షించుకోవచ్చనీ వినమ్రంగా చెప్పింది. కానీ పిల్లి వంక పిచ్చుకలు కాస్త అనుమానంగానే చూసాయి.

ఇక జంతువులకు చదవడం, రాయడం మాత్రం బాగానే అబ్బాయి. శరదృతువు వచ్చేసరికి జంతువులన్నీ అంతో ఇంతో అక్షరజ్ఞానం సంపాదించాయి.

పందులు అప్పటికే చదవడం, రాయడం పక్కాగా నేర్చుకున్నాయి. కుక్కలు చదవడమైతే నేర్చుకున్నాయిగానీ వాటి ఆసక్తి అంతా ఎప్పుడూ ఆ ఏడు శాసనాలను పఠించడం వరకే. బెంజిమన్ కూడా చదువుకుంది కానీ అదెన్నడూ తన చదువును ప్రదర్శించడానికి పెద్ద ఆసక్తి చూపేది కాదు. తనకు తెలిసి ఇప్పటివరకూ చదవగలిగినదేమీ లేదనేది.

క్లోవర్ అక్షరాలన్నీ నేర్చుకుంది కానీ పాపం దానికి వాటిని వరుసలో పెట్టడమే రాలేదు. ఇక బాక్సర్ Dని దాటి వెళ్లలేకపోయింది. అది తన గిట్టలతో మట్టిలో ABCDలను రాసేది. D తర్వాత ఏమిటా అని చెవులు రిక్కించి, జూలు కదుపుతూ విపరీతంగా ఆలోచించేది కానీ అందులో ఎన్నడూ సఫలం కాలేదు. ఒకోసారి అతి కష్టమ్మీద EFGH లను నేర్చుకునేది గానీ, ఆ ఆనందం మిగలక ముందే ABCD లను మరచిపోయేది.

మోలీ తన పేరులోని ఆరు అక్షరాలు తప్ప మిగతా అక్షరాలను నేర్చుకోవడానికి పెద్ద ఆసక్తి చూపలేదు. చెక్కముక్కలతో ఆ ఆరు అక్షరాలను అందంగా పేర్చి వాటిని పూలతో అలంకరించి చూసుకుంటూ మురిసిపోయేది.

మిగతా జంతువులు Aని దాటి వెళ్లలేకపోయాయి. ఇక కోళ్లు, బాతులు, గొర్రెల్లాంటి మందబుద్ధులు ఆ ఏడు శాసనాలను కూడా కంఠతా పట్టలేకపోయాయి.

స్నోబాల్ బాగా ఆలోచించి ఆ సప్తశాసనాలను ఒకే సూక్తిలోకి కుదించింది. 'నాలుగు కాళ్లవి మంచివి, రెండు కాళ్లవి చెడ్డవి.' జంతువాదం సారమంతా ఆ ఒక్క సూక్తిలోనే ఇమిడి ఉందని సెలవిచ్చింది. పక్షులు దీనికి అభ్యంతరం చెప్పాయి. కానీ స్నోబాల్, 'రెక్క అనేది ఎగరడానికి ఉపయోగించేది. చేతిలా పని చేయడానికి ఉపయోగించేది కాదు. కనుక రెక్కలూ కాళ్లకిందే లెక్క' అని వాదించింది.

పక్షులకు ఈ వాదన అర్థం కాకున్నా అవి స్నోబాల్ మాటలను నమ్మాయి. మందబుద్ధులన్నీ ఈ కొత్త సూక్తిని బట్టీ

పట్టడం ప్రారంభించాయి. ఈ సూక్తి గొర్రెలకు బాగా నచ్చింది. అవి విసుగూ విరామం లేకుండా 'నాలుగు కాళ్లవి మంచివి, రెండు కాళ్లవి చెడ్డవి' అని గంటల తరబడి నినాదాలు చేసేవి.

స్నోబాల్ ఏర్పాటు చేసిన సంఘాలలో నెపోలియన్ ఏ మాత్రం ఆసక్తి చూపలేదు. తనకు పెద్దవాళ్లకంటే, పిల్లల చదువులే ముఖ్యమంది. కోతలు పూర్తికాగానే జెస్సీ, బ్లూబెల్‌లు కలిసి తొమ్మిది కుక్కపిల్లలను కన్నాయి. ఆ పిల్లలు పాలు మానగానే వాటి విద్యారంభం తనదేనని నెపోలియన్ వాటిని తల్లుల నుంచి దూరంచేసి, వాటిని ఓ మంచెపైకి చేరవేసింది. తొందర్లోనే ఆ కుక్క పిల్లల గురించి అన్నీ మరచిపోయాయి. ఇక పాలు ఏమైపోతున్నాయనే రహస్యం తొందర్లోనే బహిర్గతమయింది. అవి రోజూ పందుల తవుడులో కలపబడుతున్నాయని తెలిసింది. ఆపిల్ పండ్లు కూడా అప్పుడే కాపుకు వచ్చాయి. ఆపిల్ తోటంతా గాలికి రాలిన పండ్లతో నిండిపోయింది. ఆ పండ్లు తమకు పంచబడతాయని జంతువులు ఆశించాయి. కానీ ఆ పండ్లన్నీ పందులుంటున్న సామాన్ల గదిలోకి చేర్చాలని ఆదేశించబడింది. కొన్ని జంతువులు చిన్నగా గొణిగాయి కానీ వాటి నెవరూ పట్టించుకోలేదు.

ఈ విషయంలో మాత్రం నెపోలియన్, స్నోబాల్‌తో సహా పందులన్నీ ఏకాభిప్రాయం మీదున్నాయి. మిగతా జంతువులకు నచ్చజెప్పడానికవి స్క్వీలర్‌ను ఎన్నుకున్నాయి.

'సహచరులారా! మేమిదంతా స్వార్థంతోనో, తిండిమీద ఆశతోనో చేయడంలేదు. నిజానికి మాలో చాలామందికి పాలు, ఆపిళ్లంటే ఇష్టంలేదు. కానీ కేవలం మా ఆరోగ్యం కోసం వాటిని తీసుకుంటున్నాం. పాలు, ఆపిళ్లు పందుల ఆరోగ్యానికి చాలా అవసరమని సైన్సు చెబుతోంది. కామ్రేడ్స్! మా పందులు బుద్ధిజీవులు. యావత్ క్షేత్రం పాలన, పర్యవేక్షణ చూడాల్సింది మేమే. రాత్రనకా, పగలనకా మేం మీ శ్రేయస్సు చూస్తున్నాం. కేవలం మీ కొరకే మాకిష్టంలేని తిండి తింటున్నాం. మేం సరిగా పనిచేయకపోతే ఏమవుతుందో తెలుసా? ఆ జోన్స్ మళ్లీ తిరిగి వస్తాడు. మీలో ఎవరికైనా జోన్స్ తిరిగి వస్తే చూడాలనుందా?' స్క్వీలర్ తన తోకను ఊపుతూ అడిగింది.

స్క్వీలర్ వాదనకు ఇక ఏ జంతువూ నోరు మెదపలేదు.




**జం**తు (మేనర్) క్షేత్రంలో జరిగిన తిరుగుబాటు గురించి తొందర్లోనే దేశమంతా తెలిసిపోయింది. నెపోలియన్, స్నోబాల్‌లు తమ పావురాలకు ఇతర క్షేత్రాల్లోని పశుపక్ష్యాదులను కలిసి, తిరుగుబాటు గురించి వ్యాప్తిచేసే విధంగా తర్ఫీదునిచ్చాయి. వాటికి స్వేచ్ఛాగీతం కూడా నేర్పించి రమ్మన్నాయి.

ఇక జోన్స్ వెల్లింగ్‌డన్‌లోని రెడ్ లయన్ బారులో తాగుతూ కూర్చుని, అక్కడికొచ్చేవారందరికీ జంతువులు తనకు చేసిన అన్యాయాన్ని మొరపెట్టుకునేవాడు. మిగతా రైతులు అతని స్థితికి జాలిపడినా అతనికి సాయం చేసేందుకు ఎవరూ

ముందుకు రాలేదు. జోన్స్‌కు జరిగిన నష్టాన్ని తామెలా లాభదాయకంగా మార్చుకోవాలని వాళ్లు తమ మనసులో ఆలోచించారు.

జంతు క్షేత్రానికి అటుఇటు ఉన్న రెండు క్షేత్రాలు ఎల్లప్పుడూ కీచులాడుకునేవి. వాటిల్లో ఒకదాని పేరు 'ఫాక్స్‌వుడ్'. అది ఒక నిర్లక్ష్యం చేయబడ్డ పాతకాలం నాటి క్షేత్రం. చెట్లూ లతలూ అల్లుకుపోయి, గడ్డి ఎండిపోయి, గోడలు కూలిపోయి- దారుణంగా ఉండేది. దాని యజమాని పిల్కింగ్టన్ ఏదీ పట్టించుకునే రకం కాదు. అతనెప్పుడూ వేటలోనూ, చేపలు పట్టడంలోనూ మునిగితేలుతూ ఉండేవాడు.

మరోక్షేత్రం 'పించ్‌ఫీల్డ్'. అది చిన్నగా, చూడముచ్చటగా ఉండేది. దాని యజమాని ఫ్రెడరిక్ సూటిగా మాట్లాడేవాడు, గట్టివాడు. అతనెప్పుడూ కోర్టు గొడవల్లో మునిగితేలేవాడు. బేరసారాలకు అతను పెట్టింది పేరు.

పిల్కింగ్‌టన్, ఫ్రెడరిక్‌లు పరస్పరం ద్వేషించుకునేవాళ్లు. అయినా మేనర్ క్షేత్రంలో జరిగిన తిరుగుబాటు గురించి విన్న ఇద్దరూ బెదిరిపోయారు. తమ జంతువులు కూడా ఈ తరహా తిరుగుబాటు లేవదీయవచ్చని ఆందోళన చెందారు.

మొదట్లో ఆ ఇద్దరూ ఓ క్షేత్రాన్ని జంతువులు ఎలా నడుపుతాయని ఎగతాళి చేశారు. ఓ పక్షం రోజుల్లో అంతా సర్దుకుంటుందన్నారు. మేనర్ క్షేత్రం(దానిని జంతుక్షేత్రం అనడానికి వాళ్లు నిరాకరించారు)లో జంతువులు నిరంతరం కీచులాడుకుంటున్నాయనీ, తొందర్లోనే అవి ఆకలికి మాడి చావడం ఖాయమనీ అందరితో చెప్పేవాళ్లు. కానీ కాలం గడిచేకొద్దీ జంతువులేవీ చావకపోవడంతో మాట మార్చి, మేనర్ క్షేత్రంలో ఇపుడు చాలా ఘోరాలు జరుగుతున్నాయనడం మొదలుపెట్టారు. జంతువులు ఒకదాన్నొకటి పొడుచుకుతింటున్నాయనీ, ఇనుప కడ్డీలతో కాల్చుకుంటున్నాయనీ, జంతువులేవీ ఏకపతి(త్నీ) వ్రతం పాటించడంలేదనీ... వగైరా.

అయితే ఈ కథల్నెవరూ నమ్మలేదు. జంతువులు, పక్షులు ఓ క్షేత్రాన్ని ఎంతో అద్భుతంగా నిర్వహిస్తున్నాయన్న పుకార్లు వింతవింత రూపాల్లో ప్రత్యక్షమయ్యాయి. ఇతర క్షేత్రాల్లో ఉండే జంతువుల్లో మార్పు వచ్చింది. సాధువుగా ఉండే ఎద్దులు పొగరుబోతుగా మారాయి. గొర్రెలు కంచెలు విరగదోసి గడ్డి మేస్తున్నాయి. ఆవులు పొదుగులను ముట్టనివ్వడంలేదు. వేటకుక్కలు అడుగు ముందుకెయ్యడానికి మొరాయిస్తున్నాయి. స్వేచ్ఛాగీతం అతివేగంగా అంతటా వ్యాపిస్తోంది. ఆ పాట విన్న మనుషులు పైకి దాన్ని తీసిపారేసినా లోలోపల రగిలిపోయేవారు. ఏ జంతువైనా ఆ పాట పాడుతూ కనిపిస్తే అంతే! దానికక్కడే బడితెపూజ జరిగేది. అయినా మనుషులా పాటను అణచిపెట్టలేకపోయారు. ఆ పాటను పావురాలు కువకువలాడాయి. గాడిదలు ఓండ్రపెట్టాయి. ఆ రాగం కమ్మరి తిత్తిలోకి, చర్చీల గంటల్లోకి ప్రవహించింది. ఆ పాట మనుషులకు మృత్యుఘంటికలా వినిపించేది.

అక్టోబరులో ఓ పావురాల గుంపు పెద్ద అలజడితో కువకువలాడుతూ జంతుక్షేత్రం ముంగిట్లో వాలింది.

జోన్స్, అతడి అనుచరులతో పాటు పించ్‌ఫీల్డ్, ఫాక్స్‌వుడ్ క్షేత్రాల నుంచి మరో అరడజను మంది జంతుక్షేత్రం ముఖద్వారం తోసుకుంటూ లోపలికి వచ్చారు. అందరి చేతుల్లో కర్రలున్నాయి. జోన్స్ చేతిలో మాత్రం ఓ తుపాకి ఉంది. తన క్షేత్రాన్ని తిరిగి ఆక్రమించుకోవడానికి



వచ్చాడతను.

ఈ దాడిని ముందే ఊహించడం వల్ల జంతువులు సర్వసన్నద్ధంగా ఉన్నాయి. అప్పటికే జూలియస్ సీజర్ ఘట్టాలన్నీ చదివిన స్నోబాల్ తగిన ఏర్పాట్లు చేసే వుంది. స్నోబాల్ సైగ అందుకున్న జంతువులన్నీ తమతమ స్థానాలనాక్రమిం చాయి.

మనుషులు ఆ భవంతిని సమీపించ గానే పావురాలు తమ వాడి గోళ్ల ప్రతాపం చూపించాయి. వాళ్లు ఆ పావురా లను తోలే ప్రయత్నంలో ఉండగానే, బాతులు తమ ముక్కులతో వాళ్ల కాలి పిక్కలను పట్టి కరవసాగాయి. అయితే ఈ చిన్న జీవాలను మానవులు తమ కర్ర లతో సులభంగానే అదుపు చేశారు.

స్నోబాల్ అప్పుడు తన ద్వితీయ శ్రేణిని ఉపయోగించింది. స్నోబాల్ నాయకత్వాన బెంజిమన్, మురియల్, మిగతా గొర్రెలూ వచ్చి మనుషులను చుట్టుముట్టాయి. అయితే మేకులున్న బూట్లు, కర్రలతో మనుషులు వాటిని కూడా అదుపు చేశారు. అప్పుడు స్నోబాల్ ఘీంకారంతో సంకేతం అందుకున్న జంతువులన్నీ వెను దిరిగి పెరట్లోకి పరిగెట్టాయి.

జోన్స్ బృందం పెద్దపెట్టున విజయధ్వానాలు చేశారు. జంతువులు పారిపోతున్నాయని వాటి వెనకాల పడ్డారు. స్నోబాల్‌కు కావలసిందదే! మనుషులంతా పెరట్లోకి రాగానే అప్పటివరకు దాక్కున్న గుర్రాలు, ఆవులు, పందులు వెనుక ద్వారాన్ని మూసేస్తూ వాళ్లను కమ్ముకున్నాయి.

స్నోబాల్ జోన్స్ మీదికి లంఘించింది. తనపైకొస్తున్న స్నోబాల్‌ను గురిచూసి కాల్చాడు జోన్స్. అది గురితప్పి ఓ గొర్రె నేలరాలింది. దాని రక్తం స్నోబాల్ వీపును అరుణారుణం చేసింది. స్నోబాల్ తన బరువంతా జోన్స్ కాళ్లపైకి గురిపెట్టి దూకింది. జోన్స్ వెళ్లి పేడ కళ్లంలో పడ్డాడు. అతని తుపాకి ఎగిరి దూరంగా పడింది.

బాక్సర్ రూపం అన్నిటికన్నా రౌద్రంగా ఉంది. అది తన కాళ్లెత్తి ఇనప నాడాలతో కాలయముడిలా మనుషుల తలలు బద్దలు చేసింది. దాని మొదటి దెబ్బకే ఒకడి తల పగిలి, వాడు నేలకరిచాడు. అది చూసి చాలామంది కర్రలు పారేసి పారిపోవడానికి దారులు వెతుక్కోసాగారు.

మనుషులందర్నీ జంతువులు గుండ్రంగా పరిగెత్తించాయి. అవి మనుషలను కరిచాయి, రక్కాయి, తొక్కాయి. ప్రతి జంతువూ తనదైన శైలిలో కసి తీర్చుకుంది. ఒకానొక క్షణంలో ద్వారం ఖాళీగా కనిపించేసరికి అంతా బయటపడి పోలోమని పరుగు లంకించుకున్నారు. దాడిచేసిన అయిదు నిమిషాల్లోనే వాళ్లు తమ పోరు ముగించి పలాయనం చిత్తగించారు. వారి వెనకాలే బాతులు గోలగోలగా వాళ్ల కాలిపిక్కలు పట్టి పీకసాగాయి.

మనుషులంతా పారిపోయారు. బాక్సర్ దెబ్బకు నేల కరిచినవాడు తప్ప! బాక్సర్ తన కాలితో వాడిని తిప్పడానికి ప్రయత్నించింది. కానీ వాడు కదల్లేదు.

'వీడు చనిపోయాడు' బాక్సర్ విచారంగా అంది. 'కానీ వీణ్ని చంపే ఉద్దేశం నాకెంత మాత్రం లేదు. ఆవేశంలో నా కాలికి నాడాలున్నాయని మరచిపోయాను. ఇది నేను కావాలని చేయలేదు'

'అనవసరంగా చింతించకు కామ్రేడ్' స్నోబాల్ మందలించింది. దాని గాయాల్నుంచి ఇంకా రక్తం స్రవిస్తోంది.

'యుద్ధమన్నాక యుద్ధమే. మనుషుల్లో మంచోడంటూ ఎవరూ లేరు. చచ్చినోళ్లే మంచోళ్లు'

'నాకు ఎవరినీ చంపాలనే ఆలోచన లేదు. అది మనిషినైనా సరే!' బాక్సర్ కళ్ల నిండా నీళ్లు.

'మోలీ ఎక్కడ? ' ఏదో జంతువు ప్రశ్నించింది.

మోలీ అక్కడ లేదు! ఒక్క క్షణం

### కొత్తగాలి...

**పదునెనిమిది ఏళ్లకు ఓటుహక్కు**
**ఇరవై ఒక్క ఏళ్లకు పెళ్లిహక్కు**
**అంటే..**
**దేశాన్ని మేనేజ్ చేయడంకన్నా**
**భార్యను మేనేజ్ చేయడం కష్టమని!**

*– అంబటి వెంకట శివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడపజిల్లా*

# ఉత్తమ పొరుగువాడు




అమెరికాలో పెన్సిల్వేనియాలోని లాట్‌రోబ్ ప్రాంతానికి చెందిన ఫ్రెడ్ రోగర్స్ (69)ను ఉత్తమ పొరుగువాడిగా తీర్మానించారు. 9,500 జనాభా గల ఆ ఊర్లో ఫ్రెడ్ తన సొంత డబ్బుతో అనేక అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టాడు. స్విమ్మింగ్ పూల్, అందమైన పార్కు, లైబ్రరీ, ఎలిమెంటరీ స్కూల్ తదితరాలను నిర్మించాడు.

ప్రతి క్రిస్మస్ ముందురోజు రాత్రి కొన్ని వందల జతల బూట్లు ఆ ఊర్లోని బీదవారి ఇళ్ల ముందు వదిలి వెళతాడు. దానికోసం జనాభా లెక్కలను చూసి ఏ ఇంట్లో ఎంతెంతమంది ఉన్నారో, వారి ఆదాయం, వయసు వివరాలేమిటో సేకరిస్తాడు.




ఇటీవల పిల్లలకోసం ఆటస్థలం ఏర్పాటు చేశాడు. భార్య మరణించడం, కుటుంబ సభ్యులందరూ వృత్తిరీత్యా దూరంగా వెళ్లిపోవడంతో ఫ్రెడ్ రోగర్స్ తాను టీవీ నటుడిగా ఆర్జించిన లక్షల డాలర్లను స్థానిక ప్రజల సౌకర్యార్థం ఖర్చు చేస్తున్నాడు. అతడి తాత ఫ్రెడ్ మేక్ ఫీలీ కూడా వందేళ్లక్రితం అదే ఊళ్లో నివసించినప్పుడు తన సంపాదనను ఊరివారికోసం ఖర్చు చేశాడు. తాత డైరీ చదివి ఈ సంగతి గ్రహించిన ఫ్రెడ్ సైతం ప్రభావితుడై ఈ సేవా కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాడు.

పెన్సిల్వేనియా రాష్ట్రంలో ఓ వారపత్రిక నిర్వహించిన 'బెస్ట్ నైబర్' పోటీలో ఫ్రెడ్‌ని గ్రామస్థులు ఎన్నుకున్నారు. దాంతో అతడి గురించి ప్రపంచానికి తెలిసింది.

అక్కడ అలజడి చెలరేగింది.

మనుషులు మోలీకెక్కడ హాని తలపెట్టారోనని అన్నీ భయపడ్డాయి. లేక మోలీని ఎత్తుకుపోయారా! చివరికి మోలీ గడ్డిలో తలదూర్చి ఉండగా కనుగొన్నాయి. తుపాకి శబ్దం వినగానే అది పారిపోయి గడ్డిలో తల దూర్చింది. అన్నీ తిరిగి వచ్చేసరికి నేలమీద పడినవాడు ఉడాయించాడు. నిజానికి వాడు బాక్సర్ దెబ్బకు స్పృహ తప్పాడంతే!

ఉద్రేకం తగ్గని జంతువులన్నీ సమావేశమయ్యాయి. ఒక్కో జంతువు తనే విధంగా ఒక్కోడినీ తిప్పలు పెట్టింది గొంతెత్తి బిగ్గరగా చెప్పుకున్నాయి. వెంటనే ఓ విజయోత్సవ సభ ఏర్పాటు చేయబడింది. జెండా ఎగరేసి అవి ఎన్నోమార్లు స్వేచ్ఛాగీతం ఆలపించాయి. పోరాటంలో మరణించిన గొర్రెను సకల మర్యాదలతో ఖననం చేశాయి. దాని సమాధిపై ఓ మొక్క నాటాయి. దాని సంతాప సూచకంగా స్నోబాల్ ప్రసంగం కూడా చేసింది. తమ క్షేత్ర రక్షణ కోసం జంతువులన్నీ ప్రాణత్యాగానికైనా సిద్ధపడాలని పిలుపునిచ్చింది.

జంతువులన్నీ అప్పటికప్పుడు 'వీర మార్తాండ' అనే ప్రథమశ్రేణి పతకాలను బాక్సర్, స్నోబాల్‌లకు ప్రదానం చేయాలని నిర్ణయించాయి. మరణించిన గొర్రెకు మరణానంతరం 'వీరాధివీర' అనే ద్వితీయశ్రేణి పతకం ప్రకటించబడింది.

ఆ పోరుకు ఏం పేరు పెట్టాలా అని

చాలా వాదోపవాదాలు జరిగాయి. చివరికి దానిని 'పశువుల పాక సమరం' అని పిల వాలని నిర్ణయించాయి. జంతువులు మను షులను అన్నివైపుల నుంచీ ముట్టడించింది ఆ పాకలోనే. జంతువులకు జోన్స్ తుపాకి దొరికింది. భవంతిలో కొన్ని తూటాలు దొరికాయి. తుపాకిని జెండా కర్రవద్ద పాతాలనీ, దానిని ఏడాదికి రెండుసార్లు- తిరుగుబాటు జరిగిన రోజున, పశువుల పాక సమరం జరిగిన రోజున పేల్చాలని నిర్ణయించాయి.




కాలం గడిచేకొద్దీ మోలీ పెద్ద సమస్యై కూర్చుంది. అది ప్రతీ ఉదయం పనికి ఆలస్యమే. నిద్ర ఎక్కువైందనీ, రకరకాల నొప్పులు తనను బాధిస్తున్నాయనీ బొంకేది. కానీ తిండి మాత్రం బ్రహ్మాం డంగా తినేది. సందు దొరికితే చాలు, ఏదో కారణం చెప్పి నీళ్లు తాగే కుంటలో తన ప్రతిబింబం చూసుకుంటూ కులికేది. దాని గురించి ఆందోళన కలిగించే పుకార్లు కూడా బయలుదేరాయి.

ఓ రోజు మోలీ ఆనందంగా అటు ఇటూ గెంతుతుంటే క్లోవర్ దానిని తన పక్కకు పిలిచింది. 'మోలీ! నిన్నో విషయం అడ గాలి. ఆ రోజు ఉదయం మన జంతుక్షే త్రాన్ని, ఫాక్స్‌వుడ్‌ను వేరుచేసే సరిహద్దు వద్ద నిన్ను చూసాను. పిల్కింగ్‌టన్ మని షొకడు నీ మూతి నిమురుతూ ఉండటం నేను స్పష్టంగా చూసాను. ఇదంతా ఏమిటి మోలీ? '

'నేనక్కడ లేను. అక్కడెవరూ లేరు. అంతా అబద్ధం' మోలీ బుకాయించింది.

'మోలీ! నా మొహంలోకి చూడు. ఆ మనిషి నీ మూతి నిమరలేదని ప్రమాణం చేయి'

'అంతా అబద్ధం' అంది మోలీ. కానీ క్లోవర్ మొహంలోకి చూడలేక, పొలాలకేసి తిరిగి ఒక్క ఉదుటన పరుగందుకుంది.

క్లోవర్ రహస్యంగా మోలీ గుడిసె వద్ద కెళ్లి అక్కడ గడ్డి కింద వెదికింది. దానికి చక్కెర పలుకులూ, రంగు రంగుల రిబ్బన్లూ దొరికాయి. మూడ్రోజుల తర్వాత మోలీ మాయమైంది! కొన్ని వారాలపాటు దాని సమాచారమేమీ తెలీలేదు. ఓ రోజు పావురాలు ఓ కబురు తెచ్చాయి- మోలీ విల్లింగ్‌డన్ అవతల ఓ బగ్గీని లాగుతూ కనిపించిందని. దాని ఒంటిమీద అంద మైన జీనూ, మెడలో రకరకాల అద్దాలూ, రిబ్బన్లూ ఉన్నాయట. అది చాలా ఆనం దంగా కనిపించిందన్నాయి పావురాలు. ఇక జంతువులేవీ మళ్లీ మోలీ ఊసెత్త లేదు.

జనవరిలో వాతావరణం అతి క్రూరంగా మారిపోయింది. నేల ఇనుములాగా గట్టిగా తయారైంది. పొలం పనులన్నీ కుంటుపడ్డాయి. ధాన్యాగారంలో ఈ నడుమ చాలా సమావేశాలు జరిగాయి. పందులన్నీ భవిష్యత్తులో చేయాల్సిన పను లను గూర్చి సుదీర్ఘంగా చర్చించాయి. పొలానికి సంబంధించిన నిర్ణయాలన్నీ పందులే తీసుకునేవి. అయితే ఆ నిర్ణయా లను మిగతా జంతువులు బలపరిస్తేనే అవి అమలయ్యేవి.

ఈ విధంగా అంతా సజావుగా సాగిపో యేది- స్నోబాల్, నెపోలియన్‌ల మధ్య

అభిప్రాయబేధాలు రానట్టయితే. ప్రతి చోటా ఈ రెండూ తలోదారీ పట్టేవి. ఒకటి పొలంలో బార్లీ పండించాలంటే, మరొకటి ఓట్‌లు పండించాలనేది. ఫలానా నేలలో క్యాబేజీ బాగా పండుతుం దని ఒకటంటే, మరొకటి అది క్యారట్లకు తప్ప దేనికీ పనికి రాదనేది. ఈ రెంటికీ ప్రత్యేక అనుచర గణం కూడా ఉండేది.

ఒకోసారి ఈ వాదనలు శృతిమించేవి. స్నోబాల్ తన వాదనాపటిమతో అధిక సంఖ్యాకుల మద్దతు సంపాదించేది. కానీ నెపోలియన్ జంతువులు ఒంటరిగా ఉన్నప్పుడు మాత్రం వాటిని ఒప్పించగలిగేది. ప్రత్యేకించి గొర్రెలు దానికి బాగా మద్దతిచ్చేవి. ఈ మధ్యన గొర్రెలు 'నాలుగు కాళ్లవి మంచివి, రెండు కాళ్లవి చెడ్డవి' అనే సూక్తిని సమయం, సందర్భం లేకుండా వల్లె వేస్తున్నాయి. అప్పుడప్పుడు ఆ అరుపులతో అవి సమావేశాలను కూడా భగ్నం చేసేవి. ప్రత్యేకించి స్నోబాల్ ఉపన్యాసంలో ఏదైనా ముఖ్యమైన అంశం గురించి చెబుతున్నప్పుడే ఈ అరుపులు అరిచేవి.

స్నోబాల్ 'రైతు-పశుపోషణ' అనే పత్రిక పాత ప్రతులను చదివి చాలా ప్రణాళికలు తయారుచేసింది. ఎరువుల సేకరణ, దానిని చల్లే పద్ధతిని గురించి అది కొన్ని సిద్ధాంతాలను ప్రతిపాదించింది. ఎరువులను ఒకచోటి నుంచి మరో చోటుకు తరలించే పనిని తగ్గించడానికి జంతువులన్నీ పొలాల్లో వేర్వేరుచోట్ల మల మూత్రాలను విసర్జించాలంది.

నెపోలియన్ ఇలాంటి ప్రణాళికలేవీ పెట్టుకోలేదు. ఈ ప్రణాళికలన్నీ వృథా అనీ, స్నోబాల్ వట్టి మాటకారి అనీ కొట్టి పారేసేది. వీటి మధ్య గొడవ గాలి మర(వాయుశక్తితో నీటిని తోడే యంత్రం) దగ్గర మరీ ఎక్కువైంది.

క్షేత్రానికి దగ్గర్లో, పచ్చటి గడ్డి మధ్యలో

## సాహిత్యంతోనే పురోగతి



### మురారి రవికృష్ణ

నా స్వస్థలం అనంతపురం జిల్లా గుత్తి ఆర్.ఎస్. పన్నెండేళ్లు రైల్వేలో డ్రైవర్‌గా చేశాను. నా అభిమాన రచయితలు పతంజలి, నామిని, రావిశాస్త్రి, రంగనాయకమ్మ. జీవితంలో అన్నింటిలోనూ వేలు పెట్టాలన్న ఆశతో ఎక్కడా నిలకడగా ఉండలేక పోయాను. అరుంధతిరాయ్‌లా యాక్టివిస్ట్ రచయిత కావాలని ఆకాంక్ష. సాహిత్యంలో మార్గదర్శకత్వం లేకపోవడం, సాహితీ వాతావరణంలో పెరగకపోవడం నా లోటు. మరిన్ని ఇంగ్లిష్ రచనల్ని అనువాదం చేయాలని ఉంది. రైలు డ్రైవర్ల జీవితంపై కథ లేదా నవల రాయాలని కోరిక. సాహిత్యం ఆసరా లేని సమాజం పురోగమించలేదనేది నా ప్రగాఢ విశ్వాసం.

చిరునామా:
మురారి రవికృష్ణ,
ఇంటి నెం. 5-232,
మురళీ నిలయం, మెయిన్ రోడ్,
గుత్తి ఆర్.ఎస్. అనంతపురం జిల్లా



ఎత్తైన ప్రదేశం నుంచి జారే ఓ జలపాతం ఉంది. అది గాలియంత్రానికి అనువైనదని స్నోబాల్ నిర్ణయించింది. గాలియంత్రంతో నీటిని తోడి, విద్యుత్తును ఉత్పత్తిచేసి క్షేత్రాన్ని కాంతిమయం చేయవచ్చునంది. అంతేకాకుండా ఆ విద్యుత్తు చలికాలంలో పశువుల పాకలను వెచ్చపరుస్తుందనీ, కూరగాయలను తరుగుతుందనీ, పాలు పితుకుతుందనీ, దానివల్ల ఇంకా చాలా లాభాలున్నాయనీ తెలిపింది.

జంతువులు ఇటువంటి వింతను గురించి ఎన్నడూ వినలేదు. స్నోబాల్ వీటన్నిటి గురించీ చెబుతుంటే అవన్నీ-తాము పొలాల్లో స్వేచ్ఛావిహారం చేస్తు న్నట్టు, చదువుల్లో మునిగి జ్ఞానవంతులమై నట్లు ఊహించుకుని తెగ ఆనందించాయి.

స్నోబాల్ గాలియంత్రం నమూనాను సిద్ధం చేసింది. దానికి సంబంధించిన యాంత్రిక విషయాలను అది జోన్స్ గ్రంథాలయంలో సంపాదించింది. అది తన గదిలో నేలమీద రకరకాల చిత్రాలు గీస్తూ గంటల తరబడి గడిపేది. తన కాలి వేళ్ల మధ్య ఓ సుద్దముక్కను పట్టుకుని గీతలను గీస్తూ, మధ్యలో ఉత్సాహంగా కేకలు పెట్టేది. రాన్రానూ దాని గదంతా క్లిష్టమైన చక్రాలూ, ఇరుసులూ, తీగల బొమ్మలతో నిండిపోయింది. మిగతా జంతువులకు ఆ గీతలు ఏ మాత్రం అర్థం కాకున్నా తమ మధ్యలో అంత తెలివైన వరాహం ఉండటం వాటికి ఆనందాన్ని చ్చింది. అవి రోజూ ఒక్కసారైనా వచ్చి ఆ బొమ్మలను చూసి వెళ్లేవి.

నెపోలియన్ మొదట్నించీ గాలియం త్రాన్ని వ్యతిరేకిస్తూ వచ్చింది. ఒక రోజది అనుకోకుండా ఆ బొమ్మలను చూడటానికి వచ్చింది. ఆ బొమ్మల చుట్టూ ఆసక్తిగా ప్రదక్షిణలు చేసి, వాటిని రకరకాల కోణా ల్లోంచి తీక్షణంగా చూసింది. వాటిని మూ చూసింది. హఠాత్తుగా తన కాలెత్తి, ఆ బొమ్మలపై మూత్రం విసర్జించి, ఒక్క మాట కూడా మాట్లాడకుండా ఆ గది లోంచి నిష్క్రమించింది.

జంతుక్షేత్రం మొత్తం గాలియంత్రం విషయంలో రెండుగా చీలిపోయింది. అది చాలా కష్టమైన పనే అని స్నోబాల్ ఒప్పు కుంది. రాళ్లను పగలగొట్టి గోడలు కట్టాలి. పంఖాలను తయారుచేయాలి. విద్యుత్తును ఉత్పత్తిచేసే యంత్రాలను, సరఫరా చేసే తీగలను సంపాదించాలి. అయితే ఒక్క సారి ఆ యంత్రం పనిచేయడం ప్రారంభిం చాక ఇక జంతువులకు పని తగ్గిపోతుంద ని, అవి వారానికి మూడురోజులు మాత్రం పనిచేస్తే సరిపోతుందనీ భరోసా యిచ్చింది.

మరోపక్క నెపోలియన్ -తమ తక్షణ కర్తవ్యం ఆహారోత్పత్తి పెంచడమనీ, లేక పోతే అంతా ఆకలితో మాడి చస్తాం- అని వాదించింది. ఒక వర్గం- మేం స్నోబాల్ వైపు, మా ఓటు మూడురోజుల పనిదినా లకే అంటే, మరో వర్గం -మేం నెపోలి యన్ వైపు, మా ఓటు ఆహారోత్పత్తికే అన్నాయి.

బెంజిమన్ మాత్రం ఏ వర్గంలోనూ చేర లేదు. గాలియంత్రం కారణంగా తమ పని తగ్గుతుందన్నా, ఆహారోత్పత్తి పెరుగుతుం దన్నా అది నమ్మలేదు. గాలియంత్రం ఉన్నా లేకున్నా జీవితం కష్టాలమయమే అంది.

ఈ గాలియంత్రం గొడవమీదనే కాకుండా జంతు క్షేత్రం రక్షణ మీద కూడా చర్చ మొదలైంది. జోన్స్ బృందం పశు వుల పాక సమరంలో ఓడినా తొందర్లోనే మరిన్ని ఆయుధాలతో దండెత్తుతారని అవి ఊహించాయి. వాళ్ల పరాజయం విషయం చుట్టుపక్కల క్షేత్రాలలో పాకి పోయి అక్కడి జంతువులు కూడా తిరుగు





బాటుకు సన్నద్ధం అవుతున్నాయి. అందు వల్ల వీలైనంత త్వరలో జంతుక్షేత్రాన్ని కైవసం చేసుకోవాలనేది మనుషుల ఆలోచన.

నెపోలియన్ వీలైనన్ని ఆయుధాలు సంపాదించి వాటిని ఉపయోగించడంలో జంతువులకు శిక్షణనివ్వాలంది. స్నోబాల్ చుట్టుపక్కల క్షేత్రాలకు పావురాలను పంపి అక్కడి జంతువుల్లోనూ తిరుగుబాటు తత్వాన్ని వృద్ధి చేయాలంది.

ఒకటి- తమని తాము రక్షించుకోలేక పోతే మనుషులు తమని సులభంగా అణగదొక్కుతారంటుంది. మరొకటి- తిరుగుబాటు అంతటా మొదలైనప్పుడు ఇక తమ రక్షణ సమస్యే కాదంటుంది. ఈ విషయంలో జంతువులు రెండింటిలో దేనితో వుండాలో తేల్చుకోలేకపోయాయి. వాటికి ఆ క్షణంలో ఎవరేది మాట్లాడితే, దాని వాదన సబబనిపించేది.

చివరికి స్నోబాల్ ప్రణాళికలన్నీ సిద్ధమయ్యాయి. ఆ ఆదివారం గాలియంత్రం నిర్మించాలా వద్దా అన్న విషయం ఓటింగ్‌కు వచ్చింది. మొదట స్నోబాల్ లేచి, మధ్యమధ్యన గొర్రెలు యధావిధిగా తమ అరుపుల్తో అడ్డుపడుతున్నా గాలియంత్రం నిర్మాణం ఆవశ్యకతను వివరించింది. తర్వాత నెపోలియన్ లేచి ఈ గాలియంత్రమనేది శుద్ధ చెత్త వ్యవహారమనీ, ఎవరూ దానికి అనుకూలంగా ఓటేయవద్దనీ చెప్పి వెంటనే కూర్చుంది. అది మహా ఐతే ముప్పై క్షణాలు మాట్లాడిందంతే!

స్నోబాల్ లేచి, అడ్డు తగులుతున్న గొర్రెల అరుపులను లెక్కచేయకుండా తిరిగి ఆవేశంగా తన వాదనను మొదలుపెట్టింది. అప్పటివరకూ జంతువులన్నీ అటుఇటూ ఊగిసలాడుతున్నాయి. మరి కొంచెం సేపట్లో అవి స్నోబాల్ వాక్చాతుర్యానికి దాసోహమయ్యాయి. గాలియంత్రం నిర్మించబడ్డాక జంతుక్షేత్రం ఎలా వెలిగిపోయేది స్నోబాల్ వాటికొక ఊహాచిత్రం గీసి వూరించింది.

విద్యుత్తుతో పంట నూర్చవచ్చనీ, కలుపు తీయొచ్చనీ, విత్తులు నాటొచ్చనీ, పొలం దున్నొచ్చనీ... ప్రతి జంతువుకూ లైటు, వేణ్ణీళ్లు, చణ్ణీళ్లు ఉంటాయంది. దాని ప్రసంగం ముగిసేసరికి ఓటింగ్‌లో ఎవరు గెలిచేది స్పష్టంగా తెలిసిపోయింది.

అదే సమయంలో నెపోలియన్ స్నోబాల్ వైపు తీక్షణంగా చూసి, అంతవరకూ జంతువులెన్నడూ వినని ఓ వింత కేక పెట్టింది. ఆ కేక వినగానే తలుపు వెనకాల గుర్రుమనే భీకర శబ్దం వినిపించింది. మెడలో ఇత్తడి గొలుసులున్న

## కొత్తగాలి...

**అతడు**
**ఆమెను రక్షించాడు**
**అమ్మ అని కాదు**
**అమ్మాయి అని..**

– మెట్టా నాగేశ్వరరావు,
రాజమండ్రి

తొమ్మిది భారీ వేటకుక్కలు పరుగుల మీద వచ్చి సరాసరి స్నోబాల్ మీద పడ్డాయి. అయితే ఒక క్షణం ముందే స్నోబాల్ అక్కణ్నుంచి తప్పుకోవడంతో అది ఆ వేటకుక్కలకు చిక్కలేదు. జరగబోయే ప్రమాదం పసిగట్టి అది వాకిలి గుండా ఉడాయించింది. కుక్కలు దానివెనకాల పడ్డాయి.

జంతువులన్నీ ఈ తరుములాటను గుడ్లప్పగించి భయంగా చూడసాగాయి. స్నోబాల్ రహదారి వైపు దౌడు తీసింది. కుక్కలు దాన్ని వదిలి పెట్టలేదు.

# అసలు కారణం?




అమెరికాలో అధికంగా ఆత్మహత్యలు చేసుకునే ప్రదేశాల్లో శాన్‌ఫ్రాన్సిస్కో లోని గోల్డెన్ గేట్ బ్రిడ్జి ఒకటి. అక్కడికి అమెరికా నలుమూలల నుంచి ప్రజలు వస్తుంటారు. గత 74 ఏళ్లలో 1323 మంది అక్కడ ఆత్మహత్య చేసుకున్నారు. కింద రెండు వందల ఏభై అడుగుల లోతున ఉండే అతిశీతల పసిఫిక్ సముద్ర జలాలలోకి దూకితే ఇక బతికే అవకాశం ఉండదు. వంతెన రెయిలింగ్ ఎత్తు నాలుగడుగులే కాబట్టి దూకడానికి తేలిక. దీన్ని నిర్మించిన చీఫ్ ఇంజనీర్ ఎత్తు ఐదడుగులు. అందుకే దాన్ని నాలుగడుగుల ఎత్తుకే నిర్మించాడట. రెయిలింగ్ ఎత్తు పెంచి బ్యారియర్ అమర్చమన్న ప్రతిపాదనలు ప్రభుత్వానికి అందాయి. కానీ ప్రభుత్వం ఆ పని చేయలేదు. 'బ్యారియర్ అమర్చినా వారు వేరేచోట ఆత్మహత్య చేసుకోరన్న గ్యారంటీ ఏమిటి?' అనేది ప్రభుత్వ వాదన.



బ్యారియర్ నిర్మిస్తే పసిఫిక్ మహాసముద్రం అందాలను ఆస్వాదించేందుకు వచ్చే టూరిస్టుల రాబడి పడిపోతుందని ప్రభుత్వం ఆ పనికి పూనుకోవడం లేదనేది విమర్శ.

స్నోబాల్ దొరికినట్టే దొరికి వేగం పెంచింది. ఒక కుక్కకు స్నోబాల్ తోక దొరికి అంతలోనే జారిపోయింది. చివరకు స్నోబాల్ కొన్ని అంగుళాల తేడాతో కంచెలోని ఓ కంతలోకి దూరి మాయమైపోయింది.

వణుకుతున్న జంతువులన్నీ తిరిగి ధాన్యాగారంలోకి వచ్చాయి. ఈ కుక్కలెక్కడ్నుంచి వచ్చాయో వాటికి అర్థం కాలేదు. అయితే నెపోలియన్ ఇదివరకే కొన్ని కుక్కపిల్లలను తల్లుల నుంచి వేరుచేసి, అటకెక్కించి రహస్యంగా పెంచినవి అవేనని తొందరలోనే అర్థమయింది. ఆ కుక్కలు తోడేళ్లంత భయంకరంగా ఉన్నాయి. ఇంతకు మునుపు కుక్కలు జోన్స్ వెనకాల ఎలా తోకలూపేవో, ఇప్పుడవి అచ్చం అలాగే నెపోలియన్ వెనకాల తోకలూపుతున్నాయి!

కుక్కలు తన వెన్నంటి ఉండగా నెపోలియన్ ఎత్తుగా ఉన్న కట్టమీద కూర్చుంది. ఇకనుంచీ ఆదివారాలు జరిగే చర్చా కార్యక్రమాలన్నిటినీ రద్దు చేస్తున్నట్టు ప్రకటించింది. ఆ చర్చలు పనికి రానివనీ, ఒట్టి కాలహరణమనీ తేల్చింది. భవిష్యత్తులో క్షేత్రపు పనులన్నీ తన అధ్యక్షతన జరిగే ఓ పందుల కార్యవర్గం నిర్ణయిస్తుందని చెప్పింది. ఆ కార్యవర్గ సమావేశం రహస్యంగా జరుగుతుందనీ, దాని నిర్ణయాలు తర్వాత ప్రకటించబడతాయనీ అంది. ఆదివారం జంతువులన్నీ కలవడం, జెండా ఎగరేయడం, పాట పాడడం, ప్రతి జంతువుకూ రాబోయే వారంలో చేయాల్సిన పనులను వివరించడం.. ఇవన్నీ ఉంటాయి కానీ ఇకపై ఎలాంటి చర్చలూ

ఉండవు.

స్నోబాల్‌కు పట్టిన గతి చూసాక కూడా జంతువులకు ఈ ఆజ్ఞలు మింగుడు పడ లేదు. వాదించటం వచ్చి ఉంటే అవన్నీ దీనిని వ్యతిరేకించేవి. అయినా చివరికవి పల్లెత్తు మాట అనలేకపోయాయి. అయితే ముందు వరుసలో కూర్చున్న నాలుగు యువపందులు మాత్రం ఆవేశంగా లేచి దీనికంతటికీ తమ అభ్యంతరాన్ని కీసర బాసరగా తెలపబోయాయి. కానీ నెపోలి యన్ చుట్టూ ఉన్న కుక్కలు ఒక్కసారి గుర్‌మని కోరలు చూపగానే అవి నిశ్శబ్ద మయిపోయాయి.

స్క్వీలర్ అన్నిటికీ కొత్త పద్ధతుల గురించి వివరించడానికి నిలబడింది. 'కామ్రేడ్స్! నెపోలియన్ తన భుజస్కం ధాలపై వేసుకున్న ఈ నాయకత్వ భారాన్ని ప్రతి ఒక్కరూ ఆమోదిస్తారని విశ్వసిస్తాను. నాయకత్వం అంత సుఖమై నదనుకోకండి. అది చాలా బాధ్యతాయుత మైనది, కష్టమైనది. జంతువులన్నీ సమాన మని కామ్రేడ్ నెపోలియన్ నమ్మినంతగా మరెవ్వరూ నమ్మరు. మీ నిర్ణయాలు మీరు తీసుకోవడం సబబే. కానీ ఒక్కోసారి మీరు తప్పుడు నిర్ణయాలు తీసుకోవచ్చు. అప్పుడు మన గతేమిటి? ఉదాహరణకు స్నోబాల్ తలపెట్టిన గాలియంత్రం విషయం తీసుకుందాం. అదో పెద్ద మోసం. దాన్ని అనుకరిస్తే ఇంకేమైనా ఉందా? '

'కానీ జోన్స్‌తో పోరాటంలో స్నోబాల్ ధైర్యంగా పాల్గొంది...' ఏదో జంతువు గొణిగింది.

'ధైర్యం మాత్రమే సరిపోదు', స్క్వీలర్ తిప్పి కొట్టింది.

'విశ్వాసం, వినయం ముఖ్యం. ఆ పోరా టంలో స్నోబాల్ గోరంత పాత్ర ఎలా కొండంత చేయబడిందో మనం ఏదో ఒకరోజు తెలుసుకుంటాం. క్రమశిక్షణ కామ్రేడ్స్! ఉక్కులాంటి క్రమశిక్షణ.. అదీ ప్రస్తుతం కావలసింది. ఒక్క తప్పటడుగు చాలు, మన శత్రువు మనల్ని జయించడా నికి. మీలో ఎవరికైనా మళ్లీ జోన్స్ తిరిగి రావాలనుందా? '

ఈ వాదనకు తిరుగు లేకపోయింది. ఒకవేళ ఆదివారాలు జరిగే ఈ చర్చలు జోన్స్ తిరిగి రావడానికి దోహదపడితే.. ఈ చర్చలు లేకపోతే లేకపోయాయి!

ముందుగా తేరుకున్న బాక్సర్ 'నెపోలి యన్ చెప్పిందంటే అది సరైనదే అయ్యుం డాలి' అంది. అప్పట్నించీ 'నేనింకా ఎక్కువ కష్టపడతాను' అన్నదానికి తోడు, 'నెపోలి యన్ మాట ఎప్పుడూ సరి అయినదే' అనే మరో ఊత పదం తోడయ్యింది.

★ ★ ★

వసంతకాలం వచ్చింది. స్నోబాల్ గది మూసేయబడింది. గదిలోని చిత్రాలన్నీ తుడిచి వేయబడ్డాయని భావించాయన్నీ. ప్రతీ ఆదివారం ఉదయం జంతువులన్నీ ధాన్యాగారంలో చేరి తమ తమ విధులు తెలుసుకునేవి. మేజర్ పుర్రె తుపాకికి గుచ్చబడింది. జెండా ఎగరేసాక జంతువు లన్నీ ఆ పుర్రెకు గౌరవ వందనం సమ ర్పించి వెళ్లాలి. మునుపటిలా అన్నీ కూర్చుని పిచ్చాపాటి మాట్లాడుకోవడానికి వీల్లేదిపుడు. నెపోలియన్, స్క్వీలర్, మిని మస్ అనే మరో పంది (ఈ మినిమస్ పాటలు, పద్యాలు రాయడంలో దిట్ట), కుక్కలతో కలిసి ఎత్తుగా ఉన్న కట్టపై అర్ధ చంద్రాకారంలో కూర్చునేవి. వాటి వెనకాల మిగతా పందులు కూర్చునేవి. మిగిలిన జంతువులు, పక్షులు ఎదురుగా నేలపై కూర్చునేవి. ఆ వారంలో చేయాల్సిన పను లన్నీ నెపోలియన్ బిగ్గరగా చదివేది. తర్వాత అన్నీ కలిసి స్వేచ్ఛాగీతం పాడాక తమ తమ విధులు నిర్వర్తించడానికి వెళ్లి



పోయేవి.

స్నోబాల్ వెళ్లగొట్టబడి మూడువారాలు గడిచాక నెపోలియన్ తిరిగి గాలియంత్రం నిర్మించ తలపెట్టడం జంతువులన్నిటికీ ఆశ్చర్యం కలిగించింది. తనెందుకు మనసు మార్చుకుందో అది చెప్పలేదు కానీ ఆ యంత్ర నిర్మాణంలో ఎన్నో కష్టనష్టలున్నాయంది. బహుశా తమ తిండి కూడా కొంత తగ్గించుకోవాల్సి ఉంటుందని అంది. పందుల ప్రత్యేక కార్యవర్గం గత మూడు వారాలుగా ఆ ప్రణాళిక తయారీలో ఉంది. దాని నిర్మాణానికి దాదాపు రెండు సంవత్సరాల సమయం పట్టవచ్చని అంచనా వేశాయి.

ఆ సాయంత్రం స్క్వీలర్ మిగతా జంతువులతో.. 'నెపోలియన్ ఎన్నడూ గాలి యంత్రం నిర్మాణానికి వ్యతిరేకం కాదనీ, దానిని మొదట నిర్మించాలనుకున్నది నెపోలియనేననీ, స్నోబాల్ గదిలో నేల మీద గీసిన బొమ్మలన్నీ నెపోలియన్ దగ్గర్నుంచే దొంగలించబడ్డాయి' అని తెలిపింది.

మరైతే నెపోలియన్ ఎందుకు దాన్నంత వ్యతిరేకించింది?

అదీ నెపోలియన్ ఉపాయమేనంది స్క్వీలర్. స్నోబాల్ పీడ వదిలించుకోవడానికి మొదట నెపోలియన్ దానిని వ్యతిరేకిస్తున్నట్లు నటించింది. స్నోబాల్ దుర్గుణాల పుట్ట, ప్రమాదకారి. ఇప్పుడు దాని పీడ విరగడ కావడంతో పని ప్రారంభం కానుంది.

'దీనినే ఎత్తుకు పైఎత్తు అంటారు' స్క్వీలర్ విడమరచి చెప్పింది. జంతువులు ఈ వాదనతో పూర్తిగా ఏకీభవించకున్నా స్క్వీలర్ వెంటనున్న కుక్కలు గుర్రుమనేసరికి వాటి గొంతులోంచి ఏ ప్రశ్నా పెగల్లేదు.




**జం**తువులన్నీ బానిసల్లా శ్రమిస్తున్నాయి. కానీ ఆ శ్రమలో అవి ఆనందాన్ని అనుభవిస్తున్నాయి. ఆ శ్రమంతా తమ కోసం, తమ భవిష్యత్ తరాల కోసమేననీ, పని దొంగలైన మానవులకోసం కాదని భావించాయి.

ఆ వేసవి కాలమూ, వసంత కాలమూ అవన్నీ వారానికి అరవై గంటలు పనిచేశాయి. ఆగస్టులో ఆదివారం మధ్యాహ్నం కూడా పని ఉంటుందని ప్రకటించింది నెపోలియన్. అదీ కేవలం వాటికి ఇష్టమైతేనే! కానీ పని చేయనివాటికి తిండిలో కోత విధించబడింది!

ఇంత జరిగినా కొన్ని పనులు నిలిచిపోయాయి. పంట కూడా గత ఏడాది కంటే కాస్త తగ్గింది. భూమి దున్నడం ఆలస్యం కావడంతో క్యారెట్లు, ముల్లంగిలాంటివి విత్తనేలేదు. శీతాకాలం చాలా గడ్డుగా ఉండబోతోందని అర్థమయింది అన్నింటికీ.

గాలియంత్రం నిర్మాణం అనుకోని అవాంతరాలు తెచ్చిపెట్టింది. దానిక్కావాల్సిన ఇసుక, సిమెంటు, ఇనుము ఆ భవనంలోనే వున్నా, రాళ్లు పగలగొట్టడం మాత్రం వాటికో పెద్ద సమస్య అయింది. పారలు, గునపాలతో పనిచేయడం ఏ జంతువువల్లా కాలేదు. ఎందుకంటే- ఏ జంతువూ వెనుక కాళ్లపై నిలబడలేకపోయింది. చివరికి ఏ జంతువో భూమ్యాకర్షణ శక్తిని ఉపయోగించుకోవచ్చనే

## సభాధ్యక్షుడికే అల్టిమేటం!

భారత జాతీయకాంగ్రెస్ మహాసభల్లో భాగంగా అనంతపురంలో 1927లో ప్రాంతీయ స్థాయి ప్రత్యేక సమ్మేళనం జరిగింది. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ దానికి అధ్యక్షులు. ఎవరికీ అసంతృప్తి కలగకుండా ఆయన సభ నిర్వహించారు. ఆఖరున అధ్యక్షోపన్యాసం చేద్దామని లేచి నిలబడ్డారు.

అంతలోనే ఒక కాంగ్రెస్ పెద్ద లేచి, "అధ్యక్షులకు మనవి. సభ చక్కగా నిర్వహించారు. భోజనం వేళ సమీపించింది. సభాసదులు ఆకలితో ఉన్నారు. మరోలా భావించక త్వరగా ముగింపు పలకాలని మనవి" అన్నారు.



శర్మగారికి తీవ్రమైన ఆగ్రహం వచ్చింది. కానీ ప్రజల ముందు దాన్ని ప్రదర్శించక, "అయ్యా! సభికులకే కాదు. నాకూ ఆకలే. మీరెప్పుడు సూచిస్తే అప్పుడు ముగిస్తాను. ప్రస్తుతానికి నేను మీ అనుమతితో ప్రసంగాన్ని ప్రారంభిస్తాను" అన్నారు.

పావుగంట గడిచింది. ఆసీనులైన పెద్దలంతా శర్మగారి వాగ్ధాటిలో మైమరచిపోయారు. ఎవరూ ఎలాంటి సూచన ఇవ్వలేదు. పరిస్థితిని అంచనా వేసిన దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు, "ఉపన్యాసం బ్రహ్మాండంగా ఉంది. ఆపకుండా కొనసాగించు శర్మా" అన్నారు. అంతే. శర్మగారి వాగ్ఝరి అడ్డూఆపూ లేక రెండు గంటలు కొనసాగింది. సభికులంతా మంత్రముగ్ధులై విన్నారు. ఆయన వందన సమర్పణకు సంసిద్ధులయ్యారు. ఉపన్యాసం అంత త్వరగా ముగిసిందేమిటని సభాసదులు అనుకున్నారు. తర్వాతి రోజు పత్రికల్లో ఈ విషయమే ఉంది. మామూలు పత్రికలే కాక, ఆంధ్రపత్రిక, భారతిలాంటి సాహిత్య పత్రికలు సైతం ఈ విషయం చర్చించాయి. అంతే కాదు, ఆ ప్రసంగం పూర్తి పాఠాన్ని కూడా ప్రచురించాయి.



నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

ఉపాయం చెప్పింది.

పనికిరాని పెద్ద పెద్ద బండరాళ్లు చాలా ఉన్నాయా క్షేత్రంలో. వాటికి తాళ్లు కట్టి గుర్రాలు, ఆవులు, గొర్రెలు, అవసరమైతే పందులు- అన్నీ కలిసి అతి కష్టమ్మీద ఓ శిఖరం మీదకు లాక్కెళ్లి, అక్కడ్నుంచి ఆ బండరాయిని కిందకి దొర్లించేవి. ఈ బండరాయి ముక్కలయ్యాక ఆ రాతి ముక్కలు నిర్మాణ స్థలానికి తరలించబడేవి. వేసవి చివర్లో తగినంత రాయి సమకూరాక గాలి యంత్ర నిర్మాణం మొదలైంది.

కానీ ఆ పని చాలా నెమ్మదిగా, శ్రమదాయకంగా సాగింది. ఒక్కో బండ రాయిని శిఖరం మీదకు తీసుకెళ్లడానికే ఒక రోజంతా పట్టేది. తీరా దొర్లించాక ఒక్కోసారి అది ముక్కలయ్యేది కాదు. నిజానికి బాక్సర్ లేకుంటే ఆ పనిముందుకు నడిచేదే కాదు. మిగతా జంతువులన్నీ కలిసి ఎంత పని చేసేవో, బాక్సర్ ఒక్కటే దానికి సమానమైన పని చేసేది. బండరాయిని పైకి లాగేటప్పుడు పొరపాటున అది కిందకు జారడం మొదలుపెట్టగానే మిగతా జంతువులు ఆ రాయిని వదిలేసేవి. బాక్సర్ ఒక్కటే తన బలమంతా ఉపయోగించి ఆ రాయిని ఆపేది. ఊపిరి బిగబట్టి, చెమటలు కారుతుండగా, కండరాలు సంచలిస్తుండగా అది ఆ రాయిని ఒక్కో అంగుళం పైకి లాగడాన్ని జంతువులన్నీ ఆరాధనా పూర్వకంగా చూసేవి.

క్లోవర్ అప్పుడప్పుడూ బాక్సర్‌ను అతిగా శ్రమించవద్దనీ మందలించేది. కానీ బాక్సర్ దాని మాటలు పట్టించుకునేది కాదు. 'నేనింకా ఎక్కువ కష్టపడతాను', 'నెపోలియన్ మాట ఎప్పుడూ సరయినదే' అనే తన రెండు నినాదాలు అన్ని సమస్య



లకూ పరిష్కారంగా భావించేది.

వేసవిలో సమస్యలు పెరిగిపోయాయి. దీపాలు వెలిగించే నూనె, మేకులు, తాళ్లు, గుర్రపు నాడాలు- వీటిని జంతువులు తయారు చేసుకోలేకపోయాయి. అంతేకాకుండా వాటికి - విత్తనాలు, ఎరువులు, గాలియంత్రం సామాగ్రి కూడా అవసరమయ్యాయి

ఓ ఆదివారం జంతువులు తమ పనుల గురించిన ఆజ్ఞల కోసం వేచి వుండగా నెపోలియన్ తానో కొత్త విధానాన్ని అమలు చేయబోతున్నట్టు ప్రకటించింది. ఇక నుంచీ జంతుక్షేత్రం చుట్టుపక్కల క్షేత్రాలతో వ్యాపారం చేస్తుంది! అయితే లాభాపేక్షతో కాదు, కేవలం తమకు కావలసిన కొన్ని అత్యవసర వస్తువులను సమకూర్చుకునేందుకు మాత్రమే. గాలియంత్ర నిర్మాణం అత్యవసరమనీ, దానికోసం కొన్ని సర్దుబాట్లు తప్పవనీ అంది. కనుక ఎండు గడ్డిలో కొంత, గోధుమ పంటలో కొంత, ఇంకా అవసరమైతే కోడిగుడ్లనూ అమ్మడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. గాలియంత్ర నిర్మాణంలో ఇది తమకు లభించిన సదవకాశంగా భావించి కోళ్లు తమ వంతు త్యాగానికి సిద్ధపడాలని నెపోలియన్ పిలుపునిచ్చింది.

మరోసారి జంతువులన్నీ అసంతృప్తికి లోనయ్యాయి. 'మానవులతో సంబంధాలు పెట్టుకోరాదు, వ్యాపారం చేయరాదు, డబ్బుని ఉపయోగించరాదు' జోన్స్‌ని తరిమేసాక తాము ఈ నిర్ణయాలన్నీ తీసుకోలేదా!

నెపోలియన్ సమావేశాలను రద్దు చేసినపుడు వ్యతిరేకించిన నాలుగు పందులూ చిన్నగా గొణిగాయి. కానీ నెపోలియన్ పెంపుడు కుక్కలు గుర్రుమనే సరికి అవి నిశ్శబ్దమయిపోయాయి. తర్వాత మామూలుగా గొర్రెలు 'నాలుగు కాళ్లవి మంచివి, రెండు కాళ్లవి చెడ్డవి' అనే పల్లవి ఎత్తుకోగానే అప్పటి వరకూ అలుముకున్న ఇబ్బందికర వాతావరణం తొలగిపోయింది.

చివరికి నెపోలియన్ వ్యాపారానికి అన్ని ఏర్పాట్లు సిద్ధమయ్యాయి. జంతువులు మానవులతో కలిసే అవసరం లేదు. అది ఆవశ్యకం కూడా కాదు. ఈ భారం అంతా తానొక్కటే మోయదలచుకుంది. విల్లింగ్‌డన్‌లో నివసించే 'వింఫర్' అనే వకీలు తమకూ, బయటి ప్రపంచానికీ మధ్యవర్తిగా ఉంటాడు. ఈ వ్యవహారాలు నడపడానికి అతను ప్రతి సోమవారం క్షేత్రానికి వస్తాడు.

నెపోలియన్ తన ప్రసంగాన్ని 'జంతు క్షేత్రం వర్ధిల్లాలి' తో ముగించింది. జంతువులన్నీ స్వేచ్ఛాగీతం ఆలపించాక విడిపోయాయి.

తర్వాత స్క్వీలర్ క్షేత్రం చుట్టూ తిరిగి జంతువులతో మాట్లాడి వాటి ఆందోళనను ఉపశమింపజేసింది. వ్యాపారం చేయరాదనీ, డబ్బును ఉపయోగించరాదనీ.. తామెన్నడూ తీర్మానించలేదంది. అసలా విషయమే చర్చకు రాలేదు! బహుశా అది స్నోబాల్ ఆడిన అబద్ధాలలో ఒకటి కావచ్చు అని బుకాయించింది. అప్పటికీ కొన్ని జంతువులు నసిగాయి.

స్క్వీలర్ వాటితో 'అలాంటి నిర్ణయం తీసుకున్నామని ఎక్కడైనా రాతపూర్వకంగా ఉందా?' అని దబాయించింది. అలాంటిదేమీ లేకపోవడంతో జంతువులు తామే పొరబడ్డామని తృప్తి చెందాయి.

చెప్పినట్లుగానే వింఫర్ ప్రతీ సోమవారం క్షేత్రానికి రావడం ప్రారంభించాడు. అతను సన్నగా, పీలగా ఉండే ఓ కపట వకీలు. జంతువుల క్షేత్రానికి ఓ మధ్యవర్తి అవసరం వస్తుందనీ, అందులో తనకు లాభాలు దండిగానే ముడతాయనీ అందరి కంటే ముందే గ్రహించినవాడు.

వింఫర్ అంటే జంతువులన్నిటికీ భయం. అవన్నీ అతన్ని తప్పించుకుని తిరిగేవి. అయినా నాలుగు కాళ్లమీద నిల బడే నెపోలియన్ రెండు కాళ్ల మీద నిలబడే వింఫర్‌కు ఆజ్ఞలు జారీ చేయడం వాటికి గర్వంగా అనిపించి వాటి ఆందో ళన తగ్గింది.

జంతుక్షేత్రం వృద్ధి చెందడం మనుషుల అసూయను, బాధను రెట్టింపు చేసింది. తొందర్లోనే జంతుక్షేత్రం దివాలా తీస్తుం దనీ, గాలియంత్రం మట్టి కొట్టుకుపోతుం దనీ ప్రతి మనిషీ మనుసులో శాపనార్థాలు పెట్టుకున్నా ఆ క్షేత్రాన్ని జంతువులు నిర్వ హిస్తున్న తీరును మాత్రం గౌరవించలే కుండా ఉండలేకపోయారు. దానికి రుజువు వాళ్లిపుడు దానిని మేనర్ క్షేత్రం అని కాకుండా జంతుక్షేత్రం అని పిలవ డమే!

జోన్స్ తన పూర్వ క్షేత్రంపై ఆశలు వదులుకుని దూరాన వేరే గ్రామంలో నివాసం ఏర్పరచుకున్నాడు. నెపోలియన్ తొందర్లోనే పించ్‌ఫీల్డ్‌కు చెందిన ఫ్రెడ రిక్‌తో గానీ, ఫాక్స్‌వుడ్‌కు చెందిన పిల్కిం గ్‌టన్‌తోగానీ వ్యాపార సంబంధాలు పెట్టు కోబోతుందనే పుకారు బయలుదేరింది.

అదే సమయంలో పందులన్నీ తమ నివాసాన్ని భవంతిలోకి మార్చాయి. జంతువులన్నీ మళ్లీ తాము దీనిని అప్పుడు వ్యతిరేకించామని గుర్తు చేసుకున్నాయి గానీ.. స్క్వీలర్ మళ్లీ అలాంటిదేమీ జరగ లేదని నమ్మబలికింది. జంతు క్షేత్రానికి గుండెకాయల్లాంటి పందులు తమ పనులు చూసుకోవడానికి ఓ ప్రశాంతమైన ప్రదేశం అవసరం ఎంతైనా ఉందంది. అదీగాక నాయకుడు (ఈ మధ్య స్క్వీలర్ నెపోలి యన్‌ను 'నాయకా' అని సంబోధిస్తోంది) తన హోదాకు తగినట్టు, పందుల కొట్టంలోకన్నా భవంతిలో ఉంటేనే హుందాగా ఉంటుందంది.

పందులు బల్లలపై భోంచేస్తున్నాయనీ, పరుపులపై పవళిస్తున్నాయనీ తెలిసి జంతువులు మళ్లీ ఆందోళన చెందాయి. బాక్సర్ మామూలుగానే నెపోలియన్‌ను సమర్థించింది. కానీ క్లోవర్ ఈ పవళింపు లకు వ్యతిరేకంగా గోడమీద రాతలు గుర్తు తెచ్చుకుని, గోడ దగ్గరకు వెళ్లి చదవాలని ప్రయత్నించింది. అయితే వాటిని పూర్తిగా తను చదవలేక మురియల్ సాయం కోరింది.

'మురియల్! ఆ నాలుగో శాసనాన్ని చదువు. పరుపులపై పడుకోరాదని అదే మైనా చెబుతోందా?'

మురియల్ కూడా కొంత కష్టపడి చివ రికి, 'ఏ జంతువూ దుప్పటి ఉన్న పరుపు లపై నిద్రించరాదు'.. అని చదివింది. క్లోవ ర్‌కు ఆ శాసనంలో దుప్పటి ప్రసక్తి లేనట్టు గుర్తు. అయినా గోడమీద ఉంది గనుక అలాగే అయి ఉండాలి.

అదే సమయంలో అటుగా వెళ్తున్న స్క్వీలర్ దీనిని మరింత వివరించింది. 'అయితే కామ్రేడ్స్! మేం పరుపుల మీద పడుకుంటే తప్పేమిటి? పరుపులకు మన మెన్నడూ వ్యతిరేకం కాదే? పరుపంటే కేవలం మనం విశ్రమించే ఓ ప్రదేశం. బాగా ఆలోచిస్తే మన కొట్టంలో పరిచిన

## కొత్తగాలి...

**చినుకు**
**వరదవుతోంది**
**పరీక్ష**
**యుద్ధమవుతోంది**

**- ఆపిల్ దూని,**
బెంగళూరు

గడ్డి కూడా పరుపు కాదూ! మన శాసనం దుప్పట్లకు వ్యతిరేకం. అవి మానవుని సృష్టి, మేము ఆ దుప్పట్లను తొలగించి కంబళ్లను వాడుతున్నాం. మా మేధోశ్రమకు అవి తగినంత సౌకర్యంగా లేవనుకోండి.. అయినా మా విశ్రాంతిని మీరు పాడు చెయ్యరు కదా! మేం అలసిపోవడం మీకు ఇష్టం లేదు కదా! ఇక్కడెవరికైనా మళ్లీ జోన్స్ తిరిగి రావడం ఇష్టముందా? '

జంతువులిక నోరెత్తలేదు.

ఆ తర్వాత ఎక్కడా పందులు పరుపులు మీద పడుకోవడం గురించి చర్చ జరగలేదు. కొద్ది రోజులకు పందులు మిగతా జంతువుల కన్నా గంట ఆలస్యంగా లేస్తాయన్నా ఏ అభ్యంతరమూ వ్యక్తం కాలేదు.

శరదృతువు వచ్చేసరికి జంతువులన్నీ అలసిపోయినా సంతోషంగానే ఉన్నాయి. ఆ ఏడాది గడ్డి, గింజల్లో కొంతభాగం అమ్మడంవల్ల తిండి కొరత ఏర్పడినా గాలి యంత్రం నిర్మాణం వాటికి ఊరటనిచ్చింది. అది దాదాపు సగభాగం పూర్తయింది. కోతల తర్వాత వాతావరణం ఉత్సాహభరితంగా ఉండటంతో జంతువులు మరింత శ్రమించసాగాయి. ఇక బాక్సర్ ఆ వెన్నెల రాత్రుల్లో తనకైతాను వచ్చి గంటో, రెండు గంటలో ఎక్కువ పని చేసేది.

విశ్రాంతి సమయాల్లో జంతువులు ఆ నిర్మాణం చుట్టూ కలయతిరుగుతూ దాని ధృఢత్వాన్ని, నిట్టనిలువు గోడల్ని చూస్తూ - అది తాము నిర్మించిందేనా? అని ఆశ్చర్యపోయేవి. ఒక్క బెంజిమన్ మాత్రం ఏ భావమూ కనబరచలేదు. అది నర్మగర్భంగా, 'గాడిదలు చాలా కాలం జీవిస్తాయ్', అని మాత్రం వ్యాఖ్యానించింది.

నవంబరులో పెనుగాలులు వీచాయి. సిమెంటు తడిగా ఉండటం వల్ల నిర్మాణాన్ని ఆపాల్సివచ్చింది. ఒకానొక రాత్రి గాలి ఎంత తీవ్రంగా వీచిందంటే - భవనాలు వూగిపోయాయి, పెంకులెగిరిపోయాయి, దూరాన తుపాకీ మోతలా వినిపించిన శబ్దానికి కోళ్లన్నీ కకావికలై కేకలు పెట్టాయి. ఉదయాన లేచిన జంతువులు కూలిన జెండాస్తంభాన్ని, వేర్లతో సహా లేచి కూలిపోయిన ఓ చెట్టును చూశాయి. దూరాన మరో దృశ్యాన్ని చూసిన జంతువుల గొంతుల్లోంచి ఓ పెనుకేక వెలువడింది. గాలియంత్రం కట్టడమంతా దిబ్బలా కుప్పకూలిపోయింది!

అన్నీ గుండెలు బాదుకుంటూ దానివద్దకు పరుగు తీసాయి. ఎన్నడో కానీ నడవని నెపోలియన్ అన్నిటికన్నా ముందు పరిగెత్తింది. అక్కడ వాటి శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరులా కుప్పలా మిగిలింది. అవి ఎంతో కష్టపడి లాక్కొచ్చిన రాళ్లు నేల మట్టమయ్యాయి.

## ఎక్కడికీ పారిపోదులెండీ!

1958లో నెహ్రూ అంబాలాలోని సర్క్యూట్ క్లబ్‌ను సందర్శించారు. డిన్నర్‌పార్టీలో టేబుల్‌పైన వంటకాలన్నీ సెల్ఫ్‌సర్వీసుకు సిద్ధంగా ఉంచారు. అక్కడున్న ఓ అధికారి ముఖ్య అతిథిగా హాజరైన నెహ్రూను గమనించకుండానే ఓ ప్లేటులో పెద్ద చికెన్ ముక్కను వేసుకుని గబగబా తింటున్నాడు. అతడి వెనుకే నిలబడి ఇదంతా గమనిస్తున్న నెహ్రూ నవ్వుతూ అతడి భుజంతడుతూ, 'నెమ్మదిగా తినండి. ఆ కోడి చనిపోయింది. ఎక్కడికీ పారిపోదులెండి' అన్నారు. అక్కడున్నవారంతా ఫక్కుమన్నారు.



నోట మాట రాని జంతువులన్నీ దిబ్బలా మారిన ఆ రాతి కుప్ప చుట్టూ విచార వదనాలతో నిలబడ్డాయి. ముందుకూ, వెనక్కీ కదులుతున్న నెపోలియన్ అప్పుడప్పుడూ నేలను మూ చూస్తోంది. దాని తోక అటూ ఇటూ గబ గబా కదులుతూ, దాని మనసులో రేగుతున్న అలజడిని తెలుపుతోంది. అకస్మాత్తుగా, ఓ నిర్ణయానికి వచ్చిన దానికి మల్లే అది తలెత్తింది.

'కామ్రేడ్స్! దీనంతటికీ కారణమెవరో తెలుసా? రాత్రికి రాత్రే ఈ నిర్మాణాన్ని నేలమట్టం చేసిందెవరో తెలుసా? స్నోబాల్!' దాని గొంతు పెద్దదయింది. 'ఈ పని చేసింది స్నోబాలే. దానిని మనం అవమానించి తరిమేశామనే ఆక్రోశంతో అది ఈ దారుణానికి ఒడిగట్టింది. నేను స్నోబాల్‌కు మరణ శాసనం ప్రకటిస్తున్నాను. దాన్ని చంపిన జంతువుకు వీరాధి వీర బిరుదు ప్రదానం చేస్తాం.'

జంతువులు ఇది స్నోబాల్ పనే అని నమ్మలేకపోయాయి. కొన్ని జంతువులు కోపంతో బుసలు కొట్టాయి. కొన్ని అప్పుడే స్నోబాల్‌ను ఎలా పట్టుకోవాలా అని పథకాలు వేయసాగాయి. అక్కడికి దగ్గర్లో ఉన్న గడ్డిపై కొన్ని పాదముద్రలు కనిపించి, ఓ గుట్టపై మాయమయ్యాయి. నెపోలియన్ ఆ పాదముద్రలను మూ చూచి, అవి స్నోబాల్‌వేనని తేల్చింది. స్నోబాల్ బహుశా ఫాక్స్‌వుడ్ క్షేత్రం నుంచి వచ్చి వుండొచ్చు!

'ఇక ఆలస్యం తగదు కామ్రేడ్స్? చేయాల్సిన పని చాలా ఉంది. రేపు ఉదయాన్నుంచే మనం పునర్నిర్మాణం ప్రారంభిద్దాం. మన పట్టుదలను నీరుగార్చడం అంత సులభం కాదని ఆ దుష్ట జంతువుకు తెలియజేద్దాం. మన పథకంలో ఏ మాత్రం మార్పు ఉండదు. కామ్రేడ్స్! రండి ముందుకు. గాలి యంత్రం నిర్మాణం ఆగదుగాక ఆగదు. జంతువుల ఐక్యత వర్ధిల్లాలి. జంతుక్షేత్రం వర్ధిల్లాలి' నెపోలియన్ తన ముందు కాలెత్తి జైకొట్టింది.




చలికాలం జంతువులు దారుణమైన బాధలు పడ్డాయి. పెనుగాలులు, ఆ తర్వాత వడగళ్ల వానలు, ఆ తర్వాత మంచు. జంతువులు పళ్ల బిగువున పనిచేస్తూనే ఉన్నాయి. వాటికి తెలుసు- ప్రపంచమంతా తమని గమనిస్తోందని. గాలి యంత్రం సకాలంలో పూర్తి కాకపోతే మానవులంతా ఎగిరి గంతేస్తారని కూడా తెలుసు వాటికి.

ముందు జాగ్రత్తగా ఈసారి జంతువులు గోడను పద్దెనిమిది అంగుళాల మందంలో కాకుండా మూడు అడుగుల మందంతో నిర్మించాలని తీర్మానించాయి. అంటే మరింత రాయిని సేకరించాలన్న మాట!

చాలా రోజుల పాటూ వాళ్ల పనిని మంచు సాగనివ్వలేదు. వాతావరణం కొద్దిగా పొడిగా మారాక పని మొదలైంది. కానీ అది నత్తనడకన సాగుతోంది. జంతువుల్లో కూడా పూర్వపు ఉత్సాహం లేదు. అవి ఎల్లప్పుడూ చలికి వణకుతుండేవి. దానికితోడు కడుపులో ఆకలి.

బాక్సర్, క్లోవర్‌లు మాత్రం ధైర్యం కోల్పోలేదు. స్క్వీలర్ పనిచేయడంలోని

ఆనందం గురించి ఉపన్యాసాలిచ్చేది. కానీ దానికన్నా జంతువులకు బాక్సర్ శక్తీ, 'నేనింకా ఎక్కువ కష్టపడతాను' అనే ఊత పదమే ఉత్సాహాన్నిచ్చేది.

రాన్రానూ తిండి తగ్గిపోసాగింది. మొక్కజొన్న దిగుబడి తగ్గిపోవడంతో వాటికి బదులుగా బంగాళదుంపలు పంపకం చేస్తామని తెలుపబడింది. ఐతే ఆ దుంప పంట మంచులోనే వదిలేయడం వల్ల అవి మెత్తబడిపోయాయి. వాటిలో కొన్ని మాత్రమే తినదగ్గవి. జంతువులకు రోజుల తరబడి తవుడు, పొట్టు తప్ప వేరే తిండి లేకుండా పోయింది. కరువు వాటి ముంగిట్లో వాలింది.

అయితే ఇదంతా బయటి ప్రపంచానికి తెలియకూడదు కదా! గాలియంత్ర నిర్మాణం కూలినప్పట్నుంచీ మనుషులు రకరకాల పుకార్లు లేవదీస్తున్నారు. జంతువులు కరువుతో, వ్యాధులతో చచ్చిపోతున్నాయన్నారు. ఒకదానితో ఒకటి పోట్లాడుకుంటున్నాయనీ, వాటి పిల్లలను అవే పురిట్లో చంపుకు తింటున్నాయనీ చెప్పుకుంటున్నారు.

తిండి గురించి నిజాలు బయటి ప్రపంచానికి తెలిస్తే ప్రమాదకరమని భావించిన నెపోలియన్, వింఫర్ ద్వారా దానికి వ్యతిరేక ప్రచారం చేయాలని నిశ్చయించింది. కొన్ని జంతువులు వింఫర్‌కు వినబడేలా, కాకతాళీయంగా తిండి గింజల ఉత్పత్తి చాలా అభివృద్ధి అయిందని మాట్లాడుకునేవి. ఖాళీ డబ్బాల నిండా ఇసుక నింపి, దానిపైన దాణాను, తిండి గింజలను పోసి అది వింఫర్ కంటపడేలా చేసేవి.

అలా అతణ్ని మోసంచేసి బయటి ప్రపంచానికి తాము ఏ లోటు లేకుండా గడుపుతున్నామని అతని ద్వారా తెలిపేవి.

అయినా జనవరికంతా ఎలాగైనా తిండి సంపాదించాల్సిన అవసరం ఏర్పడింది. నెపోలియన్ ఇప్పుడు ఇదివరకులా బయట కనిపించడం లేదు. ఎప్పుడూ భవంతి లోనే ఉంటోంది. భవంతి ఒక్కో వాకిలి వద్దా ఒక్కో భీకరమైన కుక్క కాపలా వుంటోంది. ఒకవేళ అది బయటకు వచ్చినా కుక్కలు వెంట రాగా అట్టహాసంగా వచ్చేది. ఏ జంతువైనా దాని దగ్గరకు వస్తే కుక్కలు గుర్రుమనేవి. ఈ మధ్య అది ఆదివారాలు కూడా బయటకు రావడం మాని, తన ఆజ్ఞలను స్క్వీలర్ ద్వారా జారీ చేస్తోంది. ఓ ఆదివారం గుడ్లు పొదగడానికి వచ్చిన కోళ్లతో స్క్వీలర్ ఆ గుడ్లన్నీ తనకప్పగించాలని కోరింది. నెపోలియన్ వింఫర్‌తో నాలుగు వందల గుడ్లను సరఫరా చేస్తానని ఒప్పందం చేసుకుందట. ఆ గుడ్లు అమ్మగా వచ్చిన డబ్బు కోళ్ల తిండికోసమే ఖర్చుపెట్టడం జరుగుతుందని చెప్పింది.

ఇది వినగానే కోళ్లన్నీ హాహాకారాలు చేసాయి. తమ నుంచి త్యాగాలు కోరతామని నెపోలియన్ ముందుగానే చెప్పి ఉన్నా అది నిజంగా జరుగుతుందని ఊహించలేదవి. అవి అప్పుడే గుడ్లు పొదగడానికి సిద్ధపడుతున్నాయి. ఇప్పుడది భ్రూణ హత్యతో సమానం!

జోన్స్‌ను తరిమేసాక అక్కడ మొదటిసారి తిరుగుబాటులాంటిది తలెత్తింది.

### కొత్తగాలి...

లేనివాడికి
పొట్ట నిండక బాధ
ఉన్నవాడికి
పొట్ట తగ్గక బాధ

– ధరణికోట శివరాంప్రసాద్,
హైదరాబాద్

మూడు యువకోళ్లు నెపోలియన్ ఆజ్ఞలను ధిక్కరించాలని నిశ్చయించాయి. భవంతి దూలాల పైకెక్కి అక్కడ గుడ్లు పెట్టాలని నిర్ణయించుకున్నాయి. అక్కడ్నించి పడి ఆ గుడ్లు చితికిపోవాలని వాటి కోరిక!

తిరుగుబాటు చేసే కోళ్లకు తిండి పెట్టడం నిలిపివేయాలనీ, ఏ జంతువైనా వాటికి ఒక్క గింజ పెట్టినా మరణశిక్ష తప్పదనీ నెపోలియన్ పాశవికంగా ప్రకటించింది. ఆ శిక్షను అమలు చేయడానికి కుక్కలు సిద్ధంగా ఉంచబడ్డాయి.

అయిదు రోజుల పాటూ కోళ్లు దీన్ని ప్రతిఘటించాయి కానీ చివరికవి దిగిరాక తప్పలేదు. ఈ మధ్యలో తొమ్మిది కోళ్లు చచ్చిపోయాయి. వాటి కళేబరాలు పళ్ల తోటలో పూడ్చివేయబడ్డాయి. అప్పట్నించీ వారానికోసారి వింఫర్‌కు చెందిన జీపొకటి వచ్చి గుడ్లను తీసుకుపోసాగింది.

ఈ మధ్యకాలంలో స్నోబాల్ గురించి సమాచారం ఏమీ లేదు. అది బహుశా ఇరుగూపొరుగున ఉన్న పింఛ్‌ఫీల్డ్ లేదా ఫాక్స్‌వుడ్ క్షేత్రాలలో ఆశ్రయం పొంది ఉండొచ్చని ఓ పుకారు వచ్చింది. అప్పటికి చుట్టుపక్కల రైతులతో నెపోలియన్ సంబంధాలు మెరుగుపడ్డాయి.

జంతుక్షేత్రం పెరట్లో పదేళ్ల కాలంనాటి దుంగలు ఉన్నాయి. వాటిని అమ్మేయమని వింఫర్ నెపోలియన్‌కు సలహా ఇచ్చాడు. పిల్కింగ్‌టన్, ఫ్రెడరిక్ - ఇద్దరూ ఆ దుంగలను కొనడానికి సిద్ధంగా ఉన్నారన్నాడు. వాటిని ఎవరికి అమ్మాలా అని నెపోలియన్ తర్జనభర్జన పడింది. అది ఫ్రెడరిక్‌తో ఒప్పందం చేసుకుందామనుకునేసరికి స్నోబాల్ ఫాక్స్‌వుడ్ క్షేత్రంలో దాగిందని వినిపించేది. పిల్కింగ్‌టన్‌తో ఒప్పందం చేసుకుందామనేసరికి స్నోబాల్ ఫించ్‌ఫీల్డ్‌లో ఉందని తెలిసేది.

ఈలోపు ఒక ఆందోళనకరమైన వార్త తెలిసింది- స్నోబాల్ రాత్రిళ్లు రహస్యంగా క్షేత్రంలో సంచరిస్తోందని! జంతువులన్నీ ఎంత కలవరపడ్డాయంటే- వాటికి ప్రశాంతతే కరువయింది. ప్రతీ రాత్రి స్నోబాల్ చీకటి మాటున ఎన్నో అల్లరి పనులు చేస్తోందట. గుడ్లను పగలగొడుతోంది. పాలను నేలపాలు చేస్తోంది. మొక్కలన్నీ పీకేస్తోంది.

ఎక్కడ ఏ నష్టం జరిగినా అది స్నోబాల్‌కు అంటగట్టడం సర్వసాధారణమైంది. ఏ కిటికీ విరిగినా, ఏ కాలువలో నీళ్లు ఆగిపోయినా.. అది స్నోబాల్ పనేనని తేల్చేవి. సామాన్ల గది తాళం పోయినప్పుడు దాన్ని కచ్చితంగా స్నోబాలే బావిలోకి విసిరి ఉంటుందన్నాయి. విచిత్రంగా ఆ తాళం దొరికిన తర్వాత కూడా ఆ పుకార్లు అలాగే కొనసాగాయి. స్నోబాల్ రాత్రిళ్లు తాము నిద్రలో ఉండగా వచ్చి, తమ పొదుగుల్లోని పాలు తాగిందని ఆవులు ఆరోపించాయి. అప్పుడప్పుడూ సమస్యలు సృష్టించే ఎలుకలు కూడా స్నోబాల్ జతకట్టాయనేది మరో ఆరోపణ.

స్నోబాల్ దురాగతాలపై పూర్తి విచారణ జరగాలని నెపోలియన్ ఆదేశించింది. కుక్కలు వెంటరాగా అది క్షేత్రం చుట్టూ తిరిగింది. జంతువులన్నీ నెపోలియన్ పట్ల

> **కొత్తగాలి...**
>
> **మాయదారి రోగాలు...**
> **మనుషులకే కాదు**
> **యంత్రాలకూ వచ్చాయి**
> **వైరస్ జ్వరాలు**
>
> – నెల్లుట్ల సుదర్శనరావు,
> ఆస్టిన్ (యు.ఎస్.ఎ.)

మర్యాదతో అల్లంత దూరాన దాన్ని అనుసరించాయి. నెపోలియన్ ప్రతి నాలుగు అడుగులకో మారు ఆగి స్నోబాల్ అడుగుల కోసం భూమిని వాసన చూసేది. అలా ధాన్యాగారంలోనూ, కోళ్ల గూళ్ల లోనూ, ఆవుల పాకలోనూ, కూరగాయల దొడ్లోనూ.. అన్నింటినీ వాసన చూసి అక్కడంతా స్నోబాల్ సంచరించినట్టు నిర్ధారించిది.

అది తన ముట్టెను భూమికి ఆన్చి, నాలుగైదు సార్లు దీర్ఘంగా గాలి పీల్చి పెద్ద గొంతుకతో 'ఇక్కడ స్నోబాల్ తిరిగింది. ఇదిగో దాని వాసన' అనేది. స్నోబాల్ పేరు వినగానే కుక్కలు పెద్దగా మొరిగి తమ కోరలు బయటపెట్టేవి.

ఇదంతా చూస్తున్న జంతువులు ఠారెత్తిపోయాయి. స్నోబాల్ ఓ దెయ్యంలా మారి అక్కడి వాతావరణాన్ని ఆవహించి, తమను అన్ని ఇక్కట్లకూ గురి చేస్తోందని అవి శాపనార్థాలు పెట్టాయి.

ఆ సాయంత్రం స్క్వీలర్ అన్నిటినీ పోగేసి, మొహం గంభీరంగా పెట్టి, ఓ ముఖ్యమైన విషయాన్ని చెప్పాలంది. 'సహచరులారా! ఓ భయంకరమైన నిజం బయటపడింది. స్నోబాల్ పింఛ్‌ఫీల్డ్‌కు చెందిన ఫ్రెడరిక్‌కు అమ్ముడుపోయింది. ఫ్రెడరిక్ ఇప్పుడు మనమీద దాడిచేసి మన క్షేత్రాన్ని లాక్కోవాలని పథకం వేస్తున్నాడు. మనమీద దాడి ప్రారంభం కాగానే స్నోబాల్ అతనికి మన గుట్టుమట్లన్నీ చెబుతుంది. నిజానికి స్నోబాల్ మొదటి నుంచీ జోన్స్ పక్షమే. దానిని ధృవపరిచే పత్రాలు మనకిప్పుడే దొరికాయి. పశువుల పాక సమరంలో మనం ఓడిపోవాలని అదెంత ప్రయత్నించిందో మనకు గుర్తే కదా!'

జంతువులు నివ్వెరపోయాయి. కొన్ని నిమిషాలపాటూ అవి ఈ వార్తను జీర్ణించుకోలేకపోయాయి. ఆ రోజు స్నోబాల్ ఎలా తెగబడి పోరాడిందీ, ముందుండి అన్ని జంతువులనూ ఎలా ఉత్సాహపరచిందీ వాటికింకా గుర్తే! జోన్స్ తూటాలు తనను గాయపరిచినా అది భయపడలేదు. ఇదంతా గుర్తు తెచ్చుకుని అవి స్నోబాల్ జోన్స్ పక్షమంటే నమ్మలేకపోయాయి.

ఏ ప్రశ్నలూ అడగని బాక్సర్ కూడా కొంత గందరగోళపడింది. 'నేనిది నమ్మలేను. ఆ రోజు స్నోబాల్ ధైర్యంగా పోరాడడం నా కళ్లతో చూసాను. ఆ పోరాటం తర్వాత మనం తనకు వీరమార్తాండ బిరుదు కూడా ప్రసాదించాం!'

'అక్కడే మనం పొరబడ్డాం కామ్రేడ్స్! నిజానికది ఆ రోజు మన పరాజయానికి తన శాయశక్తులా కృషి చేసింది. ఇప్పుడు బయటపడిన పత్రాలు అదే విషయాన్ని తేటతెల్లం చేస్తున్నాయి' స్క్వీలర్ పట్టు వదల్లేదు.

'కానీ ఆ రోజు స్నోబాల్ గాయపడింది. తన రక్తం కూడా చిందించింది' బాక్సర్ ఇంకా మొండిగా అంది.

'అదంతా నాటకం' స్క్వీలర్ అరిచింది. 'జోన్స్ తూటాలు దాన్ని పైపైన తాకాయంతే. నిజానికా తుటాలు నెపోలియన్‌కి గురి పెట్టబడ్డాయి. ఈ కాగితాలన్నీ ఎవ

**కొత్తగాలి...**

**లక్షల జీతం తెచ్చినా..**
**సాఫ్ట్‌వేర్ ఇంజినీరైనా**
**ఆవకాయ అన్నం తినాల్సిందే**
**ఎలక్ట్రానిక్ చిప్స్ మాత్రం కాదు**

– వోలేటి శ్రీనివాసరావు,
విజయనగరం

రైనా చదవగలిగితే చదవండి' చేతిలోని కాగితాలనూపింది.

'ఇది స్నోబాల్ రాతే. నిజానికి అదను చూసి పోరునుంచి వెన్ను చూపాలని స్నోబాల్‌కు ఆదేశాలున్నాయి. నెపోలియన్ లేకపోయుంటే అది ఈ విషయంలో సఫలమయి వుండేది. మీకు గుర్తులేదూ? ఆ రోజు జోన్స్ బృందం ముట్టడించగానే స్నోబాల్ వెనుదిరిగి కొంత దూరం పరుగెత్తలేదూ? మనమంతా గందరగోళంలో ఉన్నప్పుడు నెపోలియన్ ముందుకు దూకి, మానవజాతికి మరణం అన్న రణన్నినాదంతో జోన్స్ పిక్క పట్టుకోలేదూ? '

స్క్వీలర్ అలా కళ్లక్కట్టినట్టు చెప్పేసరికి జంతువులన్నీ అలాగే జరిగినట్టు నమ్మాయి. కానీ బాక్సర్‌కి మాత్రం ఇంకా నమ్మకం కుదరలేదు. 'స్నోబాల్ మొదట్నించీ నమ్మకద్రోహి అంటే నే నమ్మలేను. పోరులో అది చాలా ధీరోదాత్తంగా పోరాడింది.'

'కామ్రేడ్! నెపోలియన్ ఈ విషయం చాలా స్పష్టంగా చెప్పింది- స్నోబాల్ ముందు నుంచీ జోన్స్ పక్షమే' స్క్వీలర్ మరింత నొక్కి చెప్పింది.

'ఆహా! అలాగా! నెపోలియన్ చెప్పిందంటే అది నిజమే అయ్యుండాలి' బాక్సర్ తృప్తి చెందింది.

'అదీ! విశ్వాసం అంటే అలాగుండాలి' మెచ్చుకుంది స్క్వీలర్. అయితే అది బాక్సర్ వంక చూసిన చూపులో అయిష్టత స్పష్టంగా కనిపించింది.

వెళ్ళడానికి వెనుదిరిగిన స్క్వీలర్ ఆగి, 'నేను మీ అందరినీ కళ్లు విప్పార్చుకుని చుట్టూ గమనించమని కోరుతున్నా. మనలోనే స్నోబాల్ అనుచరులున్నారని స్పష్టంగా తెలుస్తోంది' అంది.

నాలుగు రోజుల తర్వాత జంతువులన్నిటినీ పెరట్లో సమావేశపరచింది నెపోలియన్. అన్నీ గుమిగూడాక అది భవంతిలోంచి రెండు పతకాలు (ఈ మధ్య అది తనకు తాను 'వీరమార్తాండ', 'వీరాధివీర' అన్న బిరుదులు ఇచ్చుకుంది) ధరించి తొమ్మిది కుక్కలూ గుర్రు పెడుతుండగా వచ్చి నిలబడింది. జంతువుల వెన్నులోంచి చలి బయల్దేరింది. జరగరానిదేదో జరగబోతోందని అనిపించింది వాటికి.

నెపోలియన్ అన్నిటినీ క్రూరంగా చూసి హఠాత్తుగా ఓ పెనుకేక వేసింది. ఆ కేక వినగానే కుక్కలు ముందుకు లంఘించి నాలుగు పందుల్ని చెవులు పట్టుకుని ఈడ్చి, అవి గిజగిజలాడుతుండగా నెపోలియన్ పాదాల వద్ద పడేసాయి. పందుల చెవుల నుండి రక్తం స్రవించసాగింది. రక్తం రుచి చూసిన కుక్కలు కాసేపటి వరకూ పిచ్చిగా గంతులేసాయి.

అన్నీ నివ్వెరపోయి చూస్తుండగా మూడు కుక్కలు బాక్సర్ మీదకు లంఘించాయి. అవి మీదకు దూకడం గమనించిన బాక్సర్ ఓ కుక్కను గాలిలోనే అడ్డుకుని దానిని నేలపై అదిమి పట్టింది. ఆ కుక్క కుయ్యోమని జాలి గొలిపేలా అరిచింది. మిగిలిన రెండు కుక్కలూ తోకలను కాళ్ల సందులో దాచుకుని వెనక్కి పారిపోయాయి.

## కొత్తగాలి...



**చెప్పుకోవడానికే జన్మభూమి**
**పుణ్యభూమి.. కర్మభూమి**
**చేతులారా చేస్తున్నారు**
**చూడు.. రుద్రభూమి**

– పట్ల యాదగిరి,
*గుండాల, నల్గొండ జిల్లా*

బాక్సర్ నెపోలియన్ వంక చూసింది- దాన్ని చంపాలా లేక వదలాలా అన్నట్టు.

క్షణాల్లో నెపోలియన్ ముఖకవళికలు మారిపోయాయి. అది ఆ కుక్కను వదల మని సైగ చేసింది. బాక్సర్ కాలు తీయ గానే ఆ కుక్క మూలుగుతూ పరుగుతీ సింది.

మెల్లగా అక్కడ నిశ్శబ్దం చోటు చేసు కుంది. నాలుగు పందులూ వణకసా గాయి. నెపోలియన్ వాటిని తమ తప్పుల్ని ఒప్పుకొమ్మని ఆజ్ఞాపించింది. నెపోలియన్ ఆదివారపు సమావేశాలు రద్దు చేసినపుడు అభ్యంతరం తెలిపినది ఆ నాలుగు పందులే!

మరే శషబిషలూ లేకుండా ఆ పందులు స్నోబాల్ పారిపోయినప్పట్నించీ తాము దానితో రహస్య మంతనాలు జరిపామనీ, గాలిమర కూల్చివేతలో తాము భాగస్వా ములమనీ, జంతుక్షేత్రాన్ని ఫ్రెడరిక్‌కు అప్పగించడానికి రహస్య ఒప్పందం జరిగిం దనీ ఒప్పేసుకున్నాయి. జోన్స్‌కు రహస్య సేవకురాలినని స్నోబాల్ తమ వద్ద ఒప్పు కున్నట్టు అవి తెలియజేసాయి. అవి చెప్పడం పూర్తి కాగానే కుక్కలు భీకరంగా అరుస్తూ వాటి కంఠాలు పట్టి చీల్చేసాయి. నెపోలియన్ తన కంచుకంఠంతో, 'ఇంకా ఏ జంతువైనా చెప్పుకునేదేమైనా ఉందా?' అని ప్రశ్నించింది.

గుడ్ల విషయంలో అసమ్మతి తెలిపిన కోళ్లు మూడు ముందుకు వచ్చి స్నోబాల్ తమకు నెపోలియన్ ఆజ్ఞలను ధిక్కరించ మని చెప్పిందన్నాయి. అవి కూడా కుక్కల పదునైన కోరల పాలబడ్డాయి. ఓ బాతు పోయినేడాది తాను ఓ ఆరు మొక్కజొన్న పొత్తులు దొంగలించినట్లు ఒప్పుకుంది. ఓ గొర్రె తాను స్నోబాల్ ఆజ్ఞ ప్రకారం మంచి నీళ్ల తొట్టిలో మూత్రం పోసినట్టు తెలిపింది.

అవన్నీ అక్కడికక్కడే కుక్కలచేత చంప బడ్డాయి. ఆ విధంగా ఒప్పుకోళ్లు, మరణశి క్షలు నిరంతరాయంగా జరిగి నెపోలియన్ ముందు ఓ పెద్ద కళేబరాల గుట్ట పడింది. అక్కడి గాలంతా రక్తపు వాసనతో నిండి పోయింది.

అంతా ముగిసాక కుక్కలు, పందులు తప్ప మిగతా జంతువులన్నీ సమూహంగా వెనక్కి నక్కాయి. అవన్నీ బెదిరిపోయి, దయనీయంగా కనిపిస్తున్నాయి. చంపబడ్డ జంతువులు స్నోబాల్‌తో కలిసి మోసగిం చడం ఘోరమో, లేక ఆ రక్తపాతం

## ఎవరికీ తెలియదులే!

లాల్‌బహదూర్‌శాస్త్రిపై నెహ్రూకు విశ్వాసం మెండు. ఓసారి కాశ్మీరులోని హజరత్‌బాల్ దర్గా సమస్యను పరిష్కరించేందుకు శాస్త్రిని వెళ్లమని కోరారు. నిరాడంబరుడైన శాస్త్రితో నెహ్రూ 'ఈ సమయంలో కాశ్మీర్‌లో తీవ్రంగా మంచు కురు



స్తుంటుంది. చలిబారి నుంచి రక్షణకు తగిన దుస్తులు ఉన్నాయా?' అన్నారు.

దానికి శాస్త్రి తనవద్ద అలాంటివేమీ లేవని అన్నారు. వెంటనే నెహ్రూ తన పొడుగాటి ఉన్నికోటును అప్పటికప్పుడే శాస్త్రికి తీసిచ్చే శారు. పొట్టివాడైన శాస్త్రికి అది మరింత పొడుగయింది. వెంటనే నెహ్రూ, 'ఫర్వాలే దండీ, సాధారణంగా ఉల్లెన్ కోట్లు చాలా పొడుగుంటాయి. అందువల్ల దీన్ని అరువు తెచ్చుకున్నారనే విషయం ఎవరికీ తెలియదు' అన్నారు హాస్య చతురతతో.

ఘోరమో అవి నిర్ణయించుకోలేకపోయాయి. జోన్స్ రోజుల్లో కూడా రక్తపాతం ఉండేది కానీ, ఇలా తమ జాతే ఇతర జంతువులని చంపడం చూసి అవి తట్టుకోలేకపోయాయి. జోన్స్ పరారయ్యాక అక్కడ ఓ ఎలక కూడా చంపబడలేదు.

అవన్నీ మెల్లగా నడుచుకుంటూ గాలి యంత్రం కట్టడం వద్దకు చేరి ఒకదాన్నొకటి ఓదార్చుకుంటున్నట్టు హత్తుకు కూర్చున్నాయి. బాక్సర్ మాత్రం నిలబడింది. అది అసహనంతో తోకనూపుతూ, అటూ ఇటూ కదం తొక్కుతూ విస్మయంతో సకిలిస్తూ నిలుచుంది. ఏ జంతువుకూ నోట్లోంచి శబ్దం రాలేదు.

చివరికి బాక్సరే- 'నాకిదంతా నమ్మబుద్ధి కావడం లేదు. ఇలాంటి నమ్మకద్రోహం మనలో కూడానా? ఇందులో మన తప్పేదో ఉంది. దీనికి నాకు కనిపించే పరిష్కారమేమంటే- ఇంకా ఎక్కువ కష్టపడటం. ఈ రోజు నుంచీ నేను అరగంట కాకుండా గంట ముందే లేచి పని మొదలు పెడతాను' అంటూ మెల్లగా కదం తొక్కుతూ రాళ్ళగుట్ట వైపు సాగిపోయింది.

జంతువులు కూర్చున్న దిబ్బ మీదినుంచి జంతుక్షేత్రం చుట్టుపక్కల అంతా స్పష్టంగా కనబడుతోంది. రహదారి వరకూ వ్యాపించి పచ్చిక, తాగు నీటి చెరువూ, మొలకెత్తిన పచ్చని గోధుమ పంటా, భవనంలోంచి సుళ్ళు తిరుగుతూ లేస్తున్న పొగ, చెరువు నీళ్లూ.. సూర్యకాంతిలో కనిపించే ఆ అద్భుత దృశ్యాలన్నీ తమవేనని జంతువులు గుర్తుకు తెచ్చుకున్నాయి. ఆ క్షేత్రం వాటికప్పుడు అత్యంత ప్రీతిపాత్రంగా కనిపిస్తోంది.

పర్వత సానువులవైపు చూస్తున్న క్లోవర్ కళ్లు నీటితో నిండిపోయాయి. తన ఆలోచనలకు అది రూపం ఇచ్చి ఉంటే- తాము మానవులను యజమానులుగా తోసిరాజని సాధించుకోవాలన్న లక్ష్యం ఇది కాదనీ, పోరుకు సిద్ధం కావాలని మేజర్ అన్నప్పుడు తామూహించింది ఈ రక్తపాతం కాదనీ చెప్పేది. భవిష్యత్ గురించి అది కన్న కలలో- ప్రతి జంతువూ ఆకలీ, కొరడా దెబ్బలు లేకుండా... అన్ని జంతువులూ సమానమై, ప్రతి జంతువూ తన సామర్థ్యానికి అనుగుణంగా పని చేస్తాయనీ, బలమైనవి బలహీనమైన వాటిని కాపాడతాయని ఆశించింది. కానీ తమ సహచరులను క్రూరమైన కుక్కలు ఖండఖండాలుగా చీలుస్తున్నా తామెందువల్ల నోరు మెదపలేదు? తమ మనస్సులో ఆజ్ఞలను ధిక్కరించాలని గానీ, తిరుగుబాటు చేయాలనే ఆలోచన గానీ ఎందుకు లేవు?

ఇప్పుడున్న పరిస్థితులు జోన్స్ కాలం నాటికంటే నయమనీ, తమ ప్రథమ కర్తవ్యం జోన్స్ తిరిగి రాకుండా చూడడమనీ, కనుక తాను వినయంగా ఉండి కష్టపడి పనిచేసి, నెపోలియన్ నాయకత్వాన్ని అయిష్టంగానైనా అంగీకరించాలని నిర్ణయించుకుంది క్లోవర్.

ఆ విచారంలో క్లోవర్ నోటివెంట అప్రయత్నంగా స్వేచ్ఛాగీతం వెలువడింది. క్లోవర్ చుట్టూ కూర్చున్న జంతువులు గొంతు కలిపాయి. అయితే ఆ రాగం విషాదంగా ఉంది. అది ఇదివరకెన్నడూ పాడని రాగం.

ఆ పాట పూర్తవుతుండగా స్క్వీలర్ అక్కడికి రెండు కుక్కలను వెంటపెట్టుకుని వచ్చింది. కామ్రేడ్ నెపోలియన్ ఆజ్ఞమేరకు ఇకనుంచీ స్వేచ్ఛాగీతం పాడటం నిషేధించబడిందని తెలిపింది.

జంతువులన్నీ నివ్వెరపోయాయి.

'ఎందుకు?' మురియల్ బిగ్గరగా ప్రశ్నించింది.

'ఎందుకంటే ఇప్పుడా పాట అవసరం లేదు గనుక' తలబిరుసుగా సమాధానమి

చ్చింది స్క్వీలర్.

'ఆ పాట తిరుగుబాటు సందర్భంగా పుట్టింది. తిరుగుబాటు పూర్తయింది కనుక ఇప్పుడు దాని అవసరం లేదు. మన లోపలా, బయటా ఉన్న శత్రువులను హతమార్చాం. ఆ పాటలో మనం సమసమాజ నిర్మాణం గురించి కలగన్నాం. ఆ సమాజం ఇప్పుడెలాగూ ఏర్పడింది గనుక ఆ పాట అవసరం ఎంత మాత్రం లేదు'.

కొన్ని జంతువులు దీన్ని ప్రతిఘటించాలనుకున్నాయిగానీ అదే సమయంలో గొర్రెలు అలవాటు ప్రకారం 'నాలుగు కాళ్లవి మంచివి, రెండు కాళ్లని చెడ్డవి' అనే పల్లవి ఎత్తుకునేసరికి ఆ విషయానికి అంతటితో తెరపడింది.

అప్పట్నించీ స్వేచ్ఛాగీతం ఇక జంతు క్షేత్రంలో వినబడలేదు. దాని స్థానంలో కవిరాజు మినిమస్ నెపోలియన్‌ను కీర్తిస్తూ మరోపాట రాసింది. ప్రతి ఆదివారం జెండా ఎగరేసాక ఆ పాట పాడాలని ఆజ్ఞాపించబడింది. కానీ జంతువులకు ఆ పాట రాగం, పాటలోని మాటలూ ఎన్నడూ పట్టుబడలేదు.




**మ**రణశిక్షలు విధించబడి చాలా కాలం గడిచాక అకస్మాత్తుగా కొన్ని జంతువులకు 'ఏ జంతువూ వేరే జంతువును చంపరాదు' అన్న ఆరవ శాసనం గుర్తుకు వచ్చింది. క్లోవర్ బెంజిమన్‌ను ఆ శాసనాన్ని తిరిగి చదవమని కోరింది. యధావిధిగా బెంజిమన్ దానికి నిరాకరించింది. తను అలాంటి విషయాల్లో తల దూర్చనంది. క్లోవర్ గత్యంతరం లేక మురియల్‌ను పిలిచింది.

మురియల్ 'ఏ జంతువూ వేరే జంతువును కారణం లేకుండా చంపరాదు' అని చదివింది. జంతువులన్నీ ఈ 'కారణం లేకుండా' అనే పదాలు తాము మరచిపోయామని భావించాయి. అయితే ఆ నమ్మక ద్రోహులకు మరణ శిక్ష ఏ మాత్రం తప్పు కాదని తృప్తి చెందాయి.

ఆ ఏడాది జంతువుల కష్టాలు మరింత పెరిగాయి. రోజువారీ పనులతోపాటు మునుపటికన్నా మందమైన గాలియంత్రపు గోడలు గడువులోగా పూర్తిచేయడానికి అవి చెమటోడ్చసాగాయి. ఒక్కోసారి వాటికి తాము జోన్స్ కాలం నాటికన్నా ఎక్కువ పని చేస్తున్నట్టు, తక్కువ తిండి తింటున్నట్టు అనిపించేది.

ప్రతీ ఆదివారం ఉదయం స్క్వీలర్ ఓ పొడవైన కాగితంతో ప్రత్యక్షమై, ఫలానా పంట 200 శాతం పెరిగిందనీ, ఫలానా పండ్ల దిగుబడి 300 శాతం పెరిగిందనీ చదివేది. జంతువులు కొన్ని సార్లు ఆ అంకెలు తగ్గినా ఫర్వాలేదు గానీ, తిండి మాత్రం తగినంత దొరికితే బాగుండునను కునేవి.

నెపోలియన్ ఎప్పుడో ఒకసారి మాత్రం బయట కనిపిస్తోంది. ఇప్పుడు దాని చుట్టూ కుక్కలే కాక, ముందు ఓ కోడి పుంజు కూడా నడుస్తోంది. నెపోలియన్ ఏదైనా మాట్లాడే ముందు అది నగారా వాయించినట్లు కొక్కొరొక్కో అని అరిచేది. నెపోలియన్ ఇప్పుడు ప్రత్యేక గదిలో నివసిస్తోందని వినికిడి. భోజనాన్ని కూడా అది ఒంటరిగా తింటోందట. అదీ.. అల్మ

రాలోని ప్రత్యేక పింగాణీ పాత్రలలో! ఇక నుంచీ తుపాకి ఏడాదికి రెండుసార్లు కాకుండా నెపోలియన్ పుట్టినరోజు కూడా పేల్చబడుతుందని తెలిసింది.

నెపోలియన్‌ను ఇప్పుడు పందులు 'మన ప్రియతమ నాయకుడు నెపోలియన్' అనీ, 'జంతుహిత' అనీ, 'మానవజాతి సింహ స్వప్నం' అనీ రకరకాలుగా సంబోధిస్తున్నాయి. నెపోలియన్ మంచితనాన్నీ, వివేకాన్నీ ప్రశంసించేటప్పుడు, ఇతర క్షేత్రాల్లో బానిసత్వం కింద మగ్గుతున్న జంతువుల పట్ల నెపోలియన్ దయాగుణాన్ని కీర్తించేటప్పుడూ ఆ పందుల చెక్కిళ్లపై కన్నీళ్లు జాలువారేవి. ప్రతీ విజయాన్ని నెపోలియన్‌కు ఆపాదించడం, ప్రతీ అదృష్టం వెనకాల నెపోలియన్ కృషి ఉందనడం ఇప్పుడు సర్వసాధారణమైంది.

అప్పుడప్పుడూ ఓ కోడి 'మన నెపోలియన్ నాయకత్వంలో నేను ఆరు రోజుల్లో అయిదు వందల గుడ్లు పెట్టాను' అనేది. చెరువులో నీరు తాగుతున్న ఆవులు 'నెపోలియన్ నాయకత్వం వర్ధిల్లాలి! ఈ నీళ్లెంత రుచికరంగా ఉన్నాయి' అనేవి.

నెపోలియన్‌ను కీర్తిస్తూ మినిమస్ ఒక కవితను కూడా రాసింది-

చింతలను తీర్చు
అమృతపు ధారవు
బాధల కడతేర్చు
మధుపాత్రవు.
రాజసము నిండిన నీ చూపుకు
నా ఆత్మ పరవశించినది
ఆ చూపుకు ఆకసంలో
సూర్యుని తేజస్సు.
కామ్రేడ్ నెపోలియన్!
నిను ప్రేమించు జీవాలన్నింటికీ
ప్రసాదించావు తిన్నంత తిండి
దొర్లేందుకు పరిశుభ్రమైన గడ్డి
చిన్నా పెద్దా జంతువులు
కలలో కూడా చేయును నీ జపం
కనిపెట్టి ఉన్నావు నీవన్నింటినీ
కామ్రేడ్ నెపోలియన్!
చిన్న కోడి పిల్లైనా
పెద్ద ఆబోతైనా
నిన్ను గౌరవించుకోవడం మా కర్తవ్యం
మా నిరంతర నామస్మరణం
కామ్రేడ్ నెపోలియన్!

ఈ కవిత విని నెపోలియన్ చాలా సంతోషించింది. ఆ కవితను అది ఏడు శాసనాలు ఉన్న గోడపై లిఖింపజేసింది. ఆ కవిత పక్కనే నెపోలియన్ చిత్రం కూడా రంగుల్లో చిత్రించబడింది.

★ ★ ★

నెపోలియన్ ఇప్పుడు వింఫర్ సాయంతో ఫ్రెడరిక్, పిల్కింగ్‌టన్‌లతో బేరాలు సాగిస్తోంది. కలప ఇంకా అమ్ముడుపోలేదు. ఫ్రెడరిక్ ఆ కలపను సొంతం చేసుకోవడానికి ఆత్రుతగా ఉన్నాడు కానీ అతని వద్ద తగినంత సొమ్ములేదు.

ఉన్నట్టుండి ఫ్రెడరిక్ తన మనుషులతో జంతుక్షేత్రంపై దాడిచేయాలనే ఆలోచనలో ఉన్నాడనే పుకారు పుట్టింది. అతని పించ్‌ఫీల్డ్‌లోనే స్నోబాల్ దాగున్నట్టు సమాచారం అందింది.

వేసవిలో జంతువులన్నీ మరొక్కసారి ఉలిక్కిపడ్డాయి. మూడు కోళ్లు తాము స్నోబాల్ ప్రోద్బలంతో నెపోలియన్ హత్యకు కుట్ర పన్నినట్టు ఒప్పుకున్నాయి. వెంటనే వాటిని వధించడం జరిగిపోయింది. నెపోలియన్ రక్షణకు మరిన్ని జాగ్రత్తలు తీసుకోబడ్డాయి. దాని మంచం చుట్టూ కుక్కలు నియమించబడ్డాయి. విషం కలపవచ్చనే అనుమానంతో నెపోలియన్ భోజనాన్ని ప్రతి పూటా ఓ పంది రుచి చూసిన తర్వాతే నెపోలియన్ భోంచేసేది.

నెపోలియన్ కలపనంతా పిల్కింగ్‌ట

న్‌కు అమ్మడానికి నిశ్చయించుకుందని తెలిసింది. అంతేకాక ఫాక్స్‌వుడ్, జంతుక్షేత్రం -రెండూ తమకవసరమైన వస్తువులను ఇచ్చిపుచ్చుకుంటాయని కూడా తెలిసింది. ఇప్పుడు వింపర్ ద్వారా నెపోలియన్, పిల్కింగ్‌టన్‌ల మధ్య మైత్రీబంధంలాంటిది ఏర్పడింది. జంతువులకు పిల్కింగ్‌టన్ అంటే మానవులపై సహజంగా ఉండే అపనమ్మకం ఉండేది. అయితే ఫ్రెడరిక్ అంటే వాటికి పిల్కింగ్‌టన్‌కన్నా ఎక్కువ భయం.

రాత్రానూ గాలియంత్రం కట్టడంపై దాడులు జరగవచ్చనే పుకార్లు బలపడసాగాయి. ఫ్రెడరిక్ ఇరవై మంది సాయుధ

కొత్తగాలి...

**పార్లమెంట్ కొమ్మపై**
**ఎంపీ కోయిలలు**
**జీత భత్యాలపై**
**ఐక్యతారాగం**

*– గంపాశ్రీదేవి,*
సింహాచలం

అనుచరులతో దాడికి సిద్ధంగా ఉన్నాడనీ, జంతుక్షేత్రం అతని వశమయ్యాక చట్టపరమైన చిక్కులు రాకుండా పోలీసులకు, మెజిస్ట్రేట్‌కూ లంచాలిచ్చేశాడని తెలిసింది.

అంతేకాక ఫ్రెడరిక్ క్షేత్రంలో జంతువులపై అనేక అకృత్యాలు జరుగుతున్నాయట. అతనో ముసలి గుర్రాన్ని చచ్చేదాకా కొట్టాడనీ, తన ఆవులకు తిండి పెట్టకుండా హింసిస్తున్నాడనీ, ఓ కుక్కను మంటల్లోకి విసిరి చంపేసాడనీ, కాళ్లకు పదునైన కత్తులతో చంపుకునే కోడిపుంజుల పోరాటాలతో అతను చాలా ఆనందం అనుభవిస్తాడనీ- ఇలా రకరకాల పుకార్లు వచ్చాయి.

ఇవన్నీ విన్న జంతువుల రక్తం మరిగిపోసాగింది. అవన్నీ పించ్‌ఫీల్డ్ మీద దాడి చేసి అక్కడి మానవులను తరిమికొట్టి తమ జాతి జీవాలకు స్వేచ్ఛ కల్పించే అవకాశమివ్వమని నెపోలియన్‌ను కోరాయి. అయితే స్క్వీలర్ అటువంటి తొందరపాటు చర్యలకు పాల్పడవద్దనీ, కామ్రేడ్ నెపోలియన్ నాయకత్వాన్ని విశ్వసించమనీ వాటిని ఊరడించింది.

జంతువుల అసహనం నానాటికీ పెరగసాగింది. ఒక ఆదివారం ఉదయం నెపోలియన్ ధాన్యాగారంలో ప్రత్యక్షమై, తానెన్నడూ ఫ్రెడరిక్‌కు కలపను అమ్మాలనుకోలేదంది. అలాంటి తుచ్ఛులతో వ్యాపారం చేసే ఆలోచన తనకు లేదంది. తిరుగుబాటు వ్యాప్తి చేయడానికి నియమించబడ్డ పావురాలు కూడా ఫాక్స్‌వుడ్‌లో కాలు మోపడం నిషేధించబడింది.

★ ★ ★

వేసవి చివర్లో మరో కుట్ర బయటపడింది! గోధుమ పంట మొత్తం కలుపుతో నిండిపోయింది. రాత్రిళ్లు రహస్యంగా సంచరించే స్నోబాల్ గోధుమ విత్తనాలలో కలుపు విత్తనాలు కలిపిందని తెలిసింది. ఆ పంటకు కాపలాగా నియమించబడ్డ బాతు తన నేరాన్ని ఒప్పుకుని విషతుల్యమైన గింజలను మింగి ఆత్మహత్య చేసుకుంది.

జంతువులన్నీ ఇప్పుడు స్నోబాల్ ఎన్నడూ వీరమార్తాండ అనే బిరుదును పొందలేదని, పశువుల పాక సమరం తర్వాత స్నోబాల్ అది తనకైతాను సృష్టించిన పుకారనీ తెలుసుకున్నాయి. జంతువులన్నీ ఈ కల్పనను నోరెళ్లబెట్టి విన్నాయి. కానీ స్క్వీలర్ తొందర్లోనే వాటి జ్ఞాపకాలను చెరిపేయగలిగింది.

★ ★ ★

శరదృతువు వచ్చేసరికి అతి కష్టమ్మీద

గాలియంత్ర నిర్మాణం పూర్తయింది. వింఫర్ దానిక్కావాల్సిన యంత్రాలు కొనుగోలు చేసే ప్రయత్నాల్లో ఉన్నాడు.

అన్ని కష్టాలనూ అధిగమించి- అనుభవ రాహిత్యంతో, అరకొర పరికరాలతో, స్నోబాల్ కుట్రలను ఛేదిస్తూ అనుకున్న సమయానికి కట్టడం పూర్తయింది!

అలసిపోయిన జంతువులన్నీ ఆ కట్టడాన్ని తృప్తిగా చూసుకున్నాయి. వాటి కళ్లకు అదిప్పుడు మునుపటికన్నా అందంగా కనిపిస్తోంది. తాము పడ్డ కష్టాలను, ఓర్చుకున్న వెక్కిరింతలను తల్చుకుని జంతువులన్నీ కేరింతలు కొడుతూ దాని చుట్టూ తిరిగాయి.

ఆ కట్టడాన్ని వీక్షించడానికి నెపోలియన్ స్వయంగా విచ్చేసింది. అది పేరు పేరునా ఒక్కో జంతువునూ పిలిచి వాటికి శుభాకాంక్షలు తెలిపింది. దానికి 'నెపోలియన్ పంఖా' అని నామకరణం జరిగింది.

రెండ్రోజుల తర్వాత ఒక సమావేశం ఏర్పాటయింది. ఫ్రెడరిక్‌కు కలపనంతా అమ్మేశామని నెపోలియన్ చెప్పినపుడు అవన్నీ నోటమాట రాక నిలబడిపోయాయి. మరుసటి రోజు ఫ్రెడరిక్ కలపను తీసుకుపోతాడు. పిల్కింగ్‌టన్‌తో స్నేహం నటిస్తూ నెపోలియన్ నిజానికి ఫ్రెడరిక్‌తో రహస్య ఒప్పందం కుదుర్చుకుంది.

ఫాక్స్‌వుడ్‌తో అన్నీ సంబంధాలు తెగిపోయాయి. పావురాలు ఫాక్స్‌వుడ్ మీద ఎగరడం నిషేధించబడింది. 'ఫ్రెడరిక్ నశించాలి' కాస్తా 'పిల్కింగ్‌టన్ నశించాలి'గా మారింది. జంతుక్షేత్రంపై దాడి జరగవచ్చన్న వదంతులన్నీ కల్పితాలంది నెపోలియన్. ఫ్రెడరిక్ క్షేత్రంలో జంతువుల పట్ల క్రూర ప్రవర్తనను కొట్టిపారేసింది. ఈ వదంతులన్నీ స్నోబాల్ కల్పనంది. నిజానికి స్నోబాల్ చాలా కాలంగా ఫాక్స్‌వుడ్ క్షేత్రంలో ఆశ్రయం పొంది ఉండవచ్చనీ అనుమానం వ్యక్తంచేసింది.

నెపోలియన్ మోసానికి జంతువులన్నీ నివ్వెరపోయాయి. పిల్కింగ్‌టన్‌తో స్నేహం నటిస్తూ అది ఫ్రెడరిక్ వద్ద కలప ఖరీదు పన్నెండు పౌండ్లు పెంచగలిగింది. నెపోలియన్ తెలివి అమోఘమనీ, నిజానికది ఫ్రెడరిక్‌ను కూడా నమ్మదనీ స్క్వీలర్ తెలిపింది.

ఫ్రెడరిక్ డబ్బును చెక్కు రూపంలో చెల్లించాలనుకున్నాడు. అయితే తెలివైన నెపోలియన్ డబ్బును అయిదు పౌండ్ల నోట్లలోనే చెల్లించాలంది. అదీ కలప తీసుకుపోయే ముందే! కనుక అప్పటికే డబ్బు చెల్లించబడింది. ఆ డబ్బు గాలిపంఖా యంత్రం కొనుగోలుకు సరిపోతుందని తెలిపింది స్క్వీలర్.

ఇక కలప తరలింపు అంతా వేగంగా సాగింది. కలపంతా బయటకు పోయాక ధాన్యాగారంలో ఓ ప్రత్యేక సమావేశం ఏర్పాటయింది.

పతకాలు ధరించిన నెపోలియన్ ఓ గడ్డి పరుపుపై విలాసంగా పక్కకు తిరిగి విశ్రమించగా, దాని పక్కనే ఓ పింగాణీ పాత్రలో నోట్లకట్టలు అందంగా పేర్చబడ్డాయి. జంతువులన్నీ మెల్లగా లోపలికి వెళుతూ నోట్లకట్టలనూ, నెపోలియన్‌నూ మార్చి మార్చి చూశాయి. బాక్సర్ తన ముక్కుతో ఆ నోట్ల వాసనను ఆస్వాదించింది. దాని శ్వాసకు ఆ నోట్లు ఫెళఫెళ శబ్దం చేశాయి.

మూడురోజుల తర్వాత పెద్ద దుమారం చెలరేగింది. ముఖంలో నెత్తురు చుక్కలేని వింఫర్ సైకిల్‌మీద పడుతూ లేస్తూ వచ్చి భవంతిలోకి పరిగెత్తాడు. మరుక్షణం నెపోలియన్ గదిలోంచి ఆగ్రహంతో నిండిన ఓ ఘీంకారం వినిపించింది. జరిగిన మోసం క్షేత్రం మొత్తం దావానలంలా

వ్యాపించింది. ఆ నోట్లు నకిలీవి. ఫ్రెడరిక్ కలపనంతా ఉత్త పుణ్యానికి తరలించుకు పోయాడు!

నెపోలియన్ వెంటనే ఓ సమావేశం ఏర్పాటుచేసి ఫ్రెడరిక్‌కు మరణ శిక్ష విధిస్తున్నట్లు కంచు కంఠంతో ప్రకటించింది. ఇంత జరిగాక ఇంకా పెద్ద ద్రోహమేదో జరగవచ్చని ఊహించింది. ఫ్రెడరిక్ తన మనుషులతో కలిసి ఏ క్షణంలోనైనా దండెత్తి రావచ్చని క్షేత్రం నలుమూలలా కాపలా నియమించబడింది. దానికి తోడు పిల్కింగ్‌టన్‌తో స్నేహ సంబంధాల కొరకు ఫాక్స్‌వుడ్‌కు పావురాలతో సందేశం పంపబడింది.

మరుసటిరోజే జంతుక్షేత్రంపై దాడి జరిగింది. ఉదయాన్నే కాపలాగా నియమించబడ్డ జంతువులు పరుగు పరుగున వచ్చి ఫ్రెడరిక్, అతని అనుచరులు సింహద్వారం దగ్గరకు వచ్చేసారనే వార్తను మోసుకువచ్చాయి. తెగించిన ధైర్యంతో జంతువులన్నీ కలిసికట్టుగా వెళ్లి తమ శత్రువులను ఎదుర్కొన్నాయి. అయితే ఈసారి విజయం అంత సులభంగా లభించలేదు. పదిహేను మంది మనుషులు అరడజను తుపాకులతో యాభై మీటర్ల దూరం నుంచే పేల్చుతూ వచ్చారు. దూసుకు వస్తున్న తూటాలను జంతువులు దీటుగా ఎదుర్కొనలేకపోయాయి. బాక్సర్, నెపోలియన్ వాటినెంత ముందుకు తోసినా అవి వెనక్కే తిరిగాయి.

కొద్దిసేపట్లోనే చాలా జంతువులు తూటా దెబ్బలు తిన్నాయి. అవన్నీ భవనంలో అక్కడక్కడా దాక్కుని తలుపులూ, కిటికీల మాటునుంచి భయంతో తొంగి చూడసాగాయి. తొందర్లోనే ధాన్యాగారమూ, గాలియంత్రం కట్టడమూ శత్రువుల చేతుల్లోకి వెళ్లిపోయాయి!

కొన్ని నిమిషాల పాటూ నెపోలియన్ చేష్టలుడిగాయి. తోక బిరుసుగా కదులుతుండగా అది చాలాసేపు పచార్లుచేసింది. ఫాక్స్‌వుడ్ క్షేత్రం వైపు ఆశగా చూసింది. పిల్కింగ్‌టన్ గనుక తన మనుషులతో వచ్చి సాయంచేస్తే అప్పటికీ విజయావకాశాలున్నాయి. అదే సమయంలో పావురాలు తిరిగి వచ్చాయి. వాటిల్లో ఓ పావురం ముక్కున ఓ కాగితం ఉంది. దానిపై 'నీకిది తగిన శాస్తి' అని రాసి ఉంది.

ఈలోపు ఫ్రెడరిక్ మనుషులు గాలియంత్రం కట్టడం చుట్టూ చేరారు. జంతువులన్నీ వాళ్లనే గమనించసాగాయి. వాటిలో ఏదో అలజడి బయలుదేరింది. ఇద్దరు మనుషులు సమ్మెటలూ, పలుగులూ గునపాలూ బయటికి తీసారు. వాళ్లు దానిని కూల్చివేయబోతున్నారు!

'అసాధ్యం!' నెపోలియన్ అరిచింది. 'దానిని పగలగొట్టడానికి వీల్లేనంత మందంగా నిర్మించాం. వారం రోజులైనా వాళ్లు దానిని కూల్చలేరు. అందరూ ధైర్యంగా వుండండి కామ్రేడ్స్!'

బెంజిమన్ ఒక్కటే మనుషుల కదలికలను జాగ్రత్తగా గమనించసాగింది. ఇద్దరు మనుషులు కట్టడం పునాదుల వద్ద కన్నం తవ్వసాగారు. బెంజిమన్ తన పొడగాటి మూతిని సాలోచనగా ఊపింది. 'నేను అనుకుంటూనే ఉన్నాను. ఇంకో నిమిషంలో వాళ్లా కన్నంలో మందుగుండు దట్టిస్తారు'.

జంతువులన్నీ ఊపిరి బిగబట్టుకుని చూడసాగాయి. ఒక్క జంతువూ బయటకు రావడానికి సాహసించలేదా క్షణంలో. కొంతసేపటి తర్వాత మనుషులు అన్ని దిక్కులకూ పరుగుతీసారు. ఆ తర్వాత చెవులు బద్దలయ్యే శబ్దం! పావురాలు కకావికలై గాలిలోకి ఎగిరాయి. జంతువులన్నీ నేలపై బోర్లాపడి ముఖాలను మట్టిలో

# అమెరికాలో చదువుసందెలు




అమెరికా పాఠశాలల్లో చెక్కబల్ల మీద కాల్చిన బంగాళదుంప మసితో తెల్లసొన కలిపి చేసిన బ్లాక్‌బోర్డును 1809లో ప్రవేశపెట్టారు.

**1870:** విద్యార్థులు హోంవర్క్ చేసి తీసుకొచ్చే పద్ధతి వచ్చింది. పేపర్ తయారుచేసే యంత్రావిర్భావంతో కాగితం ఉత్పత్తి దీనికి దోహదం చేసింది.

**1910:** పరీక్షా పత్రాల ద్వారా విద్యార్థులను పాస్/ఫెయిల్ చేసే పద్ధతి చేపట్టారు.




**1926:** స్కోలాస్టిక్ అసెస్‌మెంట్ టెస్ట్‌ను ప్రవేశ పెట్టారు.

**1930:** విద్యార్థులను లింగ, జాతులవారీగా తరగతి గదుల్లో కూర్చోబెట్టారు.

**1939:** తరగతిలో టీవీ ప్రవేశపెట్టారు.

**1952:** ఎలిమెంటరీ విద్యార్థులు తప్పనిసరిగా పాఠశాలలకు వెళ్లాలన్న చట్టం చేశారు.

**1954:** స్కూళ్లలో నల్లవారు, తెల్లవారు విడివిడిగా కూర్చునే పద్ధతికి మంగళంపాడారు.

**1966:** డెట్రాయిట్ విద్యార్థులు స్కూళ్లలో విద్యాబోధన స్థాయి తక్కువగా ఉందని పాఠశాలల్ని బహిష్కరించారు.

**1972:** పాఠశాలల్లో లింగ, జాతి విచక్షణను నిషేధించారు.

**1980:** మొట్టమొదటి ఛార్టర్ స్కూళ్ళ ఆవిర్భావం జరిగింది.

**1990:** విద్యార్థులకు టీవీలో ప్రసారమయ్యే వార్తలను విద్యార్థులకు చూపించేవారు.

దాచుకున్నాయి. అవన్నీ లేచేసరికి గాలి యంత్రం కట్టడం ఆనవాళ్లు లేవు! ఆ ప్రదేశంలో నల్లటి పొగలు సుడులు తిరుగుతున్నాయి.

అది చూడగానే జంతువులు నిర్ఘాంతపోయాయి. వాటిని ఆవహించిన భయం, నిరాశానిస్పృహలు ఈ అమానుష కృత్యంతో తొలగిపోయి, వాటికి పట్టరానంత ఆగ్రహం కలిగింది. అవన్నీ ప్రతీకారంతో ఊగిపోతూ, ఇక ఎవరి ఆజ్ఞల కోసమూ ఎదురు చూడకుండా పెడబొబ్బలు పెడుతూ వెళ్లి శత్రువులపై పడ్డాయి. ఈసారి అవి తమను గాయపరుస్తున్న తూటాలను ఏమాత్రం లెక్కచేయలేదు.

అక్కడ హోరాహోరీగా రక్తసిక్త పోరు జరిగింది. ఫ్రెడరిక్ అనుచరులు పదేపదే తుపాకులను పేల్చారు. జంతువులను కర్రలతో బాదారు. బూట్లతో తన్నారు. ఒక ఆవు, మూడు గొర్రెలూ, రెండు బాతులు వీరమరణం పొందాయి. అన్నిటికీ అంతో ఇంతో గాయాలయ్యాయి. వెనుక నుంచి పోరాటాన్ని నడిపిస్తున్న నెపోలియన్ తోకకు కూడా ఓ తూటాదెబ్బ తగిలింది.

జంతువులేమీ తక్కువ తినలేదు. బాక్సర్ గిట్టల దెబ్బలకు ముగ్గురి తలలు పగిలాయి. ఆవు కొమ్ములు ఒకడి పేగులను చీరేశాయి. జెస్సీ, బ్లూబెల్‌ల ధాటికి ఒకడి ముఖం రక్తసిక్తమయింది.

నెపోలియన్ సూచన మేరకు హఠాత్తుగా పొదలమాటు నుంచి వచ్చిపడి మనుషులను చుట్టుముట్టి, కోరలు చాచి దాడికి దిగిన తొమ్మిది జాగిలాలను చూసేసరికి వాళ్ల వెన్నులో వణుకు మొద

లయింది. ఈ దాడితో ఖంగుతిన్న ఫ్రెడ రిక్ తన వాళ్లందర్నీ వెనక్కి మరలమని ఆదేశించగానే అతని అనుచరులు ప్రాణ భయంతో పారిపోసాగారు. జంతువులు వాళ్లని ముఖద్వారం వరకూ తరిమాయి. ముళ్లకంపల్లో దూరుతున్న మనుషుల ముడ్డి మీద తన్ని మరీ తమ కసి తీర్చు కున్నాయి.

జంతువులు మళ్లీ గెలిచాయి. కానీ అవన్నీ గాయపడి, అలసిపోయాయి. అన్నీ మెల్లగా కుంటుతూ, మూలుగుతూ వెనక్కి తిరిగాయి. తూటా దెబ్బలకు పచ్చిక మీద అచేతనంగా పడి ఉన్న సహచరులను చూసేసరికి వాటి కన్నీళ్లు ఆగలేదు.

అన్నీ వెళ్లి దిబ్బగా మారిన గాలియంత్రం కట్టడం చుట్టూ సంతాప సూచకంగా అన్నట్టు నిలబడ్డాయి. వాటి శ్రమకు ఇప్పుడక్కడ ఏ ఆనవాలూ లేదు. దాని పునాదులు సాక్షికంగా దెబ్బతి న్నాయి. పేలుడు ధాటికి రాళ్లు తునాతున కలయి దూరంగా విసిరేయబడ్డాయి. దానిని తిరిగి నిర్మించడం ఈసారి మరీ కష్టం.

అవన్నీ భవంతిని సమీపిస్తుండగా అప్ప టివరకూ పత్తాలేని స్క్వీలర్ తన తోకనూ పుతూ, సంతోషంతో ఎగురుకుంటూ వాటి కెదురుగా వచ్చింది. ఇంతలో భవంతిలోంచి విజయసూచకంగా తుపాకీ పేలింది.

'ఎందుకా తుపాకిని పేలుస్తున్నారు?' బాక్సర్ ప్రశ్నించింది.

'మనం మళ్లీ జయించిన శుభసంద ర్భంగా!' స్క్వీలర్ సంబరంగా చెప్పింది.

'ఇది విజయమా?' బాక్సర్ తన ఒంటి వైపు చూసుకుంది. దాని మోకాళ్లు రక్తమో డుతున్నాయి. గిట్టల కింద నాడా ఒకటి ఎగిరిపోయింది. ఓ గిట్ట చీలిపోయింది. కొన్ని తూటా ముక్కలు దాని వెనక కాలిలో దిగబడ్డాయి.

'మరి! మనం శత్రువులను మన పవిత్ర మైన నేల మీది నుంచి తరమలేదూ?'

'కానీ వాళ్లు మన కష్టాన్నంతా నేలపాలు చేశారు. దాని కోసం మనం రెండేళ్లుగా రక్తం ధారపోస్తున్నాం'

'అయితేనేం! మనం ఇంకోసారి దానిని నిర్మిద్దాం. ఒకటి కాదు, అలాంటి కట్టడాలు అరడజను నిర్మిద్దాం. మనం సాధించిన విజయం ఎంత పెద్దదో నీకర్థం కావడం లేదు కామ్రేడ్! మనమిప్పుడు నిలబడిన ఈ నేల కొద్దిసేపటి క్రితం శత్రువు ఆక్ర మించాడు. మరి ఇప్పుడో.. మనం కోల్పో యిన ప్రతీ అంగుళం తిరిగి సాధించు కున్నాం. కామ్రేడ్ నెపోలియన్ నాయ కత్వం వర్ధిల్లాలి!' స్క్వీలర్ నెపోలియన్ వంక తిరిగి అభివాదం చేసింది.

అన్నీ ఈసురోమంటూ క్షేత్రపు ప్రాంగ ణంలోకి ప్రవేశించాయి. బాక్సర్ శరీరం లోకి దూరిన తూటా ముక్కలు దానిని చాలా బాధిస్తున్నాయి. దాని కళ్ల ముందు తిరిగి నిర్మించాల్సిన కట్టడం కనిపిస్తోంది. దాని కోసం అది అప్పటికే మానసికంగా సిద్ధమైపోయింది. కానీ మొదటిసారి దానికి తన వయసు పదకొండు సంవత్స రాలనీ, తన కండరాల్లో మునుపటి శక్తి లేదనే గ్రహింపు కలిగింది.

## కొత్తగాలి...

**తిలక్! నువ్వు**
**దర్శకత్వానికి పారదర్శకానివి**
**వెండితెరపై**
**చెరగని తిలకానివి!**

– నేహా దూసి,
మురుగేష్ పాళ్యం, బెంగళూరు

ఆకుపచ్చగా రెపరెపలాడుతున్న జెండాను చూసి, ఏడుమార్లు మోగిన తుపాకీ మోత విని, తమనభినందిస్తూ నెపోలియన్ చేసిన ప్రసంగం విన్నాక-తాము నిజంగానే ఓ చరిత్రాత్మక విజయం సాధించామేమోనన్న భ్రమ కలిగింది జంతువులకు.

పోరాటంలో మరణించిన జంతువులకు సకల లాంఛనాలతో అంత్యక్రియలు జరిగాయి. వాటి కళేబరాల పేటికలుంచిన బండిని స్వయంగా బాక్సర్, క్లోవర్‌లే లాగాయి. నెపోలియన్ ఆ ఊరేగింపు ముందు నడిచింది. రెండు రోజులు మొత్తం విజయ సంబరాలకు కేటాయించబడ్డాయి. పాటలు పాడటం, ఉపన్యాసాలివ్వడం జరిగింది.

తుపాకీ పేల్చిన అనంతరం బహుమానంగా ప్రతి జంతువుకూ ఓ ఆపిల్, ప్రతి పక్షికీ దోసెడు గింజలూ, ప్రతి కుక్కకూ మూడు బిస్కెట్లూ పంచబడ్డాయి. స్క్వీలర్ నెపోలియన్‌కు 'సర్వశ్రేష్ఠ' అనే బిరుదును ప్రదానం చేసింది. ఈ మొత్తం సంబరాల్లో దొంగనోట్ల గొడవ సద్దుమణిగింది.

★ ★ ★

కొన్ని రోజుల తర్వాత పందులు నేలమాళిగలో మద్యం సీసాలను కనుగొన్నాయి. ఆ రాత్రి మిగతా జంతువులకు భవంతిలోంచి పెద్దగా గానం వినిపించింది. మధ్యమధ్యలో స్వేచ్ఛాగీతంలోని పదాలు కూడా కలిసాయా గానంలో. జంతువులన్నీ ఆశ్చర్యంలో మునిగిపోయాయి.

తొమ్మిదిన్నరకు నెపోలియన్ జోన్స్ పాత టోపీ ఒకటి ధరించి, వెనుక ద్వారం గుండా బయటకు వచ్చి, పెరట్లో గిర్రున ఓ ప్రదక్షిణ చేసి, అంతే వేగంతో తిరిగి లోపలికి వెళ్లిపోయింది.

ఆ మరుసటి రోజు ఉదయం క్షేత్రమంతా గాఢ నిశబ్దం అలముకుంది. ఒక్క పంది అలికిడి కూడా లేదక్కడ. తొమ్మిది గంటలకు స్క్వీలర్ మెల్లిగా, సర్వం కోల్పోయినదానిలా, తోక బలహీనంగా వేలాడుతుండగా, దేని మీదా దృష్టి నిలపలేని దానిలా వచ్చింది. అది జంతువులన్నింటినీ పిలిచి ఓ విచారకరమైనవార్తను తెలపాలంది. కామ్రేడ్ నెపోలియన్ మరణావస్థలో ఉంది!

జంతువులన్నీ నివ్వెరపోయాయి. స్క్వీలర్ సూచన మేరకు భవంతి బయట మెత్తడి గడ్డి పరచబడింది. జంతువులన్నీ ఆ గడ్డి మీద శబ్దం కాకుండా నడవసాగాయి. తమ నాయకుడు మరణిస్తే తమ గతేమిటా అని వాటికి బెంగపట్టుకుంది.

నెపోలియన్ తినే తిండిలో స్నోబాల్ విషం కలిపిందనే పుకారు బయల్దేరింది.

అయితే ఆ సాయంత్రానికి నెపోలియన్ కొద్దిగా కోలుకుంది. మరుసటి రోజు ఉదయం నెపోలియన్ ఆరోగ్యం బాగైనట్లు స్క్వీలర్ అన్నిటికీ చెప్పింది. ఆ సాయంత్రానికి నెపోలియన్ తిరిగి తన పనుల్లో తాను నిమగ్నమైంది. ఆ మరుసటి రోజు నెపోలియన్ వింఫర్‌ను వెల్లింగ్‌టన్‌లోనుంచి మద్యం తయారీలో మెళకువలపై పుస్తకాలు తెమ్మని కోరింది. ఒక వారం తర్వాత పండ్లతోట వెనకాల పశువుల మేతకు ఉద్దేశించిన పచ్చికబయలును దున్నాలని ఆదేశించింది. అక్కడ పచ్చిక పలచబడిపోయిందనీ, కొత్తగా గడ్డి విత్తులు నాటాలనీ నెపోలియన్ ఆజ్ఞ. అయితే తొందర్లోనే అక్కడ బార్లీ గింజలను విత్తబోతున్నారని తెలిసిపోయిందన్నిటికీ.

అదే సమయంలో అక్కడ ఎవరికీ అర్థం కాని సంఘటన ఒకటి జరిగింది. ఓ రోజు అర్ధరాత్రి భవంతి ప్రాంగణంలో పెద్ద

చప్పుడు విని జంతువులన్నీ అక్కడికి పరుగు తీసాయి. ధాన్యాగారం గోడపై ఏడు శాసనాలు లిఖించిన చోట ఓ నిచ్చెన రెండు ముక్కలై విరిగి ఉంది. వెల్లకిలా పడిన స్క్వీలర్ తాత్కాలికంగా దిమ్మెరపోయి ఉందక్కడ. దాని పక్కనే ఓ లాంతరు, రంగుడబ్బా, కుంచె పడి ఉన్నాయి. కుక్కలు వెంటనే స్క్వీలర్ చుట్టూ రక్షణగా నిలబడి, అది తేరుకుని నిలబడగానే దాన్ని నెమ్మదిగా భవంతిలోకి నడిపించుకుపోయాయి.

బెంజిమన్‌కు తప్ప ఈ సంఘటన పర మార్థం దేనికీ అర్థం కాలేదు. అర్థమైనట్లు తల పంకించిన బెంజిమన్, అదేమిటో మాత్రం దేనికీ చెప్పలేదు.

కొన్ని రోజుల తర్వాత ఏడు శాసనాలను చదువుతున్న మురియల్ తానో శాసనాన్ని తప్పుగా జ్ఞాపకముంచుకున్నట్లు గుర్తిం చింది. తను అయిదో శాసనాన్ని 'ఏ జంతువూ మద్యం సేవించరాదు' అని చదువుకున్నట్లు గుర్తు. అయితే నిజానికి గోడ మీద 'ఏ జంతువూ అతిగా మద్యం సేవించరాదు' అని ఉంది.




**బా**క్సర్ చీలిన గిట్ట మానడానికి చాలా కాలం పట్టింది. విజయోత్సవ సంరంభాలు ముగిసిన మరుసటిరోజే జంతువులన్నీ తిరిగి గాలియంత్రం నిర్మాణాన్ని చేప ట్టాయి. ఒక్కరోజు విశ్రాంతికి కూడా బాక్సర్ అంగీకరించలేదు. తను బాధలో ఉన్నట్లు కనిపించడం కూడా అది తన ప్రతిష్ఠకు భంగంగా భావించింది. అయితే కేవలం క్లోవర్‌కు మాత్రం అది తన బాధ చెప్పుకుంది.

క్లోవర్ కొన్ని మూలికలు తెచ్చి, వాటిని బాగా నమిలి బాక్సర్ గాయానికి పసరు తయారు చేసింది. బెంజిమన్, క్లోవర్‌లు బాక్సర్‌ను కొంచెం పని తగ్గించుకోమని కోరాయి.

'గుర్రాల ఊపిరితిత్తులు ఎక్కువ కాలం పనిచేయవు' బెంజిమన్ వ్యంగ్యంగా అంది. అయితే బాక్సర్ దానిని పట్టించుకో లేదు. దాని లక్ష్యం ఒక్కటే- తను పని లోంచి తప్పుకునే లోపు కట్టడం పూర్తికావా లని.

క్షేత్రం జంతువుల పరమైన మొదట్లో గుర్రాలు, పందులకు పదవీ విరమణ వయస్సు పన్నెండేళ్లుగా, గొర్రెలకు ఏడే ళ్లుగా, కోళ్లు బాతులకు ఐదేళ్లుగా నిర్ణయిం చబడింది. పదవీ విరమణ తర్వాత వాటి భత్యాలు కూడా సంతృప్తికరంగానే నిర్ణ యించబడ్డాయి. అయితే ఇంతవరకూ ఏ జంతువుకూ పని నుంచి మినహాయింపు దొరకలేదు. ఈమధ్య కాలంలో దాని గురించి చాలా చర్చ జరుగుతోంది. పండ్ల తోట అవతల పచ్చిక బయలులో కొంత భాగాన్ని బార్లీ పండించడానికి కేటాయించ డంతో, ఇంకో మూల కంచె కట్టి ఆ స్థలం పదవీ విరమణ చేసిన జంతువుల మేత కొరకు కేటాయించబడుతుందనే పుకారు బయలుదేరింది.

గుర్రాలకు అయిదు పౌన్ల ధాన్యం, చలి కాలంలో పదిహేను పౌన్ల మేత, సెలవు దినాల్లో క్యారెట్ కానీ, ఆపిల్ కానీ ప్రత్యేకం అని నిర్ణయించబడింది. వచ్చే సంవత్సరం బాక్సర్ తన పన్నెండో

ఏడులోనికి అడుగిడబోతోంది.

ఆ చలికాలం చలి తీవ్రత ఎక్కువై జీవితం మరీ దుర్భరమైంది. కుక్కలు, పందులకు తప్ప మిగిలిన జంతువులకు తిండి మరింత తక్కువైంది. అన్ని జంతువులకూ తిండి సమానంగా పెట్టాల నేది జంతు న్యాయానికి విరుద్ధమంది స్క్వీలర్. తిండికేమాత్రం కొదవ లేదనీ, అయితే కొద్దికాలంపాటు తిండిని సర్దు బాటు (అదెప్పుడూ 'లోటు' అనే పదం ఉపయోగించేది కాదు) చేసుకోక తప్ప దంది. జోన్స్ కాలం నాటికంటే ఇప్పుడు తిండి చాలా నయమంది

అది కీచు గొంతుకతో.. తామిప్పుడు ఎక్కువ దాణా, ఎక్కువ గింజలు, ఎక్కువ గడ్డీ, ఎక్కువ దుంపలూ, ఎక్కువ పండ్లూ ఉత్పత్తి చేస్తున్నామని నిరూపించేది. తాము తక్కువ పని గంటలు పని చేస్తు న్నామనీ, నీరు చాలా పరిశుభ్రంగా వుంటోందనీ, తాము సఖ్యతగా ఉంటున్నా మనీ, తమ పిల్లల మరణాల సంఖ్య తగ్గిం దనీ, తమ పాకల్లో ఎక్కువ గడ్డి ఉంటోం దనీ, ఇప్పుడు తమను కుట్టే పురుగులు తక్కువైనాయనీ ప్రకటించేది.

నిజానికి జోన్స్‌నాటి కాలం గురించి జం తువులెన్నడో మరచిపోయాయి. అయితే ప్రస్తుత జీవితం చాలా దుర్భరంగా ఉన్నట్లూ, తాము చాలా ఆకలిగా ఉన్నట్లూ, చలికి వణికిపోతున్నట్లూ, నిద్ర పోని సమయమంతా పనిలోనే మునిగిపో తున్నట్లూ అవి గుర్తించాయి. అయినా నిస్సందేహంగా మునుపటి రోజులు ఇంత కన్నా దుర్భరమైనవని నమ్ముతూ సంతో షించేవి. అదీగాక ఆ రోజుల్లో తాము బానిసలు. మరిప్పుడో! స్వేచ్ఛాజీవులు! స్క్వీలర్ అది గుర్తుచేయడం మాత్రం మరిచేది కాదు.

★ ★ ★

ఆ శరదృతువులో నాలుగు ఆడ పందులు వరుసగా ఒకదానివెంటొకటి ముప్పై ఒక్క పిల్లలను ఈనాయి. అయితే అవన్నీ మామూలుగా కాకుండా నానా మచ్చలతో పుట్టాయి. అక్కడ మిగిలిన పందుల్లో నెపోలియన్ ఒక్కటే మచ్చలున్న అడవి పంది. అందువల్ల ఆ పిల్లల తండ్రె వరో సులభంగానే వూహించుకోవచ్చు.

తర్వాత రోజులలో ఇసుక, కలప కొన్నాక తోటలో పాఠశాలకోసం ఓ గది నిర్మిస్తారని తెలియజేయబడింది. ప్రస్తుతం నెపోలియన్ ఆ పిల్లలకు వంటగదిలోనే శిక్షణనిస్తోంది. అవి తోటలో ఆడుకునే ప్పుడు మిగతా పిల్లలతో కలవడాన్ని నెపో లియన్ ప్రోత్సహించేది కాదు. అదే సమ యంలో ఎప్పుడైనా పందికి మరో జంతువు ఎదురుపడితే, ఆ జంతువు పక్కకు తొలగి పందికి దారి ఇవ్వాలనే ఆజ్ఞ జారీ చేయబ డింది. అంతేకాక వరాహాలన్నిటికీ ఆదివా రాల్లో తమ తోకలకు ఓ ఆకుపచ్చని రిబ్బను ముక్క తగిలించుకునే ప్రత్యేకా ధికారం కల్పించబడింది.

ఆ సంవత్సరం పంటలన్నీ బాగా పండాయి కానీ జంతువులకు మాత్రం డబ్బు కొరత, తిండి కొరత తీరలేదు. పాఠ శాల గది కొరకు ఇటుకలు, సున్నం, ఇసుక

## కొత్తగాలి...

**నేతన్నలకు**
**సిరి లేకున్నా**
**సిరిసిల్లే**
**చిరునామా**

– మేక రామస్వామి,
నిజామాబాద్

నిన్నటి నిజం

## మహారాజా.. మజాకా?

మైసూరును నాలుగో కృష్ణదేవరాయ ఒడెయార్ పాలించేటప్పుడు దసరా ఉత్సవాలు ఘనంగా జరిగేవి. ఆశ్వయుజ శుక్ల దశమి నాడు మహారాజు పట్టపు ఏనుగుపై జంబూ సవారి వెళ్ళేవారు. ఆయన హయాంలో ఏర్పాటు చేసిన కర్ణాటక బ్యాండు వారు తమ మొదటి దసరాకోసం మైసూరు వాసుదేవాచార్యులు కొత్తగా రాసిన 'నన్ను బ్రోచుటకెవరున్నారు?' అనే శంకరాభరణ రాగంలోని కీర్తన వాయిస్తున్నారు. పల్లవి, అనుపల్లవి, చరణాల తర్వాత చివరిలో పాశ్చాత్య సంగీతాన్నిపోలిన చిట్టే స్వరమొకదాన్ని దూరాన ఉన్న బన్ని మంటపంలో ఉండి వాయిస్తున్నారు. జంబూ సవారిలో ఉన్న మహారాజు అది విని జ్ఞాపకం పెట్టుకొన్నారు. సవారి బన్నీ మంటపం చేరుకోగానే ఆయన దాని గురించి వాకబు చేశారు. ఆ కీర్తన మంచి చిట్టేస్వరం పొందకపోవడంతో వినసొంపుగా లేదని అన్నారు. దానికి బదులుగా వాసుదేవాచార్యులతో వేరొక చిట్టేస్వరము రాయించి తెచ్చి, తాము శమీపూజకు వెళ్లొచ్చేలోగా అభ్యసించి, వాయించాలని ఆజ్ఞాపించారు.



రాజుగారి ఊరేగింపు ముందుకు సాగింది. వారి ఆజ్ఞ ప్రకారం చేయాలంటే ముందు వాసుదేవాచార్యులను పట్టుకోవాలి. అదే పెద్ద ప్రయాసతో కూడిన పనైంది. వారికి రాజుగారి ఆజ్ఞను వివరించారు. అప్పటికప్పుడు ఆయన కొత్త చిట్టేస్వరం రాసి ఇచ్చారు. ఇంక దానిని అభ్యసించడమే బ్యాండు సెట్టువారి పని. మహారాజు ఊరేగింపు తిరిగి వచ్చేలోపల వారు ఆ కొత్త చిట్టేస్వరం అభ్యసించారు. మహారాజుకు దానిని భయంభయంగా వినిపించారు. అదృష్టం బాగుండి ఆ కొత్త చిట్టేస్వరం ఆయనకు నచ్చడంతో ఊపిరి పీల్చుకున్నారు.

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..
నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

కొనాల్సివచ్చింది. భవనంలోని దీపాలకు నూనె, కొవ్వొత్తులూ, నెపోలియన్ కొరకు చక్కెరా (చక్కెర వల్ల జంతువులు లావుగా తయారవుతున్నాయని అది మిగతా పందులకు నిషేధించబడింది), కేకులూ, కుక్కబిస్కెట్లూ, గదిని వెచ్చబరచడానికి బొగ్గు.. ఇవన్నీ కొనాల్సిందే!

వీటన్నిటి కోసం ఓ గడ్డివామును, బంగాళాదుంప పంటను పాక్షికంగా అమ్మేశాయి. ఇక గుడ్ల సరఫరా వారానికి ఆరు వందలకు పెంచబడింది. దాని వల్ల కోళ్లు తమ సంఖ్యను నిలకడగా ఉంచడానికి కావాల్సిన గుడ్లను కూడా పొదగలేకపోయాయి.

తిండి పరిమాణం ఫిబ్రవరికల్లా మరింత తగ్గింది. జంతువుల పాకల్లో దీపాల వాడకం నిషేధించబడింది. ఇంత జరుగుతున్నా పందులు మాత్రం సౌఖ్యంగానే ఉన్నాయి. అవి మరింత లావయ్యాయి కూడా.

ఓ రోజు మధ్యాహ్నం అవెన్నడూ ఎరగని ఓ వింత ఘాటు వాసన జంతువుల ముక్కుపుటాలకు సోకింది. ఆ వాసన జోన్స్ కాలంలో మద్యం కాచే గదిలోంచి వచ్చింది.

'అది బార్లీ ఉడుకుతున్న వాసన' అందో జంతువు.

జంతువులు దాన్ని ఆఘ్రాణిస్తూ రాత్రి తమ భోజనంలోకి ఏదైనా కొత్త పులుసు తయారవుతుందేమో అనుకున్నాయి.

మరుసటి ఆదివారం- ఇక నుంచి బార్లీ కేవలం పందులకే అని ప్రకటించబడింది. పండ్లతోట అవతల అప్పటికే బార్లీపంట వేయబడింది. జంతువులకు తొందర్లోనే ప్రతీ పందీ రోజూ మద్యం సేవిస్తోందనీ,

ఇక నెపోలియన్ అయితే ఏకంగా ఓ కూజాను ఖాళీ చేస్తుందనీ తెలిసింది.

తాము మునుపటి కంటే ఎక్కువ పరువు మర్యాదలతో జీవిస్తున్నామనే భావన జంతువులకు అన్ని కష్టాలను మరిచిపోయేలా చేసింది. ఇప్పుడు పాటలు, ఉపన్యాసాలు, వూరేగింపులూ మరింత పెరిగాయి. వారానికోరోజు విజయోత్సవ ప్రదర్శన నిర్వహించాలని నెపోలియన్ పిలుపునిచ్చింది.

క్షేత్రంలో నిర్దేశించిన సమయానికి మిలిటరీ కవాతు నిర్వహించబడేది. వరాహాలు, వాటి వెనకాల గుర్రాలూ, ఆ తర్వాత ఆవులు, గొర్రెలూ, బాతులూ, కోళ్లు.. అన్నీ వరుసక్రమంలో ప్రాకారం చుట్టూ నడిచేవి. వీటన్నిటికీ కుక్కలు అటు ఇటు పహారా కాసేవి. అన్నిటికన్నా ముందు నెపోలియన్ ముద్దుల కోడిపుంజు నడిచేది. బాక్సర్, క్లోవర్‌లు 'నెపోలియన్ వర్ధిల్లాలి!' అని రాసి ఉన్న ఆకుపచ్చని జెండాను పట్టుకుని నడిచేవి. ఆ తర్వాత నెపోలియన్‌ను కీర్తిస్తూ రాసిన కవితలు చదువబడేవి. ఆ వెంటనే స్క్వీలర్ ఆహార ధాన్యాల ఉత్పత్తిలో సాధించిన ప్రగతి గురించి ఉపన్యసించేది. అప్పుడప్పుడూ గాలిలోకి తుపాకీ పేల్చబడేది.

ఈ ప్రదర్శనను గొర్రెలు అమితంగా ఇష్టపడేవి. ఏదైనా జంతువు ఈ ప్రహసనం గురించి గొణిగినప్పుడు (సామాన్యంగా ఈ గొణుగుడు దగ్గర్లో ఏ పందీ, కుక్కా లేనప్పుడు జరిగేది) గొర్రెలు 'నాలుగు కాళ్లవి మంచివి, రెండు కాళ్లవి చెడ్డవి' అనే అరుపులతో వాటి నోళ్లు మూయించేవి. మొత్తమ్మీద ఈ ప్రదర్శనను చాలా జంతువులు ఇష్టపడేవి. ఈ ప్రదర్శన ద్వారా అవి తమ యజమానులం తామేననీ, తాము చేసే పనంతా తమ కొరకేననీ తృప్తిపడేవి. ఈ పాటలతో, ఊరేగింపులతో, ఉపన్యాసాలతో, స్క్వీలర్ లెక్కలతో, కోడిపుంజు అరుపులతో, జెండా రెపరెపలతో అవి తాత్కాలికంగా తమ కడుపులు ఖాళీగా ఉన్నాయని మరచిపోయేవి.

ఏప్రిల్లో జంతుక్షేత్రం ప్రజా ప్రభుత్వంగా ప్రకటించబడింది. దాని కోసం ఓ అధ్యక్షుణ్ణి ఎన్నుకోవాల్సి వచ్చింది. నెపోలియన్ ఏకగ్రీవంగా ఆ పదవికి ఎన్నుకోబడింది. అదే రోజు స్నోబాల్‌కు జోన్స్‌తో గల సంబంధాల గురించి మరిన్ని రహస్య పత్రాలు బయటపడ్డాయి. స్నోబాల్ పశువుల పాక సమరంలో జంతువులు ఓడిపోవడానికి రహస్యంగా కుట్ర పన్నడమే కాదు, బహిరంగంగా జోన్స్ పక్షాన పోరాడింది! నిజానికి మానవాధములకు నాయకత్వం వహించి, మానవజాతి వర్ధిల్లాలి అని అరిచింది కూడా స్నోబాలే! కొన్ని జంతువులకు జ్ఞాపకం ఉన్నంత వరకూ స్నోబాల్ వీపున ఉన్న గాయాలు- నెపోలియన్ పంటి గాట్లు!

ఆ వేసవిలో కొన్నాళ్లపాటు కనిపించకుండా పోయిన జోన్స్ పెంపుడు కాకి మోజెస్ తిరిగి వచ్చింది. అదింకా మారలేదు. అది ఏ పనీ చేయకుండా ఎప్పుడూ పంచదార పర్వతం గురించి విసుగు లేకుండా చెప్పేది.

అదో పెద్ద గెడకర్ర మీద కూర్చుని రెక్కలు విదిల్చి, వినేవాళ్లుంటే గంటల తరబడి మాట్లాడేది. 'అదిగో! పైన ఆ నల్లని మేఘం ఉంది చూశారా? దాని వెనకాలే ఉంది పంచదార పర్వతం! ఈ శ్రమ నుంచి మనలాంటి జీవులకు శాశ్వత విశ్రాంతి లభించే ప్రదేశమది' వేదాంతంలా చెప్పేదది.

ఒకసారి పైకెగిరినప్పుడు తాను మేఘాల అంచుల దగ్గర పంచదార ముక్కలు, పరిమళభరితమైన గడ్డీ, దాణా

## ఫొటో సరే, నవ్వులే కష్టం!



సిమ్లాలో 1946లో కాబినెట్ మిషన్ సంప్రదింపులు విఫలమైన తర్వాత బ్రిటిష్ రాయబారి క్రిప్స్ తనకు హేక్‌హ్యాండిస్తూ నవ్వుతూ ఫోటోదిగాలని నెహ్రూను అభ్యర్థించారు. దానికి నెహ్రూ 'షేక్‌హ్యాండ్ సంగతేమోగానీ నవ్వుల విషయమైతే ఆలోచించాల్సిందే.. అవి మీ ప్రపోజల్స్‌ను బట్టే ఉంటాయి. అంచేత నేను వాటికి గ్యారంటీ ఇవ్వలేను' అన్నారు.

పడివుండటం చూశానని నమ్మకంగా చెప్పేది. చాలా జంతువులు ఇదంతా నమ్మేవి. వాటికిప్పుడు తమ జీవితమంతా ఆకలి, శ్రమలతో నిండి ఉందనిపించేది. అలాంటప్పుడు దీనికన్నా మంచిదైన మరో సుందర ప్రపంచం ఉండటంలో ఆశ్చర్యమేముంది?

అయితే మోజెస్‌తో పందుల ప్రవర్తన మాత్రం వాటికి ఆశ్చర్యం కలిగించింది. పందులన్నీ ఈ పంచదార పర్వతాలు అభూత కల్పనలని ఈసడించుకునేవి. అయితే మోజెస్ పనేమీ చేయకున్నా ప్రతి రోజు దానికి గుక్కెడు బీరు ఇచ్చి మరీ అది అక్కడుండేందుకు అనుమతించాయి.

★ ★ ★

కాలుకు తగిలిన గాయం మానగానే బాక్సర్ ఎప్పటికన్నా ఎక్కువ పనిచేయడం ప్రారంభించింది. బాక్సరే కాదు, ఆ ఏడాది ప్రతి జంతువూ బానిసకన్నా ఎక్కువగా కష్టపడింది. వ్యవసాయమూ, గాలి యంత్రం కట్టడమే కాకుండా.. పంది పిల్లలకు పాఠశాల నిర్మాణం కూడా వాటి పాలబడింది. ఒక్కో రోజు తిండి లేకుండా అన్నేసి గంటలు పని చేయడం వాటికి అసాధ్యమనిపించేది. అయినా బాక్సర్ మాత్రం మడమ తిప్పలేదు. అది చెప్పే మాటల్లో గానీ, చేసే పనిలోగానీ తన శక్తి ఉడిగిందని తెలియనిచ్చేది కాదు. చూపులకు మాత్రం దాని రూపులో మార్పు వచ్చింది. వెన్నులో మెరుపు తగ్గింది. వెనుక భాగం కొద్దిగా కుంచించుకుపోయింది.

వసంత రుతువులో కొత్త గడ్డి వచ్చేసరికి బాక్సర్ పుంజుకుంటుందని మిగతా జంతువులు దానిని హుషారు చేసేవి. అయితే వసంతకాలం వచ్చి పోయింది. కానీ బాక్సర్ మాత్రం పుంజుకోలేదు. అది కేవలం పట్టుదల మీదే పని చేస్తోంది. దానికి ఇప్పుడు పెద్ద గొంతు లేకున్నా బిగించిన దాని పెదాలే నేనింకా ఎక్కువ కష్టపడతాను అని తెలిపేవి. క్లోవర్, బెంజిమన్‌లు మరోసారి దానిని హెచ్చరించాయి. కానీ బాక్సర్ లెక్కచేయలేదు. ఈ లోగా దాని పన్నెండవ పుట్టినరోజు దగ్గరకొచ్చింది. తాను పదవీ విరమణ చేసేలోగా వీలైనన్ని ఎక్కువ రాళ్లను పోగుచేయాలనేది బాక్సర్ లక్ష్యం!

హఠాత్తుగా ఓ సాయంకాలం బాక్సర్‌కు జరగరానిదేదో జరిగిందనే వార్త వచ్చింది- ఓ పెద్ద బండరాయిని లాక్కురావడానికి వెళ్లిన బాక్సర్ పక్కకు పడిపోయి లేవలేని స్థితిలో ఉంది. జంతువులన్నీ బాక్సర్ పడిన చోటుకి పరుగు తీసాయి. బాక్సర్ అక్కడ తలెత్తలేని స్థితిలో ఉంది. దాని చూపులు మసకబారాయి. వళ్లంతా చెమటలు పట్టాయి. దాని నోటివెంట చిన్న రక్తపు ధార. క్లోవర్ దాని పక్కనే మోకాళ్లపై కూర్చుని ఉంది.

'బాక్సర్! ఏమైంది నీకు? ' క్లోవర్ గాభరాగా అడిగింది.

'నాకు ఊపిరాడ్డం లేదు' బలహీనంగా నవ్వింది బాక్సర్. 'ఫర్వాలేదు. నేను లేకుండా కూడా మీరీ కట్టడం పూర్తి చేస్తారని నేను ఆశిస్తున్నాను. ఇప్పటికే ఇక్కడ చాలా రాయి పోగుపడింది. ఇంకో నెలలో నా పదవీ విరమణ ఉంది. నిజానికి నేనా రోజు కోసం ఎంతగానో ఎదురు చూస్తున్నాను. ఇక బెంజిమన్ కూడా ముసలిదవుతోంది. కనుక దాన్ని కూడా పని నుంచి తప్పిస్తే నాకు తోడుగా ఉంటుంది'.

'మనకు వెంటనే సాయం కావాలి' క్లోవర్ తొందర పెట్టింది. 'ఎవరైనా వెళ్లి స్క్వీలర్‌కు చెప్పండి' అంది. కొన్ని జంతువులు ఈ వార్తను స్క్వీలర్‌కు చెప్పడానికి పరుగుతీసాయి.

బాక్సర్ పక్కన బెంజిమిన్ మౌనంగా కూర్చుని తన తోకతో దాని మీద ఈగలు వాలకుండా విసరసాగింది. పావుగంట తర్వాత స్క్వీలర్ వచ్చింది. అది రావడంతోటే బాక్సర్‌పై ఎంతో జాలి చూపించింది. తనకత్యంత విశ్వాసపాత్రురాలైన బాక్సర్‌ కు ఎదురైన ఆపదకు కామ్రేడ్ నెపోలియన్ మనసు ఎంతో తల్లడిల్లిందనీ, అప్పటికే బాక్సర్‌ను విల్లింగ్‌డన్‌లోని ఓ ఆసుపత్రికి పంపే ఏర్పాట్లు జరిగాయనీ చెప్పింది.

ఇది జంతువులకు కాస్త అసహజంగా కనిపించింది. మోలీ, స్నోబాల్, మోజెస్ మినహా ఏ జంతువూ ఇంతవరకూ క్షేత్రం దాటలేదు. ఇప్పుడు జబ్బుపడిన బాక్సర్‌ను ఒంటరిగా మనుషుల చేతుల్లో ఉంచడానికి వాటికి మనస్కరించలేదు. అయితే విల్లింగ్‌డన్‌లోనే పశువుల డాక్టర్ బాక్సర్‌కు బాగా వైద్యం చేయగలడని స్క్వీలర్ వాటిని ఒప్పించింది.

అరగంట గడిచాక బాక్సర్ కాస్త తేరుకుని, నెమ్మదిగా లేచి నిలబడి, కుంటుతూ తన పాకకేసి నడిచింది. అప్పటికే క్లోవర్, బెంజిమన్‌లు దాని కోసం గడ్డితో పరుపు సిద్ధం చేసి ఉన్నాయి.

ఆ తర్వాత రెండు రోజులూ బాక్సర్ తన పాకకే పరిమితమైంది. వరాహాలు మందుల అరలో దొరికిన ఏదో రంగుల ద్రవాన్ని పంపాయి. క్లోవర్ ఆ మందును రోజూ రెండుపూటలా బాక్సర్ చేత తాగించేది. ఎప్పట్లాగే బెంజిమన్ తన తోకతో ఈగలు తోలేది.

జరిగిన దానికి విచారించవద్దని బాక్సరే ఆ రెంటికీ ధైర్యం చెప్పేది. తనకు తొందరగా నయమైతే ఇంకో మూడేళ్లు బతుకుతాననీ, ఆ సమయమంతా క్షేత్రంలోని పచ్చిక బయళ్లలో హాయిగా నెమరేస్తూ గడుపుతాననీ ఉత్సాహంగా చెప్పేది. జీవితంలో తనకు మొదటిసారి తీరుబాటు దొరుకుతున్నందువల్ల చదువుకొని, బుద్ధిని పెంచుకోవాలనుకుంటున్నట్లు చెప్పింది.

బెంజిమన్, క్లోవర్‌లు పనిగంటల తర్వాతే బాక్సర్ దగ్గరకు రాగలిగేవి. బాక్సర్‌ను తీసుకుపోయే వాహనం మధ్యాహ్నం సమయంలో వచ్చింది. ఆ సమయంలో జంతువులన్నీ ఒక వరాహం ఆధ్వర్యంలో కలుపు తీస్తున్నాయి. బెంజిమన్ తమకేసి ఉరుకులు, పరుగులతో రావడం చూసి

## కొత్తగాలి...

**కళ్లు చెదిరేంత**
**'కూడ' బెట్టాడు**
**కన్నోళ్లకు మాత్రం**
**'కూడు' పెట్టడం మరిచాడు**

– వాడపర్తి వెంకటరమణ,
విశాఖపట్నం

## చాలని ప్రతిభ

ప్రఖ్యాత రష్యను రచయిత లియో టాల్‌స్టాయ్‌కి కొంతకాలంపాటు నాటకాలంటే మంచి ఆసక్తి ఉండేది. ఒకనాటి సాయంకాలం టాల్‌స్టాయ్ మాస్కోలోని థియేటరుకు నాటక ప్రదర్శన తిలకించటానికి వెళ్ళాడు. ఆ రోజు యూజిన్ లాబిచ్ రాసిన 'ఏన్ ఇటాలియన్ స్ట్రాహేట్' అనే కామెడీ ప్రదర్శింపబడుతున్నది. ఆ సమయంలో ఆయన 'ది ఫ్రూట్స్ ఆఫ్ ఎన్‌లైటెన్‌మెంట్' అనే కామెడీ రాస్తున్నారు. విశ్రాంతి సమయంలో పరిచయస్థుడైన ఒక ప్రొఫెసరు కనబడ్డాడు. ఇటువంటి చౌకబారు నాటకానికి తను రావటం టాల్‌స్టాయ్ కంట పడ్డందుకు కించపడుతూ 'నువ్వు కూడా ఈ పిచ్చి నాటకం చూడటానికి వచ్చావా?' అని ప్రశ్నించాడు.



'ఇటువంటిదేదో రచన చెయ్యాలని నా జీవితమంతా కలలు కన్నాను. కానీ నాకు తగిన ప్రతిభ లేకపోయింది' అని జవాబిచ్చాడు టాల్‌స్టాయ్.





జంతువులన్నీ ఆశ్చర్యపోయాయి. బెంజిమన్ అంత ఆందోళనగా కనిపించడం అదే మొదటిసారి. బెంజిమన్ పరిగెత్తగా చూడడం కూడా మొదటిసారే.

'తొందరగా రండి. బాక్సర్‌ను తీసుకుపోతున్నారు' బెంజిమన్ ఆయాసపడుతోంది.

జంతువులన్నీ పని వదిలేసి భవనం వైపుకు పరుగుతీశాయి. భవనం ముందు ఓ పెద్ద గుర్రపు బండి నిలబడి ఉంది. బండికి అటూ ఇటూ ఏదో రాసి ఉంది. తలపై టోపీ ధరించిన దొంగ చూపుల వాడొకడు దానిని తోలుతున్నాడు. అప్పటికే బాక్సర్ పాక ఖాళీగా ఉంది.

జంతువులన్నీ బండిని చుట్టుముట్టాయి. 'బాక్సర్! గుడ్ బై! తొందరగా కోలుకుని రా!' ఉత్సాహంగా అరిచాయవి.

'మందబుద్ధుల్లారా!' బెంజిమన్ వాటి చుట్టూ గంతులేస్తూ భూమిని కాళ్లతో తన్నింది. 'బండి మీద ఏం రాసిందో చదవలేరా?'

అప్పుడు జంతువులన్నీ ఆగిపోయాయి. కొద్దిసేపక్కడ నిశ్శబ్దం ఆవహించింది. మురియల్ అక్షరాలను కూడబలుక్కుని చదవడం మొదలుపెట్టింది. బెంజిమన్ దాన్ని తోసేసి గట్టిగా చదివింది. 'ఆల్‌ఫ్రెడ్ సిమ్మండ్స్! గుర్రాల వధశాల, విల్లింగ్‌డన్! కుక్కలకు మాంసం మరియు ఎముకలు సప్లై చేసేవారు.'

'బాక్సర్‌ను కసాయి కొట్టుకు తరలిస్తున్నారు.'

జంతువులన్నీ ఒక్కసారిగా హాహాకారాలు చేసాయి. అదే క్షణంలో బండిని తోలేవాడు గుర్రాలను అదిలించాడు. బండి పరుగు పెట్టింది. జంతువులన్నీ బిగ్గరగా అరుస్తూ, దాన్ననుసరించాయి. క్లోవర్ అన్నింటినీ దాటుకుని ముందుకెళ్లింది.

బండివేగం పుంజుకుంది. క్లోవర్ మొరాయిస్తున్న కండరాలతో పోరాడుతూ

దాన్నందుకోవాలని ప్రయత్నించింది కానీ సఫలం కాలేదు.

'బాక్సర్! బాక్సర్!' కేకలు పెట్టింది క్లోవర్.

అదే సమయంలో బయటి అరుపులకు లోపల ఉన్న బాక్సర్ వెనకాల ఉన్న కంత గుండా బయటకు చూసింది.

'బాక్సర్! త్వరగా బయటకు దూకు! నిన్ను చంపడానికి తీసుకుపోతున్నారు'. జంతువులన్నీ అరవసాగాయి.

అయితే అప్పటికే బండివేగం పుంజుకుంది. రాన్రానూ బండికీ, జంతువులకూ మధ్య దూరం పెరిగిపోయింది. వాటి మాటలు బాక్సర్ బుర్రకెక్కాయో లేదో మరి! ఓ క్షణం తర్వాత కంత గుండా కనిపిస్తున్న దాని మొహం మాయమైంది. ఆ తర్వాత బండి లోపల కాళ్లతో తలుపులను తంతున్న శబ్దం వినిపించింది. బాక్సర్ బయటపడడానికి ప్రయత్నించింది. ఒకప్పుడయితే ఆ దెబ్బలకు బండి తలుపులు తుక్కు తుక్కయివుండేవి. ఇప్పుడా దెబ్బల్లో సత్తువ లేదు.

కొద్దిసేపట్లోనే ఆ చప్పుడు తగ్గిపోయి, బండి దూరమైంది. కొన్ని జంతువులు సింహద్వారాన్ని మూసెయ్యమని సైగచేసాయి కానీ.. ఈ లోపు బండి ఆ ద్వారం గుండా దూసుకుపోయి, చివరికి కనుమరుగైంది. ఆ తర్వాత బాక్సర్ జంతువులకి ఎన్నడూ కనిపించలేదు.

★ ★ ★

మూడ్రోజుల తర్వాత, ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ బాక్సర్ విల్లింగ్‌డన్‌లోని ఓ ఆసుపత్రిలో చనిపోయిందన్న వార్తను తెచ్చింది స్క్వీలర్. బాక్సర్ చివరి ఘడియల్లో దాని పక్కనే ఉన్నట్లు తెలిపింది.

'ఇంతగా కదిలించే సంఘటన నాకెన్నడూ ఎదురుకాలేదు'. స్క్వీలర్ తన కాలెత్తి దాంతో కన్నీరు తుడుచుకుంది.

'మరణించే ముందు కూడా అది బలహీన మైన గొంతుతో గాలియంత్రం పనిచే యడం చూసాక చనిపోతే బాగుండునని కోరుకుంది. జంతుక్షేత్రం వర్ధిల్లాలి! కామ్రేడ్ నెపోలియన్ వర్ధిల్లాలి! నెపోలి యన్ మాట ఎప్పుడూ సరైనదే!'- ఇవీ తన తుది పలుకులు.

స్క్వీలర్ ఓ క్షణం పాటూ మౌనం వహించి జంతువులు తన మాటలు నమ్ముతున్నాయా లేదా అని అటుఇటు అనుమానంగా చూసింది. బాక్సర్‌ను ఆసు పత్రికి తరలించే ముందు ఇక్కడో దుర్మార్గ మైన పుకారొకటి వచ్చిందట. బాక్సర్‌ను తీసుకుపోయిన బండి మీద 'గుర్రపు వధ శాల' అని రాసి ఉండటం చూసాయట కొన్ని జంతువులు. అవి బాక్సర్‌ను కసాయి కొట్టుకు తోలుకుపోతున్నారని భ్రమించాయి. ఏ జంతువయినా అంత కన్నా మూర్ఖంగా ఆలోచించగలదా? అవి తన నాయకుడు నెపోలియన్‌ను అర్థం చేసుకున్నది ఇంతేనా? నిజానికా బండిని పశువుల డాక్టర్ ఒక మాంసం కొట్టువాడి దగ్గర కొన్నారు. ఆ పేరునింకా తుడిచేయ కపోవడం వల్ల ఈ అపార్థం జరిగింది.

జంతువులకు ఇది వినగానే ఎంతో భారం దిగినట్లయింది. ఇక స్క్వీలర్ బాక్స ర్‌కు ఏర్పాటుచేసిన మెత్తని పరుపు గురించీ, అది ఆసుపత్రిలో పొందిన వైద్యం గురించీ, దాని ఖరీదైన మందులకు నెపోలియన్ క్షణంకూడా ఆలోచించకుండా చెల్లించిన డబ్బు గురించీ చెబుతుంటే వాటి సందేహాలన్నీ పటాపంచలయ్యాయి. బాక్సర్ మరణం పట్ల వాటి విచారం తగ్గింది. కనీసం చావులోనైనా అది సుఖ పడిందని జంతువులు తృప్తిచెందాయి.

ఆ తర్వాత ఆదివారం బాక్సర్ స్మృత్యర్థం నెపోలియన్ ఒక చిన్న ఉపన్యా సమిచ్చింది. కొద్ది రోజుల తర్వాత బాక్స ర్‌ను స్మరించుకునేందుకు పందులు ఓ విందును కూడా ఏర్పాటుచేసాయి. నెపోలి యన్ బాక్సర్ ఉపయోగించే రెండు వూత పదాలతో తన ఉపన్యాసం ముగించింది. 'నేను మరింత కష్టపడతాను, నెపోలియన్ మాట ఎల్లప్పుడూ సరైనదే!' బాక్సర్ ఆత్మ శాంతి కొరకు ప్రతి జంతువూ ఈ రెండు వాక్యాలను తమవిగా చేసుకోవాలంది.

విందురోజు విల్లింగ్‌డన్ నుంచి ఓ బండి వచ్చి ఓ పెద్ద చెక్కపెట్టెను దించి పోయింది. ఆ రాత్రి జంతువులకు భవం తిలోంచి పెద్దగా కేకలు, పాటలు వినిపిం చాయి. ఆ తర్వాత పెద్ద గలభా.. చివరికి గ్లాసులు భళ్లుమన్న శబ్దంతో అక్కడ నిశ్శబ్దం అలముకుంది. మరుసటి రోజు మధ్యాహ్నం వరకూ ఆ భవంతిలోంచి ఒక్క వరాహం కదల్లేదు. పందులు ఎలా గోలా డబ్బు సంపాదించి, మళ్లీ మద్యం తెప్పించుకున్నాయని జంతువులకు మా త్రం అర్థమయ్యింది.




**ఏ**ళ్లు గడుస్తున్నాయి. తక్కువ జీవిత కాలం గల జంతువులూ, పక్షులూ మట్టిలో కలిసి వాటి పిల్లలొచ్చాయి పనిలోకి. ఇప్పుడు క్లోవర్, బెంజిమన్, మోజెస్, మిగతా పందులకు తప్ప మరే జంతు వుకూ తిరుగుబాటు ముందు రోజులు గుర్తులేవు.

# ఆస్పత్రిలో క్రిస్టమస్!




కనెక్టికట్ రాష్ట్రంలోని సెయింట్ ఆంథోనీ హాస్పిటల్‌లో బార్బరా క్లెన్ నర్సుగా పని చేస్తోంది. ఆ రోజు క్రిస్టమస్. తానెలాగూ ఇంటికి దూరంగా ఉన్నందున కనీసం స్నేహితురాలైనా కుటుంబంతో పండుగ చేసుకోవాలని, ఆమె స్థానంలో బార్బరా డ్యూటీ వేయించుకుంది. పీడియాట్రిక్ వార్డ్‌లో డ్యూటీ వేశారు. సాయంత్రం నాలుగున్నరకి ఐదురుగు రోగులు ఆమె వార్డ్‌లో చేరారు. వారిలో నలుగురు నాలుగేళ్ల నుంచి పదేళ్లలోపు పిల్లలు, ఐదో వ్యక్తి వారి తల్లి.

"మీ కందరికీ ఒంట్లో బావుండ లేదా? " వాళ్లని ఎగాదిగా చూస్తూ అడిగింది.

"అవును" ఆ పిల్లల తల్లి కొద్దిగా తలదించుకుని చెప్పింది.

ఇద్దరు పిల్లలు తలనొప్పి అన్నారు. అయితే వారికి టెంపరేచర్ లేదు. మరో ఇద్దరు పిల్లలు చెవినొప్పి అన్నారు. అయితే చిన్నవాడు ముందు కుడిచెవి అని, తర్వాత ఎడమచెవి చూపించాడు. తల్లికి దగ్గు వస్తోందన్నది కాని, ఊపిరి తిత్తులు క్లియర్‌గా ఉన్నాయి.

వారికెలాంటి రోగం లేదని బార్బరా నిర్ధారణకు వచ్చింది. అయితే ఏ రోగినీ చికిత్స చేయకుండా వెనక్కు పంపకూడదన్న హాస్పటల్ పాలసీని అనుసరించి వాళ్ళని వెనక్కి పంపలేదు. ఫారం ఫిలప్ చేస్తూ చిరునామా అడిగితే అదీ లేదు. రోడ్డుమీద జీవించే నిర్భాగ్యులు వాళ్లు. వారంతా ఒకే కుటుంబ సభ్యులు. వారు హాస్పటల్ స్టాఫ్ ఏర్పాటు చేసిన క్రిస్టమస్ ట్రీ దగ్గరకి వెళ్లారు. అది మెడికల్ ఎమర్జెన్సీ కాదని, క్రిస్టమస్ ఎమర్జెన్సీ అని బార్బరా గ్రహించింది. పండగ జరుపుకోడానికి వాళ్లు హాస్పటల్‌కి వచ్చారని ఊహించింది. బార్బరా హాస్పటల్‌లోని ఆరెంజ్‌లు, ఆపిల్స్‌లను చిన్న సంచీలో నింపి వాటిని క్రిస్టమస్ చెట్టుకి కట్టింది. పీడియాట్రిక్ వార్డ్‌లోని క్రేయాన్స్, కలరింగ్ బుక్స్‌ను ఆ పిల్లలకి బహుమతులుగా ఇచ్చింది. పాలు కాచి కోకో పౌడర్, చక్కెరవేసి ఆ ఐదుగురికీ ఇచ్చింది. డాక్టర్లకి వచ్చిన బహుమతుల ఖాళీ రేపర్‌లతో పళ్లను ప్యాక్‌చేసి తల్లికి బహుమతిగా ఇచ్చింది. చిన్నపిల్లవాడిని క్రిస్టమస్ కరోల్ పాడమనింది. పిల్లలంతా కరోల్స్‌ని పాడారు. బ్రెడ్‌కి వెన్నరాసి, చక్కెర చల్లి వాళ్లకి డిన్నర్‌గా పెట్టింది. ఆ తల్లి తన క్రిస్టమస్ అనుభవాలను వివరించింది. తన దగ్గర ఉన్న డబ్బంతా హాస్పిటల్‌లో ఉన్న భర్తకోసం ఖర్చు పెట్టింది. కానీ అతడు చనిపోయాడు. ఫలితంగా వాళ్లు వీధుల పాలయ్యారు.



మూడుగంటల సేపు నర్సులు, రోగుల మధ్య క్రిస్టమస్ సెలబ్రేషన్స్ చేసుకున్నాక వెళ్లిపోయారు. ఆరేళ్ళ పిల్ల బయటకి వెళ్తూ బార్బరాతో అంది, "నేను పెద్దయ్యాక నర్స్ అయి, మీలా సేవ చేస్తాను" అని.

వైద్యం కోసం సర్వం కోల్పోయిన ఆ కుటుంబం ఓ క్రిస్టమస్‌ని హాస్పిటల్‌లో జరుపుకోవడం విశేషం.



మురియల్, బ్లూబెల్, జెస్సీ, ఫించర్‌లు చనిపోయాయి. జోన్స్ కూడా అక్కడికి దూరంగా వున్న గ్రామంలో ఓ మద్యశాలలో మరణించాడు. స్నోబాల్ ఇప్పుడెవరికీ గుర్తులేదు. బాగా దగ్గరి వాటికి తప్ప బాక్సర్ కూడా ఎవరికీ గుర్తులేదు. క్లోవర్ ముసలిదయిపోయింది. దానినిప్పుడు కీళ్ల నొప్పులు, కళ్ల కలకలు పీడిస్తున్నాయి. అది తన పదవీ విరమణ వయస్సు దాటి రెండేళ్లయిపోయింది. విచిత్రంగా అక్కడ ఏ జంతువూ పదవీ విరమణ చేయలేదు. అలా చేసిన జంతువులకు పొలంలో ఓ మూలన పచ్చగడ్డిని కేటాయించాలన్న ప్రతిపాదన ఏనాడో మూలపడింది.

నెపోలియన్ ఇప్పుడు బాగా బలిసి, నడి వయసులో ఉంది. స్క్వీలర్ ఎంత లావైందంటే, పక్కకు తిరిగి చూడాలంటే చాలా కష్టమవుతోంది. బెంజిమన్ మాత్రం కొద్దో గొప్పో అలాగే ఉంది. బాక్సర్ చనిపోయాక అది చిర్రుబుర్రులాడుతూ మరింత ముభావంగా తయారైంది.

ఇప్పుడు జంతుక్షేత్రంలో మరికొన్ని జంతువులు చేరాయి. విప్లవం గురించి లీలగా జ్ఞాపకం ఉన్న జంతువులకు మరికొన్ని జంతువులు జన్మించాయి. అసలు తిరుగుబాటు గురించి విని ఎరగని జంతువులు కొన్ని కొని తీసుకురాబడ్డాయి.



క్లోవర్ కాక ఇప్పుడక్కడ మరో మూడు గుర్రాలున్నాయి. అవి చాలా బలిష్ఠంగా, ఎల్లప్పుడూ పనిచేయడానికి సిద్ధంగా ఉండేవి. అవి చాలా స్నేహజీవాలు. కానీ చాలా మందబుద్ధులు. క్లోవర్‌ను అవి పితృసమానంగా గౌరవించేవి. తిరుగుబాటు గురించీ, జంతువాదం గురించీ క్లోవర్ చెబుతుంటే అవి చెవులు రిక్కించుకుని వినేవి- కానీ వాటికే మాత్రం అర్థమయ్యేదో మరి!

జంతుక్షేత్రం ఇప్పుడు సమృద్ధిగా కళకళలాడుతోంది. పనులన్నీ చక్కగా నిర్వర్తించబడుతున్నాయి. పిల్కింగ్‌టన్‌కు చెందిన మరో రెండు పొలాలను కొని జంతుక్షేత్రంలో కలుపుకుంది నెపోలియన్. చివరికెలాగో గాలియంత్రం కట్టడం కూడా పూర్తయింది. కానీ దాన్ని విద్యుత్ ఉత్పత్తికి ఉపయోగించడం లేదు. పిండి పట్టడానికి ఉపయోగిస్తున్నాయి. జంతువులిప్పుడు మరో గాలియంత్రం నిర్మాణంలో తలమునకలుగా ఉన్నాయి. అది పూర్తయ్యాక విద్యుత్ ఉత్పత్తి పరికరాలు తెచ్చిపెడతాయని వినికిడి. అయితే జంతువుల పాకల్లో పంఖాలు, వేణ్నీళ్లు, చన్నీళ్లు, మూణ్నాళ్ల పనిదినాలూ- వీటి గురించి స్నోబాల్ కన్న కలలను ఇప్పుడేవీ గుర్తుచేసుకోవడంలేదు. అలాంటి భావాలు జంతువాదానికి విరుద్ధమని నెపోలియన్ ఎన్నడో ప్రకటించింది. నిజమైన తృప్తి ఎక్కువ కష్టపడి, మితంగా భుజించడంలోనే ఉందంది.

క్షేత్రంలో కుక్కలు, పందుల సంఖ్యతో పాటూ కొత్త భవనాల సంఖ్య కూడా పెరిగింది. అవి రెండూ తమ స్వాభావికమైన పనులు చేయడం లేదంటే అందుకు కారణం ఉంది. ఉదాహరణకు స్క్వీలర్‌కు - పనులను పర్యవేక్షించడానికి, క్షేత్రాన్ని క్రమపద్ధతిలో నడపడానికీ ఎంతకీ తరగని పని ఉండేది. అదెప్పుడూ దేన్నైనా విడమరిచి చెప్పడానికి బద్ధకించేది కాదు. ఈ పనిని వేరే జంతువులు చేయలేవు. పందులు ఫైళ్లు, రిపోర్టులు, మినిట్స్- వీటి మీద చాలా శ్రమ ఖర్చు చేయాల్సివచ్చేది. ఇవన్నీ పెద్ద పెద్ద కాగితాల మీద రాసి నింపాలి. ఆ రాయడం పూర్తికాగానే ఆ కాగితాలను పొయ్యిలోవేసి తగలబెట్టాలి. క్షేత్రం అభివృద్ధికి ఈ తతంగమంతా అత్యంత ఆవశ్యకమని స్క్వీలర్ ఉవాచ. ఇక కుక్కలకు నెపోలియన్ రక్షణ బాధ్యత ఉండనే ఉంది.

మిగతా జంతువుల విషయానికి వస్తే, వాటికి గుర్తున్నంత వరకూ వాటి జీవి

తంలో ఏ మార్పూ లేదు. అవి సాధారణంగా ఆకలితో ఉండేవి. గడ్డిమీద పడుకునేవి. చెరువులో నీళ్లు తాగేవి. పొలాల్లో కష్టపడేవి. చలికాలంలో చలి వల్లా, ఎండాకాలంలో ఈగల వల్లా బాధపడేవి.

కొన్ని ముసలి జంతువులు అప్పుడప్పుడూ పరిస్థితులు ఇప్పుడు బాగున్నాయా, లేక జోన్స్ కాలంలో బాగున్నాయా అని తేల్చుకోవడానికి బుర్ర బద్దలు కొట్టుకునేవి. అయితే స్క్వీలర్ ఇచ్చే లెక్కలు, పట్టికలు మినహా పోల్చడానికి వాటికే ఆధారమూ లేదు. దాని ప్రకారం తమ జీవన ప్రమాణాలు చాలా మెరుగుపడ్డాయి. అయితే ఇప్పుడు జంతువులకు అలాంటి వాటి గురించి ఆలోచించడానికి కూడా పెద్దగా సమయం దొరకడం లేదు. కేవలం ముసలి బెంజిమన్‌కు మాత్రమే ప్రతి విషయం గుర్తు.

పరిస్థితులు అప్పుడూ ఇప్పుడూ ఒకేలా గున్నాయనీ- అదే ఆకలీ, అదే శ్రమా, అదే నిరాశ- జీవిత పరమార్థం ఇదే అని నిర్వచించేది బెంజిమన్.

అయినా సరే- జంతువులెన్నడూ ఆశ కోల్పోలేదు. జంతుక్షేత్రంలో సభ్యులయినందువల్ల వచ్చే గౌరవం, ప్రత్యేకతలను అవి ఒక్క క్షణం కూడా మరిచిపోలేదు. మొత్తం ఇంగ్లండ్‌లో జంతువులచే నడపబడుతున్న ఏకైక క్షేత్రం తమదే. పెద్దా చిన్నా, కొత్తాపాతా జంతువులన్నిటికీ ఈ ఆలోచనకే ఒళ్లు పులకరించేది. తుపాకి మోగి, జెండా రెపరెపలాపడిన ప్రతిసారీ వాటి హృదయాలలో గర్వం పొంగిపొరలేది. అప్పుడు ధీరోదాత్తమయిన పాత రోజులు, జోన్స్ పారిపోవడం, ఏడు శాసనాలు లిఖించడం, మానవులను పోరాటాలలో ఓడించడం- ఇవన్నీ తప్పక ప్రస్తావిం

చబడేవి.

పాత కలలూ, కోరికలూ ఇప్పటికీ మాయలేదు. ఇంగ్లండ్‌లో ఏ మానవాధముల పాదధూళి సోకని పచ్చని పొలాల గురించి జంతువులిప్పటికీ కలలు కంటున్నాయి. ఆ రోజు ఎప్పుడో ఓసారి రావడం ఖాయం- దానికి చాలా సమయం తీసుకోవచ్చుగాక! స్వేచ్ఛాగీతం ఇప్పటికీ అక్కడా ఇక్కడా కూనిరాగాల రూపంలో బయటపడుతూనే ఉంది. దేనికీ ఆ పాట గట్టిగా పాడే ధైర్యం లేకపోయినా క్షేత్రంలోని ప్రతి జంతువుకూ ఆ పాట కంఠతా వచ్చు.

తమ జీవితం కష్టంగా ఉండొచ్చు. తమ కోరికలన్నీ తీరకపోవచ్చు. అయినా తాము మిగతా జంతువుల్లాంటివి కావనే ఆలోచన వాటికి ఊరటనిచ్చేది. తాము ఆకలిగా ఉన్నామంటే అది తిండంతా మానవులు మింగేయడం వల్లకాదు. కష్టాలున్నా వాటి ప్రతిఫలం తమదే! అక్కడే జంతువూ రెండు కాళ్ళమీద నడవదు. ఒక జంతువు మరో జంతువును దొరా అనదు. అక్కడ జంతువులన్నీ సమానం.

★ ★ ★

ఓ ఉదయాన స్క్వీలర్ గొర్రెలను తనతోపాటూ క్షేత్రం చివర్న కలుపు మొక్కలు పెరిగిన ప్రదేశానికి తీసుకుపోయింది. ఆ రోజంతా గొర్రెలు స్క్వీలర్ కనుసన్నలలో గడ్డిమేసాయి. సాయంత్రం గొర్రెలను అక్కడే ఉంచి స్క్వీలర్ మాత్రం తిరిగి వచ్చింది. అలా గొర్రెలు ఆ వారమంతా అక్కడే ఉన్నాయి.

స్క్వీలర్ గొర్రెలకు తానో కొత్త పాటను నేర్పిస్తున్నాననీ, దానికొ్కంచెం ఏకాంతం అవసరమనీ అంది.

గొర్రెలు తిరిగి వచ్చిన సాయంత్రం జంతువులన్నీ పనినుంచి తిరిగి వస్తుంటే వాటికి పెరట్లోంచి ఓ భయానకమైన సకిలింపు వినిపించింది. జంతువులన్నీ ఉరుకులు పరుగుల మీద పెరట్లోకి చేరుకున్నాయి. క్లోవర్ కంటపడిన దృశ్యాన్ని అవీ చూశాయి.

అక్కడో పంది తన వెనక కాళ్లమీద నడుస్తోంది! అది స్క్వీలర్!

తన బరువైన శరీరాన్ని కాళ్లు మోయడం కష్టంగా ఉన్నా, అది కచ్చితమైన సమతుల్యతతో, కొద్దిగా ఎబ్బెట్టుగా.. పెరట్లో అటు ఇటు తిరుగుతోంది.

కొద్ది సేపటికి భవనంలోంచి పందులన్నీ ఒకదాని వెంట మరొకటి బైటికి వచ్చాయి. అవన్నీ వెనుక కాళ్లమీద నిల

## అక్టోబరు-2010
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **బి.యస్.రంగ**
   - సుబ్బారావు పేట, తాడేపల్లిగూడెం
2. **బి.శ్రీనివాసులు రెడ్డి**
   - బాలసముద్రం, హన్మకొండ
3. **బండ్ల సుబ్రహ్మణ్యం**
   - మంగళగిరి, గుంటూరు జిల్లా
4. **ఎ.మానస**
   - యర్రగుంట్ల, కడప జిల్లా
5. **ఇవటూరి శారదాదేవి**
   - పోడూరు, ప.గో.జిల్లా

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. పార్వతమ్మ | 6. చిక్కవీర రాజేంద్ర |
| 2. పావురం | 7. జయంతి వెంకటరమణ |
| 3. ఆంజనేయులు | 8. పాపాయమ్మ |
| 4. వెంకటాచలం | 9. పానకాలు |
| 5. బాలసుబ్రమణ్యం | 10. మొక్కపాటి నరసింహశాస్త్రి |

బడి నడుస్తున్నాయి! కొన్ని పందులు మిగతా వాటికన్నా బాగా నడుస్తున్నాయి. మరికొన్ని కట్టెల సాయంతోనయితే మరింత బాగా నడవగలిగేవేమో! మొత్త మ్మీద అన్ని పందులూ జయప్రదంగా రెండు కాళ్లమీదా నడుస్తున్నాయి.

చివరగా.. కుక్కల భీకరమైన అరుపులు, చెవులు గింగిర్లు పడే కోడిపుంజు కూత మధ్య- గర్వంగా తల ఎత్తి, నిటారుగా నిల బడ్డ నెపోలియన్ వచ్చింది. అది తన నడుములో ఓ కొరడా దోపుకుని ఉంది.

చిక్కని నిశ్శబ్దం ఆవరించిందక్కడ. పందులు ఒకదాని వెనకొకటి నడుస్తుండ డాన్ని బిత్తరపోయి, భయభ్రాంతులైన జంతువులన్నీ ఒకదాన్నొకటి హత్తుకుని చూస్తున్నాయి. వాటికి ప్రపంచం అంతా తలకిందులుగా కనిపించసాగింది. కొద్దిసే పటి తర్వాత అవి నివ్వెరపాటు నుంచి తేరుకున్నాయి.

అవన్నీ కుక్కల భయాన్నధిగమించి, ఎన్ని కష్టాలెదురైనా నోరెత్తని అలవాటు నుంచి, విమర్శించడం చేతకానితనం నుంచి బయటపడి- అన్నింటికీ తెగించి ప్రతిఘటనా పూర్వకంగా తమ నిరసనను తెలుపాలనుకున్నాయి.

అదే సమయంలో స్క్వీలర్ సైగతో గొర్రెలన్నీ ఒక్కపెట్టున అరుపులు ప్రారం భించాయి- 'నాలుగు కాళ్లవి మంచివి, రెండుకాళ్లవి మరీ మంచివి' ఈ అరుపులు ఆగకుండా ఐదు నిమిషాల పాటు కొనసా గాయి. గొర్రెలన్నీ నోరు మూసుకుని మిగతా జంతువులు నోరు విప్పబోయేస రికి పందులన్నీ తిరిగి భవనంలోకి నడి చాయి.

క్లోవర్ తన మూతితో బెంజిమన్ భుజాన్ని తాకింది. దాని ముసలి కన్నులు ఇప్పుడు మరింత మసకబారాయి. అదేమీ మాట్లాడకుండా బెంజిమన్‌ను ఏడు శాస నాలు రాసి ఉన్నచోటికి తీసుకెళ్లింది.

'నా చూపు తగ్గిపోయింది. నేను యవ్వ నంలో ఉన్నప్పుడు కూడా అవి చదవలేక పోయాను. కానీ ఆ గోడ మీద అక్షరాలెం దుకో మునుపటిలా లేవు. ఆ ఏడు శాస నాలు పాతవేనా బెంజిమన్?'

ఆ ఒక్కసారికీ తన మౌనవ్రతాన్ని వీడిన బెంజిమన్ గోడమీద రాతను బయ టికి చదివింది. ఇప్పుడక్కడ కేవలం ఒక్క శాసనం మాత్రమే ఉంది- 'అన్ని జంతు వులూ సమానం. కొన్ని జంతువులు మిగతా వాటికన్నా ఎక్కువ సమానం'

ఆ మరుసటి రోజు పనులను పర్యవేక్షి స్తున్న పందులు నడుములో కొరడా దోపు కోవడం జంతువులకు ఆశ్చర్యం కలిగించ లేదు. పందులు వైర్‌లెస్ సెట్ కొన్నా యనీ, టెలిఫోన్ బిగించుకొన్నాయనీ, 'జాన్‌బుల్', 'డైలీ మిర్రర్' పత్రికలకు చందాలు కట్టాయని తెలిసినా ఆశ్చర్యమని పించలేదు.

పందులు దుస్తులు ధరించినా, తోటలో నెపోలియన్ నోటిలో పైపుతో కనిపించినా, నెత్తిన టోపీ, కాలికి బూట్లతో, పక్కన తన కిష్టమైన ఓ ఆడపందితో(అది జోన్స్ భార్య ధరించే తెల్లని పట్టు వస్త్రాలు వేసు కుంది) నడుస్తుండడం చూసినా జంతు

## కొత్తగాలి... 

**కోడి కూస్తే**
**తూరుపు తెల్లారు**
**కోడి కోస్తే మాత్రం**
**దాని బతుకే తెల్లారు**

– వి.శ్రీనివాసరావు,
విజయనగరం

వులు నోరు మెదపలేదు.

★ ★ ★

వారం తర్వాత జంతుక్షేత్రం ముందు కొన్ని బండ్లు వచ్చి ఆగాయి. చుట్టుపక్కల రైతులు కొందరిని తమ క్షేత్రం చూడాల్సిందిగా ఆహ్వానించాయి పందులు. రైతులు అంతా చూడడం, కనిపించిన ప్రతీ విషయానికీ విస్మయం వ్యక్తం చేయడం జరిగింది. గాలి యంత్రాన్ని చూసినవాళ్లు మరీ ఆశ్చర్యపోయారు.

ఆ సమయంలో జంతువులన్నీ పొలంలో మొహమెత్తకుండా, విరామం లేకుండా పనిచేస్తున్నాయి. వాటికి మనుషుల్ని చూసి ఎక్కువ భయపడాలో, లేక పందులను చూసి ఎక్కువ భయపడాలో అర్థం కాలేదు.

ఆ సాయంత్రం భవనంలోంచి పెద్దగా పాటలు, నవ్వులు వినిపించాయి. మానవులు, జంతువుల మిశ్రమ స్వరాలను విన్న జంతువులు అబ్బురపడ్డాయి. మొదటిసారిగా మానవులకు, జంతువులకు మధ్య సమానత్వం గురించి చర్చలు నడుస్తున్న సందర్భమది.

జరుగుతున్నది చూడాలనే ఉత్సుకతతో జంతువులన్నీ కూడబలుక్కుని మెల్లగా భవనంవైపు నక్కి నక్కి వెళ్లాయి. గేటు దగ్గర అన్నీ ఒక్క క్షణం భయపడి ఆగాయి. కానీ క్లోవర్ ముందుకు దారి తీసింది. అన్నీ అడుగులో అడుగు వేసుకుంటూ గోడదగ్గరకు చేరుకున్నాయి. ఎత్తుగా ఉన్న జంతువులు కొన్ని కిటికీల్లోంచి రహస్యంగా తొంగి చూసాయి.

ఒక పొడుగాటి బల్ల ముందు అటుపక్క ఆరుగురు రైతులు, ఇటుపక్క ఆరు

పందులు (అందులో స్క్వీలర్ ఒకటి) కూర్చున్నాయి. అందరికీ మధ్యలో, బల్ల అగ్రభాగాన నెపోలియన్ ఆసీనురాలై ఉంది. పందులన్నీ కుర్చీల్లో సునాయాసంగా కూర్చుని ఉన్నాయి. మనుషులు, పందులు కలిసి ఆనందంగా పేకాట ఆడుతున్నాయి. లోనికి తొంగి చూస్తున్న జంతువుల నెవరూ గమనించలేదు.

ఫాక్స్‌వుడ్ క్షేత్రానికి చెందిన పిల్కింగ్‌టన్ చేతిలో గ్లాసుతో లేచి నిలబడ్డాడు. కొన్ని విషయాలను చెప్పాల్సిన బాధ్యత తన మీదుందన్నాడు. మనుషులకూ, జంతువులకూ మధ్య ఇన్నేళ్లుగా ఉన్న అపనమ్మకాలు, అపార్థాలు తొలగిపోవడం తనకి చాలా తృప్తినిచ్చింది. ఒకప్పుడు తానూ, మిగతా రైతులూ జంతుక్షేత్రానికి చెందిన ఆస్తులను జంతువులవిగా గుర్తించడంలో నిర్లక్ష్యం చూపిన మాట నిజం. తమ మధ్య కొన్ని అనివార్య సంఘటనలు జరిగాయనీ, అయితే ఇప్పుడు పరస్పర అవగాహనతో అవి తొలగిపోయాయనీ ప్రకటించాడు.

జంతువులు స్వాధీనం చేసుకుని, నడుపుతున్న క్షేత్రమొకటి తమ మధ్య ఉండడం మానవులకు కలవరం కలిగించింది. వాస్తవాలు తెలీని రైతులు కొందరు అలాంటి క్షేత్రంలో అరాచకత్వం చోటు చేసుకుంటుందని భయపడ్డారు. కానీ ఇప్పుడా సందేహాలన్నీ పటాపంచలైనాయి.

ఈ రోజు తాము జంతుక్షేత్రానికి వచ్చి ఇక్కడ గమనించిందేమిటి? ఆధునిక పద్ధతులే కాకుండా రైతులే ఆదర్శంగా తీసుకోవాల్సిన క్రమశిక్షణ, సంఘీభావం ఇక్కడ రాజ్యమేలుతున్నాయి. జంతుక్షేత్రంలోని అధమ జంతువులు (కుక్కలు, పందులు మినహా) మిగతా చోటికన్నా ఎక్కువ పని చేస్తూ, తక్కువ తిండి తింటున్నాయి. నిజానికి తాను, తన సహచరులు ఇక్కడ ఎన్నో విషయాలు నేర్చుకుని తమ తమ క్షేత్రాలలో వాటిని కార్యరూపంలో పెట్టబోతున్నామని వెల్లడించాడు పిల్కింగ్‌టన్.

జంతుక్షేత్రానికీ, చుట్టుపక్కల క్షేత్రాలకూ మధ్య ఈ స్నేహపూర్వక వాతావరణం ఎల్లప్పుడూ ఇలాగే కొనసాగాలని కోరాడు. జంతువులకూ, మనుషులకూ మధ్య ఎలాంటి వర్గ వైరుధ్యాలూ ఉండాల్సిన అవసరం లేదు. కష్టాలు, బాధలూ, కార్మిక సమస్య అంతటా ఒకటే.

ఇక్కడ పిల్కింగ్‌టన్ అంతకు ముందే జాగ్రత్తగా ఎంచుకున్న పరిహాసమాడబోయాడు గానీ, ఎందుకో కాస్త తడబడి దాన్ని వెంటనే చెప్పలేకపోయాడు. కొద్దిగా గొంతు పొరబోయి, బుగ్గలెరుపెక్కాక దాన్ని చెప్పాడు, మీ దగ్గర అధమజాతి జంతువులుంటే, మా వద్ద అధమజాతి మనుషులున్నారు.

ఈ పరిహాసానికి బల్ల చుట్టూ ఉన్న మనుషులు, పందులు పడీపడీ నవ్వారు(యి). పిల్కింగ్‌టన్ మరోసారి పందుల చాతుర్యానికి వందనాలు తెలిపి, అందరూ తమ గ్లాసులను నింపుకోవాల్సిందిగా కోరాడు. 'ఇది నా తరపున ఇస్తున్న విందు. జంతుక్షేత్రం వర్ధిల్లాలి.'

మనుషులు, పందులు ఉల్లాసంగా గ్లాసులెత్తారు(యి.) నెపోలియన్ ఉత్సాహంతో

### కొత్తగాలి...

**బొజ్జగణపయ్య**
**వచ్చి వెళ్లాడు**
**సాగర్ నిండా**
**రంగుల ఆనవాళ్లు**

*– తలకట్ల మహీపాల్‌రెడ్డి,*
*గాంధీనగర్, హైదరాబాద్*

చుట్టూ తిరిగి వచ్చి పిల్కింగ్‌టన్‌తో తన గ్లాసును తాటించింది.

గ్లాసులు ఖాళీ అయ్యి, గలభా కాస్త సద్దు మణగగానే నెపోలియన్ నిలబడి తాను కూడా నాలుగు ముక్కలు చెప్పాలనుకుంటున్నట్లు తెలిపింది. నెపోలియన్ అన్ని ఉపన్యాసాలలాగే ఇది కూడా ఎంతో క్లుప్తంగా, సూటిగా ఉంది. ఇద్దరి మధ్యా అపార్థాలు తొలగినందుకు తనకూ సంతోషంగా ఉంది.

తానూ, తన సహచరులు ఇతర క్షేత్రాలలోని జంతువులతో తిరుగుబాటు లేవదీయడానికి ప్రయత్నిస్తున్నట్లు శత్రువులు పుకార్లు పుట్టిస్తున్నారు. అదంతా అసత్యం. అప్పుడూ, ఇప్పుడూ తమ లక్ష్యం చుట్టుపక్కల క్షేత్రాలతో మంచి వ్యాపార సంబంధాలు కలిగి ఉండడమే. జంతుక్షేత్రం నిజానికి అక్కడి జంతువుల సమష్టి ఆస్తి. వాటి అభ్యర్థన మేరకు తాను కేవలం నాయకత్వం వహిస్తోందంతే! నిజానికి తన పేరుతో ఉన్న అన్ని ఆస్తులకూ పందులన్నీ సమష్టి యజమానులు.

కొన్ని పాత అలవాట్లు ఇంకా మిగిలి ఉన్నా క్షేత్రంలోని జంతువులలో ఆత్మవిశ్వాసాన్ని పెంచడానికి క్షేత్రపు ఆచార వ్యవహారాలలో కొన్ని మార్పులు జరిగాయి. ఇంతవరకూ జంతువులు ఒకదాన్నొకటి 'కామ్రేడ్స్' అని పిలుచుకునే మూర్ఖపు అలవాటు ఒకటుండేది. దాన్ని నిర్మూలించడం జరిగింది. ప్రతి ఆదివారం జంతువులన్నీ ఒక పుర్రె ముందు కవాతు చేసే విచిత్రమైన ఆచారం ఒకటుంది. ఆ పుర్రెను పాతిపెట్టడం జరిగింది. ఆ ఆచారమూ తొలగించబడింది. ఇక గిట్టలు, కొమ్ములు ఉన్న పచ్చజెండాలోంచి ఆ గిట్టలు, కొమ్ములు తొలగించబడి కేవలం పచ్చజెండా మాత్రమే ఎగురుతుండడం అతిథులు గమనించే ఉంటారు.

పిల్కింగ్‌టన్ మాటలలో ఒకే ఒక అంశం తనకు నచ్చలేదంది నెపోలియన్. తన ఉపన్యాసంలో పిల్కింగ్‌టన్ 'జంతు క్షేత్రం' అని పదేపదే ప్రస్తావించాడు. అతనికి తెలియకపోవచ్చుగానీ - జంతుక్షేత్రం పేరిప్పుడు మారింది. 'మేనర్‌క్షేత్రం' అనే మునుపటి పేరుతోనే పిలవబడుతుంది.

'మిత్రులారా! ఇక మీమీ గ్లాసులను నింపుకోండి! మేనర్ క్షేత్రం వర్ధిల్లాలి!' నెపోలియన్ ఉపన్యాసాన్ని ముగించింది.

మునుపట్లాగే అక్కడ ఈలలూ, కేకలూ మార్మోగాయి. గ్లాసులన్నీ ఖాళీ అయ్యాయి. గొడవంతా సద్దుమణిగాక కింద పడేసిన పేకను తీసుకుని బల్ల చుట్టూ చేరి ఆట మొదలుపెట్టారు(యి).

బయట జంతువులన్నీ నిశ్శబ్దంగా వెను దిరిగాయి.

కొంతదూరం వెళ్ళి మళ్ళీ ఆగాయవి. భవంతిలోంచి మళ్ళీ అరుపులు మొదలయ్యాయి. అవన్నీ మళ్ళీ వెనక్కి పరిగెత్తి కిటికీలోంచి లోపలికి తొంగిచూసాయి. అక్కడ మళ్ళీ గొడవ జరుగుతోంది. కేకలూ, బల్ల మీద గుద్దడాలూ, అనుమానాస్పద దృక్కులూ, కోపంతో కూడిన నిరాకరణలూ నడుస్తున్నాయి లోపల. దానికంతటికీ కారణం - నెపోలియన్, పిల్కింగ్‌టన్‌లు ఒకేసారి ఒకే రకానికి చెందిన ఆసు ముక్కలను ఆడడం!

పదమూడు గొంతుకలు కోపంతో అరుస్తున్నాయి. అవన్నీ ఒకే రకంగా ఉన్నాయి. ఆ ముఖాలన్నీ కలగలిసిపోయి పందుల ముఖాలకు, మనుషుల ముఖాలకు పోలికలు తెలీడం లేదు.

బయటి జంతువులు పందినీ మనిషినీ, మనిషినీ పందినీ, తిరిగి పందినీ మనిషినీ మార్చి మార్చి చూస్తున్నాయి. కానీ అప్పటికే ఏది మనిషో, ఏది పందో కనుక్కోవడం అసాధ్యమయిపోయింది. ©

# కాప్షన్ మీదే - 23



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 16

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@gmail.com

ఉత్తమ వ్యాఖ్య :

నేను కూతేద్దాం అనుకున్నపుడే, నువ్వా సప్పుడు సేసే వంటే పీక నొక్కుతా. గమ్మునుండు

–టి.శశిధర్,
చందానగర్, హైదరాబాద్



## కాప్షన్ మీదే -22

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

చచ్చాంరా బాబూ!
ఇది అర్థరాత్రే ఆగి చచ్చింది!

– కె.ఎన్నార్ నమ్మి,
నెగ్గిపూడి, ప.గో. జిల్లా

ఓ.. టైమప్. కొక్కొరొక్కో!

– వి.శ్రీనివాసరావు, రాజమండ్రి

ఈ వాచీ ఎప్పుడూ రిపేరే!
నేను కూసే టైమైందో లేదో?!

–నేమాన సుభాష్‌చంద్రబోస్,
శ్రీకాకుళం

ఓవ్!! ఇవాళ ఆదివారం, పారిపోక పోతే బిర్యానీ అయిపోతాను

–కిరణ్‌కుమార్ జంప,
జెడ్డా, సౌదీ అరేబియా




# భూస్వామ్యంపై నిరసనగళం

**రష్యన్ సాహితీవేత్త టాల్‌స్టాయ్ నవలా రచయితగానే కాకుండా, కథకుడు, నాటకకారుడు, విమర్శకుడు, బోధకుడు, అన్నిటికీ మించి మూర్తీభవించిన మహా మానవతావాదిగా ప్రపంచ ప్రజల మనస్సుల్లో నిలిచిపోయారు. తత్త్వశాస్త్రం, సాంఘికశాస్త్రం, చరిత్ర, న్యాయశాస్త్రం, సౌందర్యశాస్త్రం, నీతిశాస్త్రం తదితరాలను సమగ్రంగా కాచి వడపోసిన వైతాళికుడాయన. అలాగే తాను చెప్పినదాన్ని ఆచరించి చూపాడు. ఆయనలా సమాజంలోని లోపాలను, వాటి కారణాలను తర్కించిన రచయితలు చాలా అరుదు. అందువల్లనే ఆయన ప్రతి మాటకూ, పనికీ ఎంతో ప్రాముఖ్యం ఏర్పడింది. ఆ మహనీయుడి శతవర్ధంతి సందర్భాన్ని పురస్కరించుకుని ఈ ప్రత్యేక కథనం.**

ప్రసిద్ధ రచయిత మాక్సీమ్‌గోర్కీ టాల్‌స్టాయ్‌ను అనంత వైవిధ్యపూరితుడు, విశ్వమానవుడని చెబుతూ, 'సమస్త ప్రపంచమంతా ఆయనకేసి చూస్తోంది. ప్రతి దేశంనుంచీ, చైనా, ఇండియా, అమెరికా జీవనాడులు ఆయన్ను పెనవేసుకున్నాయి. ఆయన ఆత్మ శాశ్వతంగా అందరికీ చెందుతుంది' అని ప్రశంసించాడు.

1828 సెప్టెంబరు 9న మాస్కో సమీపాన 'తులా' రాష్ట్రంలోని 'యాస్నావా పోల్యానా' అనే కుగ్రామంలో టాల్‌స్టాయ్ జన్మించాడు. తల్లిదండ్రులు చిన్నప్పుడే చనిపోవడంవల్ల బంధువుల చేతుల్లో పెరిగాడు. ప్రైవేటు ట్యూటర్ల వద్ద చదివాక, పదహారేళ్లప్పుడు కజాన్ విశ్వవిద్యాలయంలో చేరాడు. ఆ చదువు నచ్చక తిరిగి వచ్చి, సొంతంగానే చదువుకున్నాడు. యవ్వనంలో తప్పతాగుతూ ఆడంబరంగా జీవించాడు. 1851లో కాకసస్ పర్వత ప్రాంతంలో సైన్యంలో పనిచేసే సోదరుడు నికొలాయ్ దగ్గరికెళ్ళాడు. ఆ మరుసటి ఏడాదే తనూ సైన్యంలో చేరి, 1854లో

డాన్యూబ్ ప్రాంతానికి బదిలీ అయ్యాడు. తీరికవేళల్లో కథలు రాస్తూండేవాడు. క్రిమియా యుద్ధంలో పాల్గొన్నాడు. తర్వాత సైన్యం నుండి వచ్చి, 1855లో రాజధాని పీటర్స్‌బర్గ్ చేరాడు. ఆయన రాసిన మొదటి కథ 'శైశవం' (1852), 'సొవ్రొమెన్నిక్' పత్రికలో ప్రచురితమైంది. ఫలితంగా ఆనాటి సాహితీవేత్తలు రష్యాలో ఓ నూతన తార ఆవిర్భవించిందని గుర్తించారు. పీటర్స్‌బర్గ్‌లోని వివిధ సాహిత్య బృందాలు ఆయనను ఉత్సాహంతో ఆహ్వానించాయి. ఆనాటి ప్రసిద్ధ రచయితలు, కవులైన గొంచెరోవ్, తుర్గెనేవ్, ఓస్ట్రోవ్‌స్కీ నెక్రసోవ్, చెర్నిషేవ్‌స్కీ వంటి వారితో



హేమా హేమీలు: చెకోవ్, టాల్‌స్టాయ్

టాల్‌స్టాయ్ చర్చల్లో పాల్గొనేవాడు.

## విద్యావ్యాప్తికి కృషి

విద్యా సంబంధ సిద్ధాంతాల అధ్యయనానికి టాల్‌స్టాయ్ 1860లో జర్మనీ, ఫ్రాన్స్, ఇటలీ, ఇంగ్లాండు, బెల్జియం వెళ్లాడు. తర్వాత ఓ పత్రిక నడిపి, అందులో నూతన బోధన పద్ధతులు, సిద్ధాంతాల్ని చర్చించాడు. తన అభిప్రాయాల ప్రకారం బోధనా పద్ధతుల్ని ఆచరణలో పెట్టేందుకు, జమీలోని రైతుల పిల్లలకోసం 13 స్కూళ్లను తెరిచాడు. వారికోసం స్వయంగా పాఠ్యగ్రంథాలు రాశాడు.

1862లో తన స్నేహితుడి చెల్లెలైన సోన్యాను పెళ్లాడాడు. అనంతరం పదిహేనేళ్లపాటు నవలా రచనవైపు దృష్టి కేంద్రీకరించాడు. తర్వాత క్రైస్తవ మతంలోని పెడధోరణుల్ని ఖండిస్తూ, సనాతన రష్యన్ చర్చిపై తిరుగుబాటు చేశాడు. 'అరాచక క్రైస్తవాన్ని' సమర్థిస్తూ రాశాడు. సంఘసంస్కరణలు, నీతి, కళలవైపు దృష్టి సారించాడు. జీవనసరళి కూడా పూర్తిగా మారిపోయింది. ఆడంబర జీవితాన్ని త్యజించి సామాన్య రైతులా జీవించసాగాడు. సమాజంలో స్త్రీలకు జరుగుతున్న అన్యాయాల్ని రచనలు, సభలు, సమావేశాల ద్వారా నిరసించాడు. క్రమంగా ఆయన రచనలు ప్రపంచంలోని అన్ని దేశాలకూ వ్యాపించాయి.

## భార్యతో విభేదాలు

టాల్‌స్టాయ్‌ను కలిసేందుకు ప్రపంచ వ్యాప్తంగా నిత్యం వందలాది మంది వస్తుండేవారు. దీంతో ఆయన గ్రామంలో తిరునాళ్లలా ఉండేది. ఈ తతంగమంతా ఆయన భార్యకు నచ్చేదికాదు. తరచూ తగువులాడేది. సందర్శకుల్ని ఈసడించేది. ఆమె ఆయన పుస్తకాల కాపీరైటు హక్కును పొంది, ప్రచురించసాగింది. జీవిత చరమాంకంలో ఆమెతో ఘర్షణ పడలేక, కొన్ని రచనల్ని ప్రచురించడానికి ఆసక్తి చూపలేదాయన. మనస్తాపంతో ఇల్లు వదలి వెళ్లిపోయాడు. చివరికి ఒక అనాథలా న్యూమోనియాతో ఆస్టోపోవో అనేచోట మరణించాడు.

## పేదల్ని పీడించడం వల్లనే సంపదలు

టాల్‌స్టాయ్ కాలమైన 19వ శతాబ్ది రష్యన్ సాహిత్యంలో స్వర్ణయుగం. ఆ కాలంలో లెర్మెంతోవ్, తుర్గెనేవ్, గొగోల్, చెకోవ్, దొస్తోయేవ్‌స్కీ, కుప్రిన్ తదితర గొప్ప సాహితీవేత్తలు జీవించారు. వారంతా అత్యుత్తమ రచనలతో విశ్వసా

## నిన్నటి నిజం

### చేతిలో ఉన్న పని..

ఒకసారి దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు రైల్లో విజయవాడ నుంచి చీరాల ప్రయాణం చేస్తున్నారు. అదే రైల్లోవున్న గాంధీజీ అంటే పడని ఒక యువకుడు అవహేళన చేస్తూ, 'ఈ గోచి పాతరాయుడు స్వాతంత్ర్యాన్ని తెస్తాడా? అది ఆయనకు సాధ్యమా? కాంగ్రెసు వాదులు ఇంతకాలంనుంచీ కొట్టుకున్నా స్వాతంత్ర్యం రాలేదు. బ్రిటిష్ ప్రభుత్వం వీళ్ళకి తగిన శాస్తి చేస్తుంది' అని దురుసుగా మాట్లాడసాగాడు. ఇదంతా వింటున్న 'ఆంధ్ర రత్న' దుగ్గిరాల చిరునవ్వు నవ్వి 'నాయనా నీకు వివాహమైందా?' అని అడిగారు.



'ఆ.. అయింది' అన్నాడా యువకుడు కాస్త చిరాకుగా.

'ఎంతకాలమయింది?' అడిగారు దుగ్గిరాల.

'నీకెందుకు?' దురుసుగా అన్నాడతడు.

'బాబూ నేను పెద్దవాణ్ణి. అడగటంలో తప్పు లేదు' అన్నారు ఆంధ్రరత్న. చెప్పమన్నారు తోటి ప్రయాణికులు. వాళ్ళకు అసలు విషయం అంతుచిక్కటం లేదు.

'సరే, మూడు సంవత్సరాలు' అని చెప్పాడు ఆ యువకుడు.

'పిల్లలెంతమంది' అడిగారు దుగ్గిరాల.

'ఇంకా లేరు' జవాబిచ్చాడు యువకుడు.

దుగ్గిరాల చిరునవ్వు నవ్వి, 'మీ తాత మీ నాన్నను కన్నాడు, మీ నాన్న నిన్ను కన్నాడు. ప్రస్తుతం నీవు అదే ప్రయత్నంలో వున్నావు. అది సరే, చేతిలో వున్న పనిని నీవు మూడు సంవత్సరాలనుంచి చేయలేక పోయావే! మరి రవి అస్తమించని సకల శస్త్రాస్త్ర సంపన్నమైన బ్రిటిష్ సామ్రాజ్యాన్ని గెలవటమంటే మాటలా బాబూ?'

ఆయన మాటలకు తోటి ప్రయాణికులంతా గొల్లున నవ్వారు. ఇంకా రెండు స్టేషన్లు అవతల దిగవలసిన ఆ యువకుడు సిగ్గుతో తలెత్తలేక పక్క స్టేషనులోనే దిగిపోయాడు పాపం!

హిత్యాన్ని పరిపుష్టం చేశారు. వారిలో టాల్‌స్టాయ్‌ది అత్యున్నత స్థానం. విమర్శనాత్మక వాస్తవికతావాదాన్ని ప్రవేశపెట్టి సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన ఘనుడాయన.

టాల్‌స్టాయ్ ఎనభైరెండేళ్ల జీవితంలో అరవై ఏళ్లపాటు రాశాడు. మానవ జీవితంలోని అన్ని పార్శ్వాలను స్పృశించాడు. ఆయన కథలు, నవలలు, వ్యాసాలు ప్రపంచ సాహిత్యాన్ని దిశానిర్దేశం చేశాయి. స్వయంగా తాను జమీందారీ కుటుంబంలో పుట్టినా, రచనలన్నిటా పెత్తందారీ విధానాన్ని తీవ్రంగా అధిక్షేపించాడు. ధనికుల సంపదంతా పేదలను జలగలా పీల్చడంద్వారా వచ్చిన అన్యాయార్జితమేనని నిర్ధారించాడు. భూస్వామ్య విధానాన్ని తీవ్రంగా ఖండించాడు. స్వేచ్ఛకూ, మానవ హక్కులకూ పెద్దపీట వేశాడు. పీడితుల ఆక్రందనల్ని ఆర్ద్రంగా చిత్రించాడు. ప్రజా సమస్యలపై గళమెత్తాడు. నిరంకుశ జార్ పాలనను విమర్శించాడు. ఆయన అమలిన హృదయం తప్పక స్పందిస్తుందని, ఆ అప్రమత్త నేత్రం తమ లేమిని చూస్తోందని, ఆయన చురుకైన చెవి తమ రోదనల్ని వింటోందనే ఊరడింపు పీడితులకు ఉండేది.

## నవలా సేద్యం

టాల్‌స్టాయ్ ప్రధానంగా నాలుగు గొప్ప నవలలు రాశాడు. 1863లో రాసిన మొదటి నవల 'కోసక్కులు'. తన సైనిక జీవితం తొలిదశలో టాల్‌స్టాయ్ కాకసస్ ప్రాంతంలోని కోసక్కు గ్రామంలో ఉన్నాడు. ఆ పర్వత ప్రాంతపు రమణీయ ప్రకృతి, కోసక్కుల స్వేచ్ఛాపిపాస, సౌందర్యం, సాహస ప్రవృత్తి ఆయనను

## ప్రముఖుల ప్రశంసలు

రష్యన్ విప్లవ దర్పణం టాల్‌స్టాయ్. ప్రపంచ సాహిత్యానికి అత్యుత్తమ చేర్పులు ఎన్నో చేర్చారు. రష్యా జీవితపు నిరుపమానమైన చిత్రాలు గీసిన ఆయన ప్రపంచ సాహిత్యంలోనే అత్యుత్తమ కళాకారుడు.

**– రష్యన్ విప్లవనేత లెనిన్**

టాల్‌స్టాయ్ పట్ల నా వైఖరి ఎంతో రుణపడి వున్న ఆరాధకుడి వైఖరి లాంటిది

**–గాంధీజీ**

రచయితగా టాల్‌స్టాయ్ సాధనల్ని వివరించాలంటే సాధారణ వాక్యాలు చాలవు. వైభవ భరిత పదచిత్రాలు కావాలి. హెర్క్యులస్ వీరోచిత కృత్యంలా టాల్‌స్టాయ్ సాహిత్య కృషి కనిపిస్తుంది

**–రష్యన్ విమర్శకుడు, లియొనెద్ లిమనోవ్**

ఆయన మరణంతో సాహిత్యలోకానికి కలిగే లోటు తలచుకుని భయమేస్తుంది

**–రష్యన్ కథకుడు చెకోవ్**

సమ్మోహనం చేశాయి. కాకసస్ తనకు ఓ జీవిత పాఠశాల అని రాసుకున్నాడాయన. కథలో మాస్కో ధనిక యువకుడు ఒలేనిన్ డబ్బంతా జల్సాలకు తగలేసి, అప్పుల పాలై సైన్యంలో చేరతాడు. అలా కోసక్కు ప్రాంతానికి వచ్చి, అక్కడి ప్రజల జీవన విధానానికి ఆకర్షితుడవుతాడు. ఓ కోసక్కు యువతిని ప్రేమించి, ఆమెను పెళ్లాడి, వారిలో ఒకడిగా కలిసిపోవాలని భావిస్తాడు. అయితే నాగరిక రష్యన్లవల్ల తమ జాతికి జరుగుతున్న అన్యాయాల్ని గ్రహించిన ఆ యువతి అతన్ని తిరస్కరించడంతో ఆ ప్రాంతం వదిలి వెళ్లిపోతాడు. టాల్‌స్టాయ్ సృజనాత్మక కృషిలో ఈ నవల స్థానాన్ని వివరిస్తూ ప్రసిద్ధ రచయిత రోమారోలా, 'కోసక్కులు' ఉత్తమ లాలిత్యభరిత నవల. ఆయన యౌవన గీతం, కాకసస్‌కి చెందిన కావ్యం. జగజ్జేగీయమానమైన ఆకాశపుటెదురుగా రూపుదాల్చిన హిమాన్విత పర్వతాల మహోన్నత సౌందర్యం నవలంతా నిండిపోతుంది. టాల్‌స్టాయ్ మేధ తొలిసారిగా పరిమళించిన సాటిలేని మేటి రచన ఇది' అన్నారు.

### రెండో నవల 'యుద్ధం – శాంతి'

ప్రపంచ నవలా సాహిత్యంలోనే అత్యుత్తమ రచనగా విమర్శకులు దీన్ని పరిగణించారు. 1805-12 మధ్య రష్యాపై నెపోలియన్ సాగించిన దండయాత్ర, అతడు ఓడిపోయి పారిపోవడం నేపథ్యంగా సాగిన ఈ నవలను విస్తృత మానవ జీవిత వ్యాఖ్యానంగా రచయిత తీర్చిదిద్దాడు. ఆనాటి రష్యా గురించిన సమగ్ర చిత్రమే ఈ నవల. అప్పటి చరిత్ర, మానవ జీవన సమరం ఈ నవలలో ప్రతిబింబిస్తుంది. 'ప్రజల సుఖదుఃఖాలు, మంచి చెడ్డలు- వీటన్నిటి సామూహిక చిత్రమే యుద్ధం-శాంతి' అని ప్రసిద్ధ రష్యన్ విమర్శకుడు స్ట్రోకోల్ పేర్కొన్నాడు. ఈ నవలలో నాలుగు ఉన్నత కుటుంబాల మధ్య గల సంబంధాలను చిత్రీకరించడానికి పూనుకొన్నప్పటికీ, రచయిత తాననుకొన్న లక్ష్యాన్ని నెరవేర్చడానికి ఐదువందలకు పైగా పాత్రలను ప్రవేశపెట్టి, ప్రతి పాత్రకూ స్పష్టమైన రూపాన్నిచ్చాడు.

ఈ నవలలోని ముఖ్యమైన పాత్రలన్నిటినీ రచయిత తన పరిచితుల నుండే ఎన్నుకొన్నాడనీ, నవలా నాయకులైన ఆంద్రూ, పీటర్‌లు రచయిత ప్రతిబింబాలేనని విమర్శకులంటారు. అందం, నిజాయతీ, ఉత్సాహంగల ధీరోదాత్తుడు ఆంద్రూ. గర్భిణీ భార్యను వదిలి సైన్యంలో చేరి, యుద్ధంలో గాయపడి శత్రువులకు చిక్కుతాడు. అదృష్టవశాత్తు బయటపడతాడు. కొడుకుని ప్రసవించి భార్య మరణించేసరికి, వైరాగ్యంలో పడతాడు. తన ఎస్టేట్ ప్రజలకు కావల

నిన్నటి నిజం

## మాలవ్యా మానవీయత

మదనమోహన మాలవ్యా పేరుమోసిన విద్యావేత్త, సంఘ సేవకులు, రాజనీతి కోవిదులు. పైగా ధర్మపరాయణులు. వారి ఆకారమే మహర్షిని తలపుకు తెస్తూంటుంది. ఒక మారు వారు అలహాబాదులో జరూరు పని మీద వడివడిగా నడుస్తూ వెళుతున్నారు. కణ కణమండే ఎండ, బస్సులు, కార్లు, టాంగాలు, మనుషులతో కోలాహలంగా ఉన్నరోడ్డు. ఎవరి గొడవ వారిది. మాలవ్యాగారి దృష్టి రోడ్డుపక్కన పడివున్న ఒక రోగిష్టి స్త్రీ మీద పడింది. మాసిన బట్టలతో, చింపిరి జుత్తుతో కుప్పగా పడి బాధతో మూలుగుతున్నది. ఆమె శరీరం కుళ్ళి దుర్వాసన కొడుతూ ఉంది. ఆమె సంగతి పట్టించుకొన్నవారే లేరు. మాలవ్యాగారు ఆమె దగ్గర ఆగారు. ఆమె దయనీయ స్థితి చూసి వారి మనస్సు ద్రవించింది. వెంటనే దారినపోయే టాంగాను పిలిచి, ఒక యువకుని సాయంతో ఆ స్త్రీని ఆస్పత్రిలో చేర్పించారు. ఈ తతంగమంతా జరగాలంటే చాలా సేపే పడ్తుంది.



మాలవ్యాగారి మహనీయత తెలుసుకున్న ఆ యువకుడు 'మీకు ఎన్నో ముఖ్యమైన పనులు ఉంటాయి. మీరు వెళ్ళిరండి. ఈ రోగిష్టి స్త్రీకి కావలసిన ఏర్పాట్లు నేను చూసుకుంటాను' అన్నాడు. అందుకు మాలవ్యాగారు చిరునవ్వులొలికిస్తూ 'నాయనా! నాకు జరూరు పను లున్నాయి. కానీ ఈ స్త్రీ ఆరోగ్యం కంటే అవేవీ అంత ముఖ్యమైన పనులేమీ కావు. ఈమెకు ఆస్పత్రిలో వైద్యసౌకర్యాలు అన్నీ చూచిన తర్వాతనే మిగతా పనులు చూసుకుంటాను' అన్నారు.

మాలవ్యాగారి మానవీయతకు ఆ యువకుడు మనస్సులోనే కోటి దండాలు పెట్టాడు.



సిన సౌకర్యాలు సమకూరుస్తుంటాడు. ఓ రోజు నటాషాను చూసి మనస్సు పారేసుకుంటాడు. ఆమె ప్రేమనూ చూరగొంటాడు. తండ్రి ఆంక్షల కారణంగా ఓ ఏడాదిపాటు వివాహం వాయిదా పడుతుంది. ఇంతలో నటాషా ఓ మోసగాడి వలలో చిక్కుకుని అవమానంతో ఆత్మహత్యకు ప్రయత్నించి, ఎలాగో బతుకుతుంది. ఇక పీటర్ మంచివాడేగానీ, అనిశ్చితుడు. మధ్యలో సంక్రమించిన ఆస్తివల్ల అతని చుట్టూ జనం ఈగల్లా ముసిరారు. అందగత్తె హెలెన్ అతని భార్య. ఆమె అవినీతి పరురాలైనందువల్ల పీటర్ నిరాసక్తుడై ఆమెను పట్టించుకోవడం మానేస్తాడు. చివరికామె మద్యానికి బానిసై మరణించింది. మరోవంక నటాషా నిర్వాకానికి వ్యథ చెందిన ఆంద్రూ రాకుమారుడు యుద్ధంలో తీవ్రగాయాల పాలవుతాడు. పశ్చాత్తాపురాలైన నటాషా అతనికి పరిచర్యలు చేస్తుందిగానీ, ప్రయోజనం లేకపోతుంది. ఆంద్రూ మరణిస్తాడు. యుద్ధమూ ముగుస్తుంది. మాస్కోలోని తీవ్ర హిమపాతానికి సైన్యంలో అధికభాగం నాశనం కాగా, నెపోలియన్ పలాయనం సాగిస్తాడు. చివరికి నటాషా పీటర్‌ను పెళ్లాడుతుంది. ఆంద్రూ రాకుమారుని కొడుకు నికోలింకా పెద్దవాడవుతుంటాడు. అతడికి తండ్రి గుర్తులేదు. అయితే ఆ బాలుడికి తండ్రి అంటే అమిత గౌరవం. ఆయన్నొక దివ్య పురుషునిగా భావించి ఆరాధిస్తుంటాడు. ఇదే క్లుప్తంగా ఇందులోని కథ.

సుదీర్ఘమైన ఈ నవలలో చరిత్రకు ఒక కొత్త నిర్వచనమిస్తాడు రచయిత. గొప్ప వ్యక్తుల గాథనే చరిత్రగా ఇంతవరకూ చరిత్రకారులు చెప్పారు. అది సరికాదని,

ప్రజల చరిత్రే నిజమైన చరిత్ర అంటూ పలు ఉదాహరణలతో రచయిత దీన్ని రుజువు చేశాడు. ఏడు సంవత్సరాలు అహోరాత్రులు కష్టపడి, కొన్ని వందల చరిత్ర గ్రంథాలను పరిశీలించి ఈ నవల రాసిన ఆయన ఇందులో ఏ సంఘటన పట్లగానీ, పాత్ర పట్లగానీ రాగద్వేషాలు ప్రదర్శించకుండా కేవలం తానొక సాక్షీభూతునిగా నిలిచారు. అందువల్లనే దీనికొక గాంభీర్యం చేకూరింది.

**అన్నాకరెనినా**

స్త్రీల పట్ల సమాజం చూపుతున్న వివక్షను ఎత్తిచూపిన మొదటి నవల 'అన్నా కరెనినా'. ఈ లోకంలో తప్పు చెయ్యని వారెవరూ ఉండరు. కొన్ని తప్పులకు దారుణమైన శిక్షలుంటాయి. అయితే ఈ సమాజం ఒకే తప్పు చేసిన స్త్రీ పురుషుల పట్ల వేర్వేరుగా స్పందిస్తుంది. స్త్రీలపట్ల వ్యవహరించే ఈ ద్వంద్వ నీతిని రచయిత ఎత్తి చూపడంతో ఇది ప్రపంచంలోనే అత్యుత్తమ నవలగా నిలిచిపోయింది.

ఉన్నత కుటుంబానికి చెందిన అన్నా అసాధారణ సౌందర్యవతి. ఆమె తొలి యవ్వనంలో ఎన్నో కోరికలు, ఊహలతో విహరిస్తుంటుంది. ప్రేమించాలని, ప్రేమించబడాలని కలలు కంటుంది. అయితే ఆమె ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా మూర్ఖుడు, అవివేకీ, ధనికుడైన ఓ మధ్య వయస్కునికిచ్చి పెళ్ళి చేస్తారు. ఆమె కలలన్నీ కల్లలవుతాయి. ఆమెను పట్టించుకునే తీరిక భర్తకు ఉండదు. తొమ్మిదేళ్ల ఆమె కాపురంలో ఏడేళ్ల ఓ కొడుకున్నప్పటికీ ఆమె అందం, ఆకర్షణ చెక్కు చెదరలేదు. ఓ రోజు ఆమెకు వ్రాన్స్కీ అనే అందగాడు తారసపడతాడు. అతడి ఆకర్షణ నుండి తప్పించుకోవాలని ఆమె శతథా ప్రయత్నిస్తుందిగానీ విఫలురాలవుతుంది. తను కన్న కలలు అతనిలో చూసుకుని, అతని ప్రేమ ప్రవాహంలో కొట్టుకుపోతుంది. అతని ప్రేమను వదులుకోలేక, భర్తను మోసం చేయలేక సతమతమవుతుంది. చివరికి ఆమె భర్త స్వభావం జుగుప్సను కలిగిస్తుంది. అతడిని వదిలేసి, ప్రియునితో ఉండిపోతుంది. ఆమెకు ప్రియునితోపాటు కొడుకూ ప్రాణ సమానం. ఆ కొడుకంటే భర్తకిష్టం లేకపోయినా, ఆమెకివ్వడానికి మాత్రం ఒప్పుకోడు. విడాకులూ ఇవ్వలేదు. ఒకపక్క సమాజం వ్రాన్స్కీని ఎప్పటిలా ఆదరిస్తూనే, అన్నాను మాత్రం పతితగా అవమానిస్తుంది. లోకం కళ్ళు గప్పి పరాయి మగాళ్లతో కులికే మహిళలూ ఆమె మొహం చూడ్డమే పాపమన్నట్లు అసహ్యించుకుంటారు. నిజాయతీగా ఉంటూ, తను ప్రేమించిన వ్యక్తితో కలిసి ఉండటమే ఆమె చేసిన పాపం. మరోపక్క వ్రాన్స్కీ కూడా లోకం పోకడ గమనించి ఆమెకు ఎడంగా జరుగుతూ పరాయి స్త్రీలతో అనుమానాస్పదంగా ప్రవర్తిస్తాడు. దాన్ని చూసి ఆమె తట్టుకోలేకపోతుంది. తరచు ఇంట్లో కీచులాటలు మొదలై తీవ్రరూపం దాల్చేసరికి ఆమె తీవ్ర మానసిక సంఘర్షణకు గురవుతుంది. చివరికి రైలుకిందపడి ఆత్మహత్య చేసుకుంటుంది. ఇదీ క్లుప్తంగా కథ. మహాభారతంలో ద్రౌపదిలా, ప్రపంచ నవలా సాహిత్యంలో అన్నా కరెనినా అద్భుత పాత్ర. టాల్‌స్టాయ్ ఆ పాత్రను నిర్వహించిన తీరు అనితరసాధ్యం!

**నవజీవనం**

టాల్‌స్టాయ్ పరిణత వయసులో రాసిన నవల రిసరెక్షన్(నవజీవనం). సమాజంలో ప్రజలు పట్టించుకోని పలు చీకటి అంశాల్లో జైళ్ల వ్యవస్థ ఒకటి. దీని మంచి చెడ్డల్ని సమాజం చర్చించదు. జైలునుంచి వచ్చినవారిని వెలివేస్తుంది. వారంతా కరడుకట్టిన నేరస్థులేనంటుంది. వారు కూడా

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

## అపురూపం ఆ అక్కయ్య అనురాగం

నిన్నటి నిజం

రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ మైసూరు విశ్వ విద్యాలయంలో తెలుగుశాఖాధిపతి.

ఓసారి పాత తాళపత్ర గ్రంథాల అన్వేషణకు మైసూరు నుంచి అనంతపురం జిల్లా ధర్మవరం వచ్చారాయన. అక్కడ కొద్ది రోజులు ఉండాల్సి వస్తే ఓ ఇంటిలో ఆశ్రయం పొందారు. ఇంటి యజమానురాలు సకేశి విధవ. అందుచేత ఆమె శర్మగారికి భోజనం పెట్టేందుకు జంకింది. మొదటిరోజు పండ్లు తిని గడిపిన శర్మగారి వ్యవహారాన్ని ఆమె గమనించింది. రెండో రోజు ఆయన స్నానానికి వెళ్లినప్పుడు నానవేసిన అటుకులను గదిలో ఉంచి, దానికి వ్యంజనంగా బెల్లం తీసుకుని వద్దామని అంగడికెళ్లింది. ఆమె వచ్చేలోపు శర్మగారు స్నానం ముగించి వచ్చి అక్కడ పెట్టిన అటుకులు తిని, వెళ్లిపోయారు. దాంతో ఆమె చాలా నొచ్చుకుంది. సాయంత్రం ఆయన ఇంటికి రాగానే ప్రశ్నించింది. "తమరు ఉత్త అటుకులు తినిపోవడం బాధ పెట్టింది. నేను బెల్లం తెద్దామనే వెళ్లాను. ఆ లోపలే మీరు వెళ్లిపోయారే? "



"అక్కయ్యా! అప్పటికే ఆలస్యం కావడంతో ఉన్నది తిని వెళ్లాను. బెల్లం లేకపోయినా అటుకులు రుచిగా ఉన్నాయి" అన్నారాయన.

అప్పటికామెకు ధైర్యం కలిగింది.

"ప్రతి రోజూ మీరు ఆకలితో వెళ్లడం చూడలేను. నా చేతితో భోజనం పెడితే అది పాపమవుతుందేమో? అయినా ఇక నుంచి నా వంటలు తినే వెళ్లమని ప్రార్థన" అందామె.

శర్మగారు సంతోషంగా "అలాగే! అక్క వండిపెట్టినదాన్ని తినడం నేను చేసుకున్న పుణ్యం" అన్నారు. తర్వాతి రోజునుంచి ఆమె చేతివంటను సుష్టుగా ఆరగించి వెళ్లేవారు.

మనుషులేనని, వారికీ హక్కులుంటాయని భావించదు. నిజానికి జైళ్లు ఖైదీలను మంచిపౌరులుగా తయారు చేయాలి. అవి దానికి విరుద్ధంగా ఉన్నాయి. ఈఅంశంపై తొలిసారిగా దృష్టి సారించాడు రచయిత.

నవలా నాయకుడు నెఖ్లూడో విలాస జీవితం గడిపే యువ జమీందారు. చదువుకునే రోజుల్లో అభ్యుదయ భావాలు కలిగిన అతడు, మేనత్తల ఇంట్లో పనిపిల్ల మస్లోవాను ప్రేమిస్తాడు. ఓ రోజు బలవంతంగా అనుభవించి కొంత డబ్బు ఆమె జేబులో కుక్కి పారిపోతాడు. ఆమె గర్భవతి అయి, పుట్టిన బిడ్డ చనిపోగా, బతుకు ఛిద్రమై వేశ్యాగృహంలో చేరుతుంది. అక్కడొక హత్యానేరం మోపబడి జైలు పాలవుతుంది. ఈ కేసు విచారణకు వచ్చినప్పుడు జ్యూరీ సభ్యుడిగా ఉన్న నెఖ్లూడో ఆమెను గుర్తుపడతాడు. అన్యాయంగా ఆమెకు నాలుగేళ్ల కఠిన ప్రవాస శిక్షపడుతుంది. తనవల్లనే ఆమె జీవితం దారుణంగా తయారైందని నెఖ్లూడో బాధపడతాడు. ఆమె శిక్ష రద్దవడం కోసం అప్పీలు చెయ్యాలని, విడుదలయ్యాక తను చేసిన పనికి ప్రాయశ్చిత్తంగా ఆమెను పెళ్లాడాలని నిశ్చయించుకుంటాడు. ప్రఖ్యాతిగాంచిన వకీలును పెట్టి అప్పీలు చేస్తాడు. మొదట ఆమె అతణ్ణి నమ్మదు. తర్వాత నమ్ముతుంది. జైల్లో ఆమెను కలిసే క్రమంలో, అక్కడ అన్యాయంగా శిక్షలు అనుభవించే పలువురు ఖైదీలు ఆమె ద్వారా అతడిని ఆశ్రయిస్తారు. అతడి పలుకుబడితోవాళ్లు విడుదలయ్యేందుకు ప్రయత్నిస్తారు. ఆ ఖైదీలకు జరుగుతున్న అన్యాయాల్ని చూసిన నెఖ్లూడో వారిని ఎలాగైనా శిక్షల నుంచి బయటపడేసేందుకు సిద్ధమవుతాడు. కొందరి విషయంలో విజయం




## కువెంపు చురక!

జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత కువెంపును ఒక యువకుడు సమీపించి, 'బహు ప్రశంసలను పొందిన మీ రామాయణ దర్శనం పుస్తకం ధర 50 రూపాయలా? చాలా ఎక్కువ' అన్నాడు.

'నిజమే ఆ పుస్తకం వెల కొంత ఎక్కువే' అని ఆ మహాకావ్య రచయిత కువెంపు ఒప్పుకున్నాడు.



ఈ మాట్లాడే సమయంలోనే కువెంపు ఆ యువకుడు కాళ్ళకి తొడుక్కున్న బూట్లను చూశాడు.

'నీవు కాళ్ళకి వేసుకున్న బూట్లు చాలా అందంగా ఉన్నాయి. వెల ఎంత?' అని ఆ యువకుణ్ణి కువెంపు ప్రశ్నించాడు.

'వీటి వెల నూట ఇరవై రూపాయలు' అని ఆ యువకుడు సగర్వంగా జవాబిచ్చాడు.

'నీ కాళ్లకు తొడుగుగా ఉపయోగపడే బూట్లను 120 రూపాయలు పెట్టి సంతోషంగా కొన్నావు. కానీ నీ తలపై పెట్టుకోవలసిన పవిత్రమైన పుస్తకాన్ని యాభై రూపాయలిచ్చి కొనడానికి సంశయిస్తున్నావు' అని అన్నారు. దాంతో సిగ్గుతో తలవంచుకుని ఆ యువకుడు వెళ్లిపోయాడు.





సాధిస్తాడు. అయితే మస్లోవా అప్పీలు కొట్టేయడంతో ఆమెతోపాటు సైబీరియాకు బయలుదేరుతాడు. మరోపక్క తన జీవన శైలిని మార్చుకుని, వేలాది ఎకరాలను రైతులకు ఇచ్చేస్తాడు. విలాసాలను త్యజిస్తాడు. సైబీరియా ప్రయాణం రోజు ఖైదీలు సంకెళ్లతోనే రైలు ఎక్కేందుకు చాలా దూరం నడుస్తూ డజన్లకొద్దీ మరణించడం చూస్తాడు. దుమ్ములో, ఎండలో, బురదలో, మంచులో సాగుతుంది ప్రయాణం. మజిలీల్లో ఇరుకు గదుల్లో పందుల్ని కుక్కినట్లు ఖైదీల్ని కుక్కుతారు. చివరి మజిలీలో అంటువ్యాధులతో ప్రతి రోజూ చాలామంది మరణిస్తుంటారు. వారిలో విప్లవకారుడు క్రిల్ట్సో రాజకీయ ఖైదీగా ఉండటం నెఖ్లూడోను తీవ్రంగా కుంగదీస్తుంది. ఈలోగా చక్రవర్తి క్షమాభిక్షవల్ల మస్లోవా నిర్బంధశిక్ష తొలిగి, ప్రవాస శిక్షమాత్రం మిగులుతుంది. ఆమె నెఖ్లూడోను తిరస్కరించి, సైమన్‌సన్ అనే రాజకీయ ఖైదీని పెళ్లాడాలనుకుంటుంది. దాంతో నెఖ్లూడో నిరాశకు గురైనా, క్రిల్ట్సో మరణం అతణ్ణి కర్తవ్యోన్ముఖుణ్ణి చేస్తుంది. వేలాది ఖైదీలకు జరుగుతున్న అన్యాయాల్ని వ్యతిరేకిస్తూ తన శేషజీవితాన్ని దానికోసమే అంకితం చేస్తాడు.

### కథలు సైతం...

టాల్‌స్టాయ్ మొదటి కథ 'శైశవం'. తర్వాత సైన్యంలో తన అనుభవాలతో 'దాడి', 'కొట్టేసిన అడవి' లాంటి కథలు, యుద్ధానుభవాలతో 'సెవస్తపోల్ ఘటనలు' పేరుతో పలు స్కెచెస్ రాశాడు. యూరప్ పర్యటనల ఆధారంగా 'లూసర్న్' వంటి కథలు రాశాడు. 1855-63 మధ్య నైతిక సమస్యల్ని చర్చిస్తూ 'ఇద్దరు హోస్సార్లు', 'ఆల్బర్ట్', 'మూడు మరణాలు' కథలు రాశాడు. తర్వాత తన దృష్టి నవలారచన వైపు కేంద్రీకరించాడు. ఆ తర్వాత 'అరాచక క్రైస్తవం' వైపు మొగ్గ



# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్ళిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

**చిరునామా :** ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com

నిన్నటి నిజం

## మేధావి మతిమరుపు!

సుప్రసిద్ధ సైంటిస్ట్ లూయీ పాశ్చర్ తన మిత్రులతో విందుకు కూర్చున్నాడు. మిత్రులంతా ద్రాక్షపళ్లు తినబోతుండగా లూయీ పాశ్చర్ వారిని ఆపి, 'ద్రాక్షపళ్లను నీటిలో శుభ్రపరిచిన తర్వాత తినాలి. లేకపోతే వాటి పైభాగంలో చాలా సూక్ష్మజీవులు వుంటాయి. అవి అనేక జబ్బులకు కారణమవుతాయి' అని చిన్న ఉపన్యాసం ఇచ్చి, తన ప్లేటులోని ద్రాక్షపళ్ల గుత్తిని ఒక గ్లాసులోని నీటిలో శుభ్రపరిచి తిన్నాడు. ఆ తర్వాత ద్రాక్షపళ్లమీద వుండే సూక్ష్మజీవులను ఎలా కనిపెట్టవచ్చో వివరించాడు.



స్నేహితులంతా శ్రద్ధగా వింటున్నారు. తను మాటల్లో పడి పొరపాటున ద్రాక్షపళ్లను కడిగిన గ్లాసులోని నీళ్లను తాగేశాడు లూయీపాశ్చర్. అది చూసి అంతవరకూ శ్రద్ధగా వింటున్న స్నేహితులు పగలబడి నవ్వారు. తన మతిమరుపు చర్యకు సిగ్గుపడి పాశ్చర్ కూడా స్నేహితుల నవ్వులతో శ్రుతి కలిపాడు.

చూపాడు. నైతికత, సౌందర్యం, కళలు తదితర విషయాలపై తన ఆలోచనల్ని ప్రచారం చెయ్యడానికి నవలలకన్నా చిన్న కథలే ఉత్తమ సాధనాలని గ్రహించాడు. అసంఖ్యాకంగా కథారచన చేశాడు. ఉన్నత విద్యావంతుల సమస్యల్ని చర్చిస్తూ 'పిచ్చివాని నోట్‌పుస్తకం' వంటి కథల్నీ, లైంగిక సంబంధాల్లో ధనికుల అపసవ్య ధోరణుల్ని నిరసిస్తూ 'దయ్యం' వంటి కథల్ని రాశాడు. 'తీర్థయాత్ర' కథ మానవసేవే మాధవసేవ అని చెబుతుంది. క్షమాగుణం గొప్పదనాన్ని 'నిలకడమీద నిజం' కథ చాటిచెబుతుంది. కలహాలు ఏ స్థితికి దారితీస్తాయో 'ఇరుగూ పొరుగూ' కథ చర్చిస్తుంది. సైనిక జీవితంలోని హింసాధోరణుల వికృతత్వం అందరినీ కబళిస్తుందని 'విందు తర్వాత...' కథ చెబుతుంది. అంతులేని ఆశ ఆత్మవినాశనానికి మూలమన్న నిజాన్ని 'ఎంత భూమి కావాలి?' వివరిస్తుంది.

ఆయన రాసిన ప్రతి కథలోనూ నీతి అంతర్లీనంగా ఉంటుంది. అయితే అది మామూలు నీతి కథగా మిగిలిపోక, గొప్ప కళాసృష్టిగా ఉంటుంది. కథకు తగిన వాతావరణాన్ని కల్పించడంలో, పాత్రల మనస్తత్వాన్ని చిత్రించడంలో ఆయన దిట్ట. అందుకే ఆ కథలు నేటికీ తాజా పరిమళాల్ని వెదజల్లుతున్నాయి. దేశకాలాలకు అతీతంగా అవి మనచుట్టూ జరిగే సంఘటనలుగానే ఉంటాయి. ఆ కథల్ని ఓసారి చదివినా, కలకాలం గుర్తుండిపోతాయి.

మతం, కళలు, సౌందర్యానికి సంబంధించి అసంఖ్యాక రచనలు చేశాడు టాల్‌స్టాయ్. ఇక ఆయన నాటకాలు, డైరీలు, ఉత్తరాలు కూడా ఎంతో సాహిత్య విలువ గలిగినవే. ఆయన రచనలన్నీ 90 సంపుటాల్లో వెలువడి, ప్రపంచంలోని అనేక భాషల్లోకి అనువాదమయ్యాయి. ఆయన సాహిత్యం మానవ హృదయంలో పరివర్తన కల్గిస్తూ మన మెదడుల్ని ఆలోచింపజేస్తుంది. మానవ సంబంధాలు స్వార్థం చుట్టూనే తిరిగే నేటి గ్లోబల్ ప్రపంచానికి ఆయన సాహిత్యం కనువిప్పు కలిగించాలని ఆశిద్దాం.

(టాల్‌స్టాయ్ కథ 'అన్నాచెల్లెళ్లు' ఈనెల విపులలో మీకోసం..)

-ఎన్.వి.యస్.నాగభూషణాచార్యులు

# రచయితలకు, అనువాదకులకు, కార్టూనిస్టులకు
# సూచనలు

- ★ ఇతివృత్తంలో నూతనత్వం, రచనా సంవిధానంలో వైవిధ్యం గల తెలుగు కథలనూ, అనువాద కథలనూ 'విపుల' ఆహ్వానిస్తున్నది. హాస్య వ్యంగ్య రచనలకు ప్రత్యేక ప్రాధాన్యత. ప్రచురించే ప్రతి తెలుగు కథకు రూ. 500/- పారితోషికం ఉంటుంది.
- ★ ప్రచురించిన అనువాద కథకు పారితోషికంగా మూల రచయితకు రూ. 250, అనువాదకునకు రూ. 350 లభిస్తుంది. అనువాద కథలు పంపే వారు ఆయా మూల భాషా రచయితల నుండి లిఖితపూర్వక అనుమతి పొంది కథతోపాటే అనుమతి పత్రం కూడా జతపర్చాలి. మొదటి షీటు లోనే 1. మూలభాష 2. ఆ భాషలో ఆ కథ పేరు 3. రచయిత పేరు, చిరునామా 4. ఆ కథను ప్రచురించిన పత్రిక లేదా సంకలనం పేరు, తేదీ 5. ప్రచురణకర్తల చిరునామా 6. అనువాదకుని చిరునామా తెలియజేయాలి.
- ★ అనువాదకులు మూల రచయిత అనుమతి పొందలేని సందర్భాలలో పై వివరాలు తెలిపితే మేమే అనుమతి పొందగలం.
- ★ అనువాదానికి ఎన్నుకునే కథలు సమకాలీన రచయితలవే అయితే బాగుంటుంది. తెలుగు పాఠకులకు సుపరిచితులయిన ప్రసిద్ధుల కథలు పంపవద్దని మనవి.
- ★ ప్రతి రచనకు తగిన స్టాంపులు అంటించి స్వంత చిరునామా గల కవరు జతపరచాలి. అలా జతపరచకపోయినా పోస్టులోగానీ, ఇతరత్రాగానీ రచనలు పోయినా మా బాధ్యత ఉండదు. పోస్టుకార్డులు జతపరచటం అనవసరం.
- ★ కార్టూన్లు 5×10.5 సెం.మీ. సైజుకు తగ్గించడానికి అనువయిన సైజులో డ్రాయింగ్ పేపరుపై ఇండియన్ ఇంక్‌తో వేసి పంపాలి. కాప్షన్ స్పష్టంగా అర్థమయ్యేలా ఉండాలి. చుట్టూ బార్డర్ తప్పనిసరిగా ఉండాలి. ప్రచురించిన కార్టూన్‌కి రూ. 40 చొప్పున పారితోషికం ఉంటుంది.

**విపుల**

**'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 500 082**

ఈ మెయిల్ : vipula.chatura@gmail.com

# దీప జ్యోతిః పరం బ్రహ్మ..

పండుగలు జాతి జీవనానికి కరదీపికలు. సంస్కృతిలో భాగం. ఎక్కడైనా మానవజీవితం, మనుగడా ఒక్కటే అయినా జాతికీ జాతికీ మధ్య వైవిధ్యం ఉంటుంది. అలాగే సాదృశ్యమూ ఉంటుంది. ఒక సమాజానికి మరొక సమాజానికి మధ్య ఉండే ప్రత్యేక లక్షణాలను వ్యక్తం చేసేవి పండుగలే. ప్రతి జాతికీ కొన్ని ప్రత్యేక పండుగలు ఉంటాయి. మానవ వికాసానికి దోహదం చేసే ప్రక్రియలుగా పూర్వయుగాల నుంచీ పండుగలు కొనసాగుతూ వస్తున్నాయని తెలుస్తోంది. అన్ని జాతులకూ అంతస్సూత్రంగా సమష్టిజీవనం, మానవజీవన ఔన్నత్యం, సంస్కృతి పరిరక్షణ, వారసత్వ కొనసాగింపునకు పండుగలు దోహదపడుతున్నాయి. సమాజాన్ని నిత్యం ప్రభావితం చేస్తూ స్మృతిపథాలలో జారిపోయిన గెలుపురాతల్ని ఇవి నమోదు చేస్తాయి. మత విశ్వాసాలు, ఖగోళశాస్త్ర రహస్యాలు, ప్రాకృతిక స్వభావాలు, ఆరోగ్య రక్షణ విధానాలు పండుగలు మనకి అందించే పరమార్థాలు. పండుగలలో కొన్ని వ్యావసాయిక ప్రాధాన్యాన్ని, మరికొన్ని సంస్కృతి వైభవాన్ని చాటిచెప్పేవి. చెడుపై మంచి సాధించిన విజయానికి గుర్తుగా జరుపుకొనేవీ ఉన్నాయి. దీపావళి పర్వదినం ఇటువంటిదే.

'దీపావళి' అంటే దీపాల వరుస. దీపాల సమూహం. ఇది ప్రతి జీవిలోనూ ఉండే ప్రాణజ్యోతిని సూచిస్తుంది. అనేకానేక జ్యోతులు కలిస్తే ఏర్పడేది ఒకే ఒక్క పరంజ్యోతి. అదే ఈ సర్వజగత్తునూ వెలిగించేదీ, నడిపించేదీ అని ప్రతీకాత్మకంగా ప్రబోధించే దివ్య పర్వదినమే దీపావళి. భారతదేశం ప్రధానంగా ఆధ్యాత్మికతకు పేరు పడింది. అందుకే ప్రతి విషయం

లోనూ వేదాంతపరమైన సమన్వయానికే మన భారతీయ హృదయాలు అన్వేషిస్తాయి. ఈ కోణంలోనూ దీపావళి పండుగ దివ్య సందేశాన్నే అందిస్తోంది.

## పౌరాణికంగా.. చారిత్రకంగా..

దీపావళిపై అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. రాక్షస సంహారం జరిగినప్పుడల్లా ప్రజలు దీపావళి జరుపుకొనేవారు. కృతయుగంలో వామనుడు బలినీ, త్రేతాయుగంలో రాముడు రావణుడినీ, ద్వాపరంలో శ్రీకృష్ణుడు నరకాసురుణ్ణీ సంహరించినపుడు దీపావళి ప్రజలలో ఆనందం నింపింది. విక్రమార్క చక్రవర్తి పట్టాభిషిక్తుడైన రోజూ, అశోకుడు కళింగను జయించిన రోజూ దీపావళిని జరుపుకున్నారని చెబుతారు. శ్రీహర్షుడు దీపావళిని దీపప్రతిపాదనోత్సవంగా ప్రకటించాడు. పృధుమహారాజు దేశాన్ని ధనధాన్యాలతో నింపినందువల్ల దీపావళి జరుపుకున్నారు. అలాగే భోజరాజు, జీమూతవాహనుడూ దీపావళిని సుఖకర రాత్రిగా భావించారు. ఈ విధంగా దీపావళి పర్వదినానికి పౌరాణిక, చారిత్రక ఆధారాలున్నాయి. మహావీరుడు నిర్యాణం చెందిన రోజూ జైనులకు దీపావళే.

శ్రీకృష్ణ అవతారం పరిపూర్ణ అవతారం. కేవలం ద్వాపర యుగంలోనే కాక కలియుగంలోనూ ఆ ప్రభావం ఉంది. శ్రీకృష్ణుడు నరకాసురుణ్ణి చంపినందుకు దీపావళి జరుపుకోవడం అనే విషయం బాగా ప్రాచుర్యంలోకి వచ్చింది. నరకాసురుణ్ణి తన భార్య సత్యభామతో కలిసి సంహరించి, అధర్మపరుడైన పుత్రుణ్ణి సైతం సంహరించిన కీర్తిని శ్రీకృష్ణుడు పొందాడు.

దీపావళి రెండురోజుల పండుగ. మొదటి రోజు నరకచతుర్దశి. రెండో రోజు దీపావళి. ఇది ఆశ్వయుజ మాసంలో వస్తుంది. దీపావళి వెలుగులతోటే పావన కార్తీకమాసమూ ప్రవేశిస్తుంది. ఈ మాసంలో నాలుగోరోజున జరుపుకునే 'నాగులచవితి' కూడా దీపావళికి అనుసంధానమైన పర్వదినమే.

## అంతరార్థాలు అనేకం

పాపాత్ముడూ లోక కంటకుడూ అయిన నరకాసురుని సంహారం అందరికీ ఆనందమే. అందుకే ఆ రోజు పర్వదినం. నరక చతుర్దశినాడు దివ్యమైన శక్తులు కల దేవతలు ఆయా వస్తువులలో విశేషంగా ఆవహించి ఉంటారని శాస్త్రవచనం.

తైలే లక్ష్మీః జలే గంగా చూర్ణే సరస్వతీ తథా
వస్త్రే విష్ణుః ఔషధేచ వైద్యో ధన్వంతరిస్తథా
విస్ఫులింగే తథా జీవః పరమాత్మాచ దీపకే
దీపావళ్యాంచ సంపూజ్య
నరోముచ్యేత సంకటాత్

లక్ష్మీదేవి నూనెలోనూ, నీటిలో గంగాదేవి, సరస్వతి సున్నిపిండిలో, విష్ణువు కొత్త వస్త్రాలలో, ధన్వంతరి బెల్లమూ సొంఠిలలో, పరమాత్మ దీపంలో, జీవాత్మ నిప్పురవ్వలలో ఉంటారని ప్రతీతి. అందువల్ల శరీరానికి తైలాన్ని పట్టించి అభ్యంగన స్నానం చేయాలి. ఈ వస్తువులను దీపావళినాడు తప్పకుండా వినియోగించాలి. ఈ స్నానం కూడా వేకువనే చేయాలి. ఈ సమయంలో స్వాతీ నక్షత్రకాంతి నీటిపై తన ప్రభావాన్ని చూపుతూంటుంది. మరుసటిరోజు అమావాస్య కాబట్టి సూర్యుడూ తన ప్రభావాన్ని సంపూర్ణంగా చూపిస్తాడు. నీటికి అధిపతి



అయిన వరుణదేవుడు తన అనుగ్రహాన్ని నీళ్ళలో ఉంచి సిద్ధంగా ఉంటాడు. ఇటువంటి సమయంలో చేసే స్నానం శుభప్రదమూ లక్ష్మీ కటాక్ష ప్రాప్తికరమూ అని విజ్ఞుల ఉవాచ. ఈ నరకాసుర వృత్తాంతంలో ఖగోళవిషయాలు, సందేశాలూ ఉన్నాయి. నరక చతుర్దశి రోజున తులా రాశి తూర్పు క్షితిజ రేఖ మీద ఉదయిస్తుంది. ఆ రోజులలో మేషరాశి సూర్యాస్తమయ వేళలోఉదయిస్తుంది. అప్పుడు ఈ రాశిపై సూర్యుడు, చంద్రుడు ఉంటారు. అస్తమయ సమయం కాబట్టి సూర్యున్ని చీకటి ఆవరించి నల్లగా ఉంటుంది. సూర్యున్ని ఆవరించి ఉన్న నల్లదనమే శ్రీకృష్ణునికి ప్రతీక. అలాగే చంద్రోదయ వేళ వ్యక్తమయ్యే తెల్లదనం సత్యభామకు ప్రతీక. మేషరాశి పోగానే కన్యారాశి ప్రవేశిస్తుంది. నరకాసుర సంహారం కాగానే కన్యలకు విముక్తి కలగడంలోని ఆంతర్యమిదే. చేసిన తప్పులకు శిక్ష తప్పదని నరకుడి కథ మనకి తెలియజేస్తుంది. చెడును వదిలి పవిత్రులుగా మారడానికీ ఈ రోజే నాంది పలకాలనీ ఈ పర్వదినం చెబుతోంది. దీనికోసం ఏర్పరచిన ఒక ఆచారమూ ఉంది. నరకచతుర్దశి రోజున నరకుడి విగ్రహాన్ని గడ్డితో గానీ కాగితాలతో గానీ తయారుచేస్తారు. దానిని ఊరేగించి ఊరిబయట తగలబెట్టి అభ్యంగ స్నానం చేయాలి. ఈ స్నానంతో పాపం పటాపంచలు అవుతుంది.

మరుసటి రోజు దీపావళి. దీపం సౌభాగ్య చిహ్నం. శుభకరం. సంపత్కరం.

**దీపజ్యోతిః పరం బ్రహ్మ దీపస్సర్వతమోపహః**
**దీపేన సాధ్యతే సర్వం సంధ్యాదీప!**
**నమోస్తుతే**

దీపమే పరబ్రహ్మ స్వరూపం. దీపమే లక్ష్మి. దీపముంటే జ్ఞానం, ఐశ్వర్యం కలుగుతాయి. అందుకే ఇంటిని దీపాలతో అలంకరించి లక్ష్మీదేవిని స్వాగతిస్తారు. మంచినూనెతో గానీ, నేతితో గానీ పెట్టిన దీపాలతో ముందుగా దేవుడికి దీపారాధన చేస్తారు. మొదటి దీపాన్ని తులసికోట వద్ద సమర్పిస్తారు. క్షీరసముద్రం నుంచి వెలుగై పుట్టిన లక్ష్మీదేవీ భూమి మీద సర్వ సంపదలూ కలగడానికి కారణభూతురాలు. అందుకే దీపావళిరోజున లక్ష్మీపూజ చేస్తారు. అంతేకాదు 'అపమృత్యు నివారణార్థం' ఇంటి ముందు 'బలిదీపం' పెడతారు. ఇది చక్కటి ఆరోగ్యాన్నిస్తుందని నమ్మిక.

**దత్తోదీపః చతర్దశ్యాం నరకప్రీతయే మయా**
**చతుర్వర్తి సమాయుక్తః సర్వపాపోపశాంతయే**

ఈ శ్లోకం పఠించాక దీపం వెలిగిస్తారు. దీపాలతో ఇంటి ప్రాంగణాన్ని అలంకరించి దివిటీలు కొడతారు. 'దుబ్బు దుబ్బు దీపావళి... మళ్ళీ వచ్చే నాగుల చవితి' అంటూ ఆముదం కర్రకు నూనెలో ముంచిన గుడ్డపీలికను కట్టి దానిని ముట్టించి ముంగిట్లో ఆరిపోయేంతవరకూ కొడతారు. తదనంతర కాలంలో బాణాసంచా కాల్చడానికి ఇదే ప్రేరణనందించి ఉంటుంది.

## పరమార్థ ప్రదాయికం

దీపావళి పర్వదినంలో ఎన్నో పరమార్థాలున్నాయి. మనం వెలుగే కావాలనుకుంటాం. వెలుగంటే జ్ఞానం. జ్ఞాన చిహ్నమైన దీపపు వెలుగు అజ్ఞానమనే అంధకారాన్ని రూపు మాపుతుంది. అందుకే దీపావళి ప్రత్యేకమైన పండుగయింది. శాస్త్రప్రతిపత్తి, పౌరాణిక వ్యుత్పత్తీ కలదయ్యింది. మార్కండేయ, స్కంధ, భవిష్య, పద్మపురాణాలు దీపావళి ప్రాశస్త్యాన్ని తెలియజేస్తున్నాయి. మార్కండేయ పురాణంలో మూడు రాత్రుల ప్రస్తావన ఉంది. 1. కాళరాత్రి 2. మహారాత్రి 3. మోహనరాత్రి. మొదటిది హోళీ, రెండోది శివరాత్రి, మూడోది దీపావళి. వర్షంవల్ల ఏర్పడే

వాతావరణ కాలుష్యాన్నీ, క్రిమికీటకాదుల ప్రభావాన్నీ మందుగుండు సామగ్రి పేల్చటం ద్వారా అరికట్టవచ్చు. బాణసంచా కాల్చే ఇంటినుంచి దరిద్రదేవత (జ్యేష్టాదేవి) భయపడి పారిపోతుందనీ, అప్పుడు లక్ష్మీ దేవి చిద్విలాసంగా ప్రవేశిస్తుందనీ విశ్వాసం. దీపావళి అఖండజ్యోతి. మన భావాలను, సంకల్పాలను స్థిరచిత్తంతో సాధించుకొనేందుకు స్ఫూర్తినిచ్చే మహా జ్యోతి. ఆ జ్యోతికోసమే తమసోమా జ్యోతిర్గమయ... ధియోయోనః ప్రచోదయాత్.. అని వేదాంతులు వేడుకొంటున్నారు.

'నమస్తేస్తు మహామాయే శ్రీపీఠే సురపూజితే శంఖ చక్ర గదా హస్తే మహాలక్ష్మీ నమోస్తుతే' అని అష్టలక్ష్మిని కీర్తిస్తూ దివ్వెలు వెలిగిస్తూ స్వాగతిస్తుంటారు సాధకులు. జ్యోతి స్వరూపిణి అయిన శ్రీశక్తిని చీకటి కుహరంలాంటి స్మృతి పథంలోనికి ఆహ్వానిస్తూ ఉంటారు. ఎందుకంటే లక్ష్మీ దేవి 'ఆర్ద్రాం, పుష్కరిణీం, పుష్టిం' అని పేరుగాంచినది. తన కటాక్షాలతో లోకాలను పావనం చేసిన ఆ తల్లి దానధర్మాలు లేనిచోట ఉండదని విష్ణుమూర్తి బలిచక్రవర్తికి వరం ప్రసాదిస్తూ చెప్పాడని పురాణ కథనం. సంపదలంటే భౌతికమైనవే కాదు భగవద్విభూతులూ, ఆధాత్మిక సంపదలూ కూడా లక్ష్మీ స్వరూపాలే. ఈ సంపదలన్నింటినీ శ్రీదేవి- ఆది, సంతాన, గజ, ధన, ధాన్య, విజయ, ధైర్య, మహా లక్ష్ములుగా అనుగ్రహిస్తుంది. అందుకే దీపావళినాడు లక్ష్మీపూజను విశేషంగా చేస్తారు.

దీపావళిని ఉత్తరభారత దేశంలో లక్ష్మీ పూజగానూ బెంగాల్‌లో కాళీపూజగానూ భావిస్తారు. సరస్వతీపూజ కూడా చేస్తారు. హిందువులతో పాటు జైనులు, మహమ్మదీయులు, క్రైస్తవులూ ఈ పండుగను జరుపుకొంటారు. బర్మా, ఇండోనేషియాలలో దీపోత్సవాలు జరపడానికి మన దీపావళే ప్రేరణ. చైనీయుల గ్రంథాలలోనూ దీపావళి ప్రసక్తి ఉంది.

ఉత్తరాదిన దీపావళి రోజున వ్యాపారవేత్తలు కొత్త పద్దు పుస్తకాలను ప్రారంభిస్తారు. ధన, కనక, వస్తు, వాహనాదులను పూజిస్తారు. జాతక ఫలాలను చెప్పించుకొని దానికి తగినట్లుగా మళ్లీ దీపావళి వచ్చేవరకూ జాగ్రత్తగా వ్యాపారం చేసుకుంటారు. లక్ష్మీ దేవికి బంగారు కానుకలు సమర్పించి పూజిస్తారు. నీటిలో దీపాల్ని వదిలి వాటి ప్రయాణం తీరుతెన్నులపై తమ జీవనగమనం సాగుతుందని నమ్ముతారు.

మన రాష్ట్రంలో దీపావళి రోజున కౌముదీ మహోత్సవం మరుసటి రోజున 'కేదార గౌరి' వ్రతం చేస్తారు. బలి చక్రవర్తి మహాదాత. త్యాగశీలి. అతడిని 'విష్ణునా వసుధా లబ్ధా ప్రీతేన బలయే పునః ఉపకార కరో దత్తాశ్శాసురాణాం మహోత్సవం' అంటూ పూజించటం కౌముదీ ఉత్సవ వైశిష్ట్యం. కేదారం అంటే పంటపొలాలు. వ్యవసాయదారులు తమ కష్టానికి తగిన ఫలితం లభించాలని, పంటపొలాలన్నీ పచ్చగా కళకళలాడాలని కోరుకుంటారు. అలాగే జీవితం సాగిపోవాలని ఈ వ్రతం చేస్తారు. కొండప్రాంతాలలో దీపావళి రోజున గౌరమ్మనోము చేస్తారు. ప్రకృతి స్వరూపులైన స్త్రీ దేవతలను పూజించడమే ఈ ఆశ్వయుజం ప్రత్యేకత. యమున తన అన్న యముడికి ఈ రోజే విందు భోజనం పెట్టింది. అందుకే దీపావళినాడు 'భగినీ హస్త భోజనం' పేరున సోదరి చేతి వంట తినడం ఒక సంప్రదాయం.

ఇలా సంస్కృతి మూలాలతో ఆనందోత్సాహాలతో విజ్ఞానదాయకంగా అలరారే దీపావళి ఈ సర్వజగత్తునూ ప్రకాశింపజేస్తుంది.

**-డాక్టర్ అద్దంకి శ్రీనివాస్**

# జక్కం వీరన్న మా ఊరివాడే

- వంశీ



## మా పసలపూడి కథలు

వంశీ.. కథాసుధా విరించి
- ఈ మాటలంది ఆయన ఆది గురువులు బాపు, రమణ.

మధుర భావాల విపంచి
- ఈ మాటలూ వంశీ గురించే. అన్నదీ ఆ ఇద్దరే. అంటే- ఇద్దరు గురువుల ముద్దుల శిష్యుడు వంశీ.

కథల, సినీ సంభాషణల, స్క్రీన్ ప్లేల, పాటల రచయిత.. దర్శకుడు, సంగీత దర్శకుడు, నటుడు, గాయకుడు కూడా. ఈ నవంబరు ఇరవైకి ఆయనకి యాభైనాలుగేళ్లు.

తూర్పుగోదావరి జిల్లాలోని పసలపూడిలో పుట్టిన ఈ జేవీకే నారాయణరాజుకు తన ఊరంటే ప్రాణం. గోదావరన్నా అంతే. నాటి 'మంచు పల్లకీ' నుంచి నేటి 'సరదాగా కాసేపు' దాకా ఎన్ని సినిమాలకు రూపుదిద్దినా, వందలాది కథలతో ఆబాలగోపాలాన్నీ మురిపిస్తున్నా.. మూలబిందువులు రెండే రెండు. ఒకటి గోదావరి, రెండు పసలపూడి.

'నేను చూసిన జీవితం, చదివిన సాహిత్యమే నా కథలకి ప్రేరణ' అంటారు వంశీ. అందుకే 'మా పసలపూడి కథలు' రంగుల్లో పలు ముద్రణలు పొందాయి. కథాభిమానుల్ని అలరించాయి.

ఆ కథల కబుర్లేమిటో ఆయన మాటల్లోనే తెలుసుకుందాం.

తొలినుంచీ నా అలవాట్లు రెండు. చూసింది గుర్తుపెట్టుకోడం, తెలిసిందే రాయడం.

నేను పుట్టి పెరిగిన చోటనున్న భాషన్నా, యాసన్నా నాకెంతో ఇష్టం.

నామీద ప్రభావం చూపిన రచయితలు బుచ్చిబాబు, చలం, లత. వారి స్ఫూర్తితోనే సహజంగా రాస్తూ వస్తున్నాను.

నా కథల్లో పాత్రలు ఇంటిపేర్లతో సహా ఉంటాయి. ఆ నేటివిటీనే చదువరులు ఎప్పుడూ ఇష్టపడుతుంటారు.

పసలపూడి కథలలోని 'జక్కం వీరన్న' కథనే తీసుకుంటే.. మేస్త్రీ వీరాస్వామి, కంసాలి బుద్ధాచారి, శ్రీ రాజా వత్సవాయి వెంకట్రాఘవరాజుగారనే కుక్కలరాజా, పెద్దాపురం నుంచి వచ్చిన ముసలి మేస్త్రీ.. ఇవీ పాత్రలు.

### కథేంటో చెప్పమంటారా?

కొమ్ములు తిరిగినోళ్ల దగ్గర వడ్రంగిపని నేర్చుకొచ్చాడు వీరన్న. పసలపూడి ప్రాంతంలో గొప్పమేస్త్రీగా అతనికి పేరు. మడతమంచాలు, కుర్చీలు, బల్లలు.. ఇవేకాకుండా ద్వారబంధాలకి ఎడాపెడా (అటూ ఇటూ) నెమళ్లు, కిటికీల పక్కన చిలక్కొయ్యలు, ఉయ్యాలబల్లల అంచులకు పందిరి మల్లెతీగెలూ.. చెక్కే పనులకి అతన్ని పిలుస్తుంటారు. చివరికి దేవదారు చెక్కమీదైనా గణేశుడి బొమ్మ చెక్కగల పనివాడతను.





కాబట్టే అతనికి ఎక్కువ డబ్బిస్తారు. అవసరమైనవాళ్లు సైకిలేసుకొని ఇంటికొస్తారు, ఎనకాల ఎక్కించుకుని తీసుకెళ్తుంటారు. సొంతంగా తయారుచేసుకున్న ఉలుల్ని అతను ఖాకీ సంచులు, చెక్కపెట్టెల్లోంచి తీస్తుంటే చిత్రంగా చూస్తుంటారు జనం. పనికాగానే సాయంత్రానికల్లా ఇంటిదగ్గర దిగబెడుతుంటారు.

అదే ప్రాంతంలోని రాజుగారు గొప్ప విలాసమందిరం కట్టించాలని సిద్ధమయ్యారు. చెరువులో విహారానికి లాంచీని కూడా తయారుచేయిస్తున్నారు. దాని తలుపులు, లోపల కుర్చీలు, కిటికీలకూ నగిషీల కోసం వీరన్నని పిలిపించారు.

కుక్కల్ని పెంచే రాజావారు వాటికోసం రోజూ మేకల్ని కోసి పలావు వండేవారు. ఆ మాంసం, ఆ పలావులో కొంత భాగాన్ని విడిగా తీసి ఇతర గొప్ప మేస్త్రీలతోపాటు వీరన్నకీ పెట్టేవారు.

చాలా తాపీగా పనిచేసేవాడతను. ఏక చెక్కపైన ఏనుగు బొమ్మలు చెక్కడానికి చాలావారాలు పట్టింది. అవయ్యాక, పందిరి పట్టెమంచం మీద నెమలి బొమ్మలు చెక్కాడు. పక్కనే ఉన్న అడవినుంచి వచ్చిన నెమలొకటి వీరన్న చెక్కిన నెమళ్ల మధ్య నిలబడింది! తన ముక్కుతో ఆ బొమ్మ నెమళ్ల ముక్కుల్ని పొడవసాగింది. చూసి అవాక్కయ్యారు రాజుగారు. ప్రాణంపోసుకున్న ఆ బొమ్మల్ని ఆయన మిత్రులూ మెచ్చుకోవడంతో, అదే సాయంత్రం ఓ పార్టీ ఏర్పాటు చేశారు. విదేశాల మందు సీసాకాయలు తెప్పించడంతో పాటు, అడవిప్రాణుల్నీ రుచికరంగా వండించారు. 'వీటిని మాతోపాటు నువ్వూ పుచ్చుకోవాలి' అంటే 'అలవాటు లేద'న్నాడు వీరన్న. ఆయన తిడుతున్నా పట్టించుకోలేదు. తన మానాన తను మంచానికి లతలు చెక్కసాగాడు! 'రాజహంస' పేరుపెట్టబోతున్న లాంచీపైనా రెండు హంసల్ని చెక్కడం మొదలెట్టాడు. లాంచీ మధ్యభాగానికి వచ్చేసరికి, ఆ రెండు హంసలూ ఒకటవడమే అక్కడ ప్రత్యేకత!

అన్ని పనూలూ ఒక్కడిగానే చేసుకుంటున్న వీరన్న మళ్లీ రాజావారి మిత్రుల మనసు దోచుకున్నాడు. మరోసారి పెద్ద విందు ఏర్పాటైంది. ఆ రాత్రి రాజు 'వినయపూర్వక కోరిక' కారణంగా, కాస్తంత మందు పట్టించాడు వీరన్న. తదుపరి అక్కడ ఏ విందు జరిగినా, వచ్చి తాగడం అతనికో అలవాటుగా మారింది. పనులన్నీ పూర్తయ్యేసరికి, పచ్చి తాగుబోతు అయ్యాడతను.

జనం అతన్ని పన్లోకి పిలవడం మానేశారు. కోపగించి 'ఇక ఎవరు పిలిచినా రాను' అని ప్రకటించి చాటింపూ వేయించాడు. గుడిదగ్గర ఒట్టేసుకున్నాడు. తిన్నగా వంతెనకింద మిల్లు దగ్గరికెళ్లాడు. అక్కడ ఇరవై అడుగుల టేకుచెక్కను అరువు తీసుకుని గొలుసు చెక్కసాగాడు వీరన్న! ఎక్కడా అతుకనేది కాకుండా, ఇత్తడి గొలు

సులా చెక్కతో చెక్కాడు. ఆరు నెలల్లోగా ఇరవై అడుగుల చెక్కగొలుసు తయారు చేశాడతను.

తోటివారంతా ఆకాశానికెత్తేసరికి, సంబర పడ్డాడు వీరన్న. వాళ్ళు 'మందుపార్టీ ఇస్తున్నాం' అనడంతో, 'సరే.. మీకోసం.. ఈ రోజువరకు మాత్రమే' అంటూ వెళ్లి తాగాడు. మరునాడు మళ్లీ మందుమీదకె ళ్ళింది మనసు. మొత్తానికి తాగుడే అతన్ని గెలిచింది! కొన్నాళ్లకే, చేతుల్లో వణుకు! ఇప్పుడు సారాకొట్టు దగ్గరికే చేరాడతను. అక్కడే కూర్చొని, తను చెక్కిన 'పొడుగాటి గొలుసు'ను జనానికి చూపించసాగాడు. అడుక్కుంటూ ఆ డబ్బుతోనే సారా తాగుతూ తుది రోజులు గడపసాగాడు.



'జక్కం వీరన్న' కథాచిత్రం

ఇదంతా మా ఊళ్లో నిజంగా జరిగింది. అతని పేరు వెంకన్న. పేరుని నా కథలో మార్చాను. అతన్ని నా చిన్నపుడు చూస్తుండేవాడిని. ఆ పరిశీలనే 'జక్కం వీరన్న' కథగా జనం ముందుకొచ్చింది.

### మరో కథ.. వెనక కథ

నా కథల్లో నాకెంతో నచ్చిన మరో కథ 'మలబార్ కాఫీ హోటల్'. 'బాబాయ్ హోటల్' స్ఫూర్తిగా రాశానీ కథని. ఇందులో- హోటలతను కిళ్లీరన్న ప్రతి ఆదివారమూ పలావూ పెరుగుపచ్చడీ చేసి వేడి వేడి పొట్లాలు కడ్తాడు. ఊళ్లోని ఇళ్లకు వాటిని అందించి, డబ్బులకి మర్నాడు వెళ్తాడు. వంటల రుచిని మెచ్చుకునేవాళ్లతో 'వెనకటికి ఆ అరవ మనిషి చేసిన పలావు తింటే, ఈ జన్మకి మర్చిపోరు. అసలా మనిషి ఎంత గొప్ప దనీ' అంటాడు నవ్వుతూ. మరో సంద ర్భంలోనూ ఊళ్లో అతను ఆ మాటే అంటే 'ఎవరావిడ? ' అనే ప్రశ్న వస్తుంది. 'ఇవేళ ఈ చేత్తో అన్నం తింటన్నానంటే, ఆమె పెట్టిన భిక్షే' అని బదులిస్తాడతను. ఏభై ఏళ్లక్రితం కథనీ ఊళ్లోవాళ్లకి వినిపిస్తాడు.

'ఆమె పేరు శివగామి. చాలా అంద గత్తె. తెల్లవారకముందే హోటేలు తెరిచి, చల్ది పొద్దు దాటేలోపే మూసేసేది. 'టీ' అంటూ సరిగ్గా అప్పుడే లేచేవాడు ఆవిడ మొగుడైన బాలన్ నాయరు. వయసులో ఆమెకంటే కుర్రోడు, టీ నచ్చకుంటే ఆమె ముఖం మీదేసేవోడు! అన్నీ భరించేది.

ప్రతి వారం రాంపురం వెళ్లి, సరుకులు తీసుకొచ్చేదావిడ. ఓరోజు తన పాక ముందు కూర్చున్న కేశవన్‌ని చూసి అవా క్కయింది. మాసిన లుంగీ, చిరిగిన చొక్కా, వడలిపోయిన మనిషి! అతన్ని పలకరించి లోనికి తీసుకెళ్లింది. హోటల్లో పనిచేసే కిళ్లీరన్నతో అతనికి బట్టలు తెప్పించి, కుట్టడానికి కబురెట్టింది. కేశవ న్‌కి నున్నగా గెడ్డం గీయించింది. అతనికి ఇష్టమైనవి వండి వడ్డిస్తుంటే, రానే వచ్చాడు నాయర్. కేశవన్‌ని చూడనే చూశాడు. ఆ రాత్రే తాగొచ్చి ఆమెని తిట్టాడు, కొట్టాడు. అయినా కిక్కురు మనలేదావిడ. మర్నాడు ఎప్పటిలానే హోటేలు తెరిచేసింది.

తర్వాతా కేశవన్ రావడం, ఆవిడ.. సేవలు చేయడం! సన్నగా తేగ తొక్కలా అయిపోయిన అతనో రోజు వచ్చి ఏదో చెప్పేసరికి భోరుమంటూ ఏడుస్తా ఊళ్లో

## పెద్దలేమన్నారు..

పలుకులైనా కాకపోతిమి పసలపూడి కథలలో
కలములైనా కాకపోతిమి ఈ కథలు కురిసిన సుధలకు..

**– బాపు, రమణ**

మనసుని మొత్తంగా ఆకట్టుకున్న కథలివి

**– బాలాంత్రపు రజనీకాంతారావు**

ఆప్యాయంగా చేతులుపట్టుకుని తీసుకెళ్తున్న అనుభూతి.. ఈ కథలు చదివితే కలుగుతుంది

**– గుమ్మడి**

ఈ అన్ని కథలకీ కేంద్రబిందువు పసలపూడే. అయినా కథాస్థలం పలు వృత్తాలుగా విస్తరించింది. కథలన్నిట్లోనూ మానవ సంబంధాలున్నాయి,

**– వాడ్రేవు చినవీరభద్రుడు**

కెళ్లింది. తన నగలన్నీ తాకట్టుపెట్టి, డబ్బు తెచ్చి అతనికిచ్చింది. నెల తర్వాత ఎటో వెళ్లిపోయింది. తర్వాత తెలిసింది.. కేశవన్‌కి కేన్సరని! అతనే ఆమెకి మొగుడని!! నాయర్.. రెండోవోడని!!! కేశవన్‌తో ఓనాడు గొడవ పడ్డప్పుడు, ఆ పౌరుషంలోఒక రాత్రి నాయర్‌తో తప్పుచేసింది. అదే అలుసుగా 'నేను నా పెళ్లాంపిల్లల మాటెత్తను, మొగుడి ఊసెత్తనని నువ్వు మాటియ్యి' అన్నాడు. మర్నాడే ఈ ఊళ్లో కొచ్చిపడ్డారు వాళ్లిద్దరూ. మరి కేశవన్‌ని మళ్లీ ఎందుకు చేరదీసిందంటే.. అతనింక ఎన్నాళ్లో బతకడని! అందుకనే అన్నంపెట్టింది, ఆదరించింది. ఇందులో ఆమె తప్పేముందీ? '

ఇదంతా జరిగిన కథే. వీళ్లంతా నేను గమనించిన మనుషులే. మనిషి.. అందునా ఆడమనిషి.. అసలు మనసును తెలిపే కథ కాబట్టే, ఇది కూడా నాకిష్టం.

మా పసలపూడి కథల పుస్తక ఆవిష్కరణను హైదరాబాద్‌లోనే ఏర్పాటుచేశాను. మా ఊరివాళ్ళనే, నా కథల్లోని ఆ పాత్రలనే సభకి ఆహ్వానించాను. అంతా వాళ్ళతోనే ఉన్నాను. వాళ్ళతోనే మాట్లాడాను. వాళ్ళతోనే తిన్నాను, తిరిగాను. ఎంత గర్వం కలిగిందో చెప్పలేను, చెప్పడానికి నాకు మాటలు చాలవు.

ముందే చెప్పానుకదా- నా గురువర్యులు బాపు, రమణలని. ఏ కథ రాసినా ముందుగా క్లుప్తరూపంలో బాపుగారికి పంపేవాడిని. ఆయన నుంచి వచ్చిన బొమ్మల్ని చూసి, వాటినే ముందు పెట్టుకొని, రాస్తూ వచ్చాను కథల్ని.

పసలపూడి కథల అట్టమీద బొమ్మ, లోపలి బొమ్మలూ బాపువే.

నా కథల్లో అన్నిటికీ ఆయన బొమ్మలే. రంగుల బొమ్మల్ని ఆయన ఎక్కువగా వేసింది నా కథలకే.

పసలపూడి కథలు మొదట్లో నలభైరెండే. అవే ఆ తర్వాత యాభైరెండు, అరవైరెండు, చివరికి డెబ్బయిరెండు కథలయ్యాయి. 'స్వాతి'లో ధారావాహికగా వచ్చాయి. పుస్తకంగా వచ్చాక ఇంకా ఎంతమందో కొనుక్కున్నారు. సంతకం కోసం నన్ను వెతుక్కుంటూ వచ్చారు.

చలనచిత్ర జాతీయ పురస్కారాన్ని రాష్ట్రపతి చేతులమీదుగా తీసుకున్న వాడ్ని నేను. అప్పుడూ కలగనంత సంతోషం.. నాకు ఈ సంతకాలు పెడ్తున్నపుడు కలిగింది.

మా ఊరికే మాటలొస్తే ఏమంటుందో తెలుసా? 'నా గురించీ నా బిడ్డల గురించీ కథల్లాగ రాసేపని వంశీ అని మా అబ్బాయికి అప్పగించేనండి. అతను నా శిరస్సునుంచి సిరిపాదందాకా రాసుకుంటూ పోతూంటే చదూకుంటూ పోయారు మీరు. 'మీ పసలపూడి.. మా చుట్టూరా కూడా ఉంది' అనేసి బోల్డంత సంబరపడ్డారంట మీరు' అని.

కోనసీమ యాసతోనే 'ఆయ్.. మాది పసలపూడి' సినిమా చేయాలనీ నాకుంది.

సేకరణ : **శరత్‌బాబు**




# హైపర్ టెన్షన్

-పుష్పాంజలి

"గుడ్ మార్నింగ్ డాక్టర్"

"ఏం గుడ్ మార్నింగో! నాకింతకన్నా బాడ్ మోర్నింగ్ ఇంకోటి లేదు"

"ఎందుకలా అంటున్నారు"

"ఎందుకని అడుగుతారా? ఈ స్కూటర్ చెడిపోయి చచ్చింది. చాలా దూరం నెట్టుకొచ్చాను. ఈ వయసులో ఎవరైనా నెట్టగలరా? మీరే చెప్పండి"

"......"

"సరే పోనీలెండి. ఈ వాళేం పని మీదొచ్చారు?"

"చాలా రోజులైంది కదా. ఓసారి చూపించుకొందామని"

"ఆం. చాలా రోజులా? ఇన్ని రోజులెందుకు రాలేదు."

"నేను బిజినెస్ పని మీద ఇంకో ఊరికెళ్లాను. అక్కడే ఒకసారి టెస్టు చేయించుకున్నాను. బి.పి. నార్మల్ గానే ఉంది."

"ఏమిటి. ఇంకో ఊళ్లో ఇంకో డాక్టరా? ఏ వూరది? ఎవరా డాక్టర్, చెట్టుకిందో గోడకిందో ఉండేవాడా".

"..........."

"సరే పోనీండి. జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు నేను కరెక్టుగా టెస్ట్ చేస్తాను. ఒరే పర్లోకం, పర్లోకం... ఏడీ ఎంతకీ రాడే! ఎక్కడ చచ్చాడో, నేనే తెస్తాను బి.పి. ఆపరేటస్. మీరీ

స్టూల్ మీద కూచోండి. ముందిది చెప్పండి. నేనిచ్చిన మందులు వాడుతున్నారా, మీ ఫైలు... ఒరేయ్ పర్లోకమా? ఎక్కడ చచ్చావురా".

"క్షమించండి. పరలోకం ఇంకా రాలేదల్లే ఉంది. మీరిచ్చిన కోర్స్ పూర్తిగా వాడాను."

"ఆ! ఏమిటీ! కోర్సా! ఎవరు చెప్పారు మీతో అది కోర్సనీ? అన్ని నిర్ణయాలూ మీవేనా! మీరా డాక్టరు? నేనా? "

"............ "

"ఊ సరే! ఏదీ చెయ్యిలా చాపండి.... ఆc... అరే! బి.పీ. నార్మల్‌గానే ఉన్నదే. రాత్రులు బాగా నిద్రపడుతోందా? "

"బ్రహ్మాండంగా పడుతోంది డాక్టర్"

"పోనీలెండి మీకైనా బాగా నిద్రస్తోంది. అదృష్టవంతులు. నాకు చాలా రోజులుగా సరీగ్గా నిద్రే లేదు."

"అయ్యో! డాక్టరుగారు. రెస్టిల్ టాబ్‌లెట్ వేసుకోండి. నిద్రలేకపోతే ఆరోగ్యం పాడయిపోతుంది."

"నిద్ర లేక పోవడమేనా? రాత్రయితే కాళ్లు నొప్పులు."

"అయ్యో విటమిన్ బి కాంప్లెక్స్ తీసుకోకూడదా"

"అదొక్కటేనా! మలబద్ధకం..."

"పచ్చి కూరగాయాలు తినకపోయారా, నేనదే చేస్తాను"

"ఇందాకట్నుంచీ చూస్తున్నా. మీరే నాకు మందుల గురించీ ట్రీట్‌మెంట్ గురించీ చెబుతున్నారు. మీరే డాక్టర్లు మేమే పేషంట్లల్లే ఉందే."

"..........

"సరే. మీకిప్పుడు కొన్ని మందులు రాసిస్తా. అవి వాడాలి. కంటిన్యూయస్‌గా వాడాలి."

"సరేనండీ"

"మధ్యలో అదే కోర్స్ నేను వాడేసి మానేశా అనే మాట రాకూడదు. పర్లోకం! పర్లోకం!"

" ..... "

"అబ్బబ్బా! ఈ దొంగవెధవతో చస్తున్నాను. ఎవర్నని ఏం లాభం? అంతా ఖర్మ. నేను చేసుకున్న ఖర్మ. నాకు దొరికే కాంపౌండర్లూ అంతే! పేషంట్లు అంతే! ఏం బతుకో ఏమో! అబ్బా! తల పగిలిపోయేటంత నొప్పిగా ఉంది."

"డాక్టరుగారూ.. మీరు నా మీద దయ వుంచి ఒక డిస్ప్రిన్ వేసుకోండి."

"చూడండి. దిసీస్ వెరీబాడ్. వెరీబాడ్. అయామ్ టెల్లింగ్యూ. అయామే డాక్టర్. యస్! అయామ్ ఏ డాక్టర్. నాకు మీరేమీ చెప్పనక్కర్లేదు. విన్నారా"?

"సారీనండీ డాక్టర్‌గారూ. నాదొక చిన్న సలహా వింటారా? "

"వినక చచ్చేదా? చెప్పుకరండి."

"దయచేసి మీరు బి.పీ. ధరోగా చెక్ చేయించుకుని మంచి ట్రీట్‌మెంట్ తీసుకోండి."

"ఆc... ? "

"వస్తానండీ. బై. ట్రీట్‌మెంట్ మర్చిపోకండి."

©

# గుర్తింపు

## -దూరి వెంకటరావు



గుర్తింపు కోసం అదేపనిగా ప్రాకులాడే ప్రబుద్ధులెవరైనా ఉన్నారంటే వారిలో అందరికంటే ముందుంటాడు మన వెంకట్. చేస్తున్న చిరుద్యోగంలో పేరొచ్చే అవకాశం ఎటూలేదు. అందుకే ప్రవృత్తిగా మరో రంగాన్ని ఎంచుకోవాలనుకున్నాడు. అంతే, అతడి దృష్టి సాహిత్యం మీద పడింది. అద్దైతే తేలిక అనుకున్నాడేమో! వెంటనే కలం తీసి కాగితం మీద బరబరా నాలుగు కవితలు బరికేసాడు. అవి ఎక్కడా అచ్చు కాకపోవడంతో స్నేహితులకు వినిపించి వేధించడం మొదలుపెట్టాడు. అంతేకాదు తనో రైటర్‌నని

చెప్పి ఓ స్థానిక సాహితీ సంస్థలో సభ్యుడిగా చేరి వాళ్ళ బుర్రల్ని సైతం తినేయసాగాడు. నెల నెలా కచ్చితంగా సభ్యత్వరుసుం చెల్లించేయడం వల్ల అతగాడిని ఏమీ అనలేకపోతున్నారు.

తను చేరిన సంస్థ ద్వారా ఒకటి రెండు సన్మానాలు చేయించుకుని పేపరుకెక్కితే రచయితగా ముద్ర వేయించుకోడానికి ఢోకా ఉండదనుకున్నాడు. అనుకోవడమే ఆలస్యం తనని జనానికి యువ కవిగా పరిచయం చేసి స్వర్ణకంకణంతో సన్మానించి ప్రోత్సహించమని బతిమాలుకున్నాడు.

"మీ ఆరాటాన్ని అర్థం చేసుకోగలం. అయితే ప్రజలకి మీరు 'కవి' అని తెలీదు. మరి అటువంటప్పుడు మిమ్మల్ని సత్కరిస్తున్నామంటే విరాళాలెవరిస్తారు? మేం ఏ కార్యక్రమం చేసినా ప్రజల సొమ్ముతోనే కదా చేసేది!" అంటూ తమ అశక్తతను వ్యక్తం చేశారు సాహితీ సభ్యులు.

"నాకోసం మీరెవరు ఎవర్నీ ఆశ్రయించవలసిన పనిలేదు. నా మంద గొలుసిస్తాను. తిరిగి దానినే సభలో నాకు బహూకరించండి. నిర్వహణ ఖర్చులు కూడా నావే" అన్నాడు వెంకట్ చేతికున్న బ్రాస్‌లెట్‌ని తీసిస్తూ.

"మీ అభ్యర్థనను తోసిపుచ్చడానికి నోరు రావడం లేదు. మీరన్నట్లు దీనినే మెరుగుపెట్టి సభలో మీకు బహూకరిస్తాం, సరేనా?" అన్నాడు సంస్థ కార్యదర్శి.

వెంకట్ ఆనందానికి అవధుల్లేవు. ఈ దెబ్బతో తన పేరు దశ దిశలా మార్మోగడం ఖాయమనుకున్నాడు.

అన్నట్లుగానే ఓ సుముహూర్తాన సన్మాన సభ ఏర్పాటు చేసి చేతులు దులుపుకున్నారు ఆ సాహితీ సంస్థవారు. సభలో పట్టుమని పాతిక మందైనా లేకపోవడంతో డీలా పడిపోయాడు వెంకట్. వారిలో తను కాఫీలు పోయించి, టిఫిన్లు పెట్టించి లాక్కొచ్చినవారే ఎక్కువ మంది.

రెండురోజుల తర్వాత- "లేచిందగ్గర నుంచి సన్మానాలు, సభలంటూ తిరగడమే తప్ప, కన్న కొడుకు గురించి ఏమీ పట్టించుకోరా? ... వాడికి ఇంజనీరింగు కాలేజీలో సీటు రావాలంటే ముప్పైవేలు కట్టాలంట. రేపే ఆఖరు తేది" ఇండెంటు పెట్టింది ఇల్లాలు.

ఆ మాటకు పిచ్చెక్కిపోయాడు వెంకట్. ఉన్నఫళంగా అంత డబ్బు ఎలా పుట్టించాలో తెలీక చేతికున్న బ్రాస్‌లెట్‌ని తాకట్టుపెడదామని నగల దుకాణానికెళ్ళాడు.

"రెండు తులాలున్న ఈ వస్తువుకి మీరడిగినంత డబ్బు ఇవ్వలేం" అన్నాడు షాపువాడు బ్రాస్‌లెట్ తూకం వేసి.

వీపు మీద ఎవరో కొరడాతో ఛళ్ళున కొట్టినట్లైంది వెంకట్‌కి. తన మంద గొలుసు మూడు తులాలైతే, రెండు అంటాడేంటి వీడు? !

# లాయర్ తెలివి

## - బీపీఆర్

మనకు స్వాతంత్ర్యం రాని రోజుల్లో ఒక దొరసానమ్మ ఇంట్లో పనిచేస్తున్న పనివాడొకడు ఆమె అందానికి ఆవేశపడి చెయ్యిపట్టుకున్నాడు.

జరిగిన ఈ చిన్న విషయాన్ని పెద్దది చేసింది దొరసానమ్మ. పనివాడు తనని రేప్ చేశాడని కేసు పెట్టింది. బెదిరిపోయిన పనివాడు ఒక లాయర్ దగ్గరకు వెళ్ళి జరిగిన విషయం చెప్పి రక్షించవలసిందిగా కాళ్ళు పట్టుకున్నాడు. లాయర్ జాలి పడి కోర్టులో ఏమి జరిగినా చెవిటి వానిగా నటించమని చెప్పాడు.

కోర్టులో విచారణ ప్రారంభమయింది. పనివాడు లాయర్ చెప్పినట్లుగానే వినపడనట్లు 'ఏమిటి-ఏమిటి!' అంటూ బ్రహ్మాండంగా నటించేస్తున్నాడు. అప్పుడు సలహా ఇచ్చిన లాయరు - 'చూశారా మిలార్డ్! ఇతనికి ఇంత క్రితం చెవుడు



# అలవాటులో పొరపాటు

-బద్దిగం పాండురంగారెడ్డి

ఒక డాక్టరు గారికి విచిత్రమయిన అలవాటొకటుంది. రోగి జబ్బు గురించి తన బాధలు చెప్తే, అలాంటి బాధే గతంలో తనూ అనుభవించినట్లు చెప్పేవాడు.



'నా టైఫాయిడ్ జ్వరం తగ్గుతుందా డాక్టర్?' అన్న రోగితో, 'ఐదేళ్ళ క్రితం నాకూ టైఫాయిడ్ వచ్చింది. పదిరోజుల్లో చప్పున తగ్గింది' అనేవాడు.

'విరోచనాలు, కడుపు నొప్పితో ఛస్తున్నా' అన్న రోగితో 'పోయినేడు నాకూ కడుపునొప్పి వచ్చింది. ఇలానే, రెండు రోజుల్లో పూర్తిగా తగ్గిపోయింది' అనేవాడు.

ఒకరోజు కిరాణా కొట్టు సుబ్బిశెట్టి వచ్చి 'డాక్టరు గారూ! నాకు మతిమరుపు మరీ ఎక్కువయిపోయింది. బెల్లం ఇవ్వమన్న వారికి పంచదార ఇస్తున్నాను. నూనె కావాలన్నవారికి మినప్పప్పు ఇస్తున్నాను. యాభై పైసలు తిరిగి ఇవ్వాల్సినవారికి ఐదు రూపాయలు ఇస్తున్నాను. మందేమయినా వుందా? ఈ మతిమరుపుతో చచ్చిపోతున్నా' అంటూ తెగ బాధపడిపోయాడు.

అతని బాధను తగ్గించాలన్న ఉద్దేశంతో డాక్టరు 'అంత బాధపడకండి శెట్టి గారూ! నేనూ అంతే. దగ్గుతో వచ్చినవారికి జ్వరం మందు, జ్వరంతో వచ్చిన వారికి విరోచనాల మందు, కడుపునొప్పితో వచ్చిన వారికి గుండె నొప్పి మందు, మతిమరుపుతో వచ్చినవారికి మాటలు రాకుండా పోయేమందు ఇస్తున్నాను. దానిదేముంది? మతిమరుపు మనుషులకు సహజమే. మందులు వ్రాసిస్తా. వాడండి. తగ్గుతుంది' అన్నాడు.

అంతే! శెట్టిగారు లేచి చక్కా బయటకు వెళ్ళిపోయాడు.

©

---

లేదు. కానీ ఆమెను బలాత్కరించడానికి ప్రయత్నించినప్పుడు ఆమె వేసిన కేకలకు చెవుడు వచ్చేసింది' అని ఇంకా ఏదో అనబోతూవుంటే ఇంతలో దొరసానమ్మ 'అబద్ధం, నేను ఏమాత్రం కేకలు పెట్టలేదు' అంది.

ఆ మాట కోసమే ఎదురుచూస్తున్న లాయరు వెంటనే-'మిలార్డ్! ఆమె కేకలు వేయలేదంటే పనివాడు ఆమెను బలాత్కరించలేదని అర్థమవుతుంది. ఆమె ఇష్టప్రకారమే ఇది జరిగిందన్నమాట! ఆమెకు ఇష్టం లేకపోతే కేకలు వేసేదికదా! అందుచేత ఈ కేసును కొట్టివేయవలసిందిగా కోరుతున్నాను' అన్నాడు.

చట్టం దృష్టిలో ప్రతిఘటన లేకపోతే రేప్‌కానట్లు లెక్క. అందువల్ల కేసు కొట్టివేశారు. ©

# కాలాతీతం

**వెయ్యేళ్లనాటి జపానీ నవల**

# ది టేల్ ఆఫ్ గెంజి

కథా స్థలం ఆనాటి రాజధాని, నేటి క్యోటో నగరం. రాజ్యంలోని కులీనులందరూ చక్రవర్తికి లేదా సింహాసనం అధిష్ఠించబోయే వారసునికి తమ కూతుళ్లను సమర్పించుకోవటం ఆనవాయితీ. ఇలా




రోజూ అంతఃపురంలో చేరే కన్యల బాగోగులు చూడటానికి ప్రత్యేక అధికారులుంటారు. చక్రవర్తి కనబర్చే ఆసక్తిని బట్టి ఈ కన్యల హోదా నిర్ణయిస్తారు. అధికారికంగా పట్టమహిషి ఒక్కతే. కాని కింది వరుసల్లో అనేకమంది స్త్రీలు చక్రవర్తి కటాక్ష వీక్షణం కోసం నిరీక్షిస్తుంటారు. అంతఃపుర కాంతల పైఅధికారిణి కూడా చక్రవర్తి భార్యలో ఒకతే. ఆమె హోదాను నైశీ నో కామి అంటారు. వందలాదిగా ఉన్న ఈ సుందరాంగనలందరూ పట్టమహిషి కావాలని కలలుగన్నా అత్యధికులకు ఆ అదృష్టం వరించటం దుర్లభమే. పలుకుబడి లేనివాళ్లనూ, పేదలనూ చక్రవర్తి కన్నెత్తి కూడా చూడకపోవచ్చు.

మన కథానాయకుడు గెంజి, చక్రవర్తికి ఒక అంతఃపుర కాంత ద్వారా పుట్టిన సంతానం. అధికారుల అండ కరువైన ఆ స్త్రీ కేవలం చక్రవర్తి కరుణాకటాక్షాల మీద అధారపడి మంచిరోజుల కోసం నిరీక్షి

స్తుంది. అనుకున్నట్టే చక్రవర్తి కూడా స్పందించాడు. తన ప్రథమ సంతానానికి బదులు, గెంజిని వారసుడిగా ప్రకటించాలనుకుంటాడు చక్రవర్తి. కాని ఈ నిర్ణయం సభామోదం పొందే అవకాశం లేదు. అందువల్ల గెంజిని దూరంగా మరోచోట పెంచి, తిరిగి తన కొలువులో ఒక అపరిచిత వ్యక్తిగా నియమిస్తే సమస్య పరిష్కారమవుతుంది.

యుక్తవయసులో గెంజి ఒక ముఖ్య రాజోద్యోగి కూతురు 'ఆవోయి'ని వివాహం చేసుకుంటాడు. అయితే ఆమె ఇంకా రజస్వల కాలేదు గనక తండ్రివద్దే ఉంటుంది. గెంజికి ఆస్థానంలో సముచిత స్థానం లభిస్తుంది. అతడి తల్లి బాల్యంలోనే మరణించింది. ఆమె స్థానంలో చక్రవర్తి, మరో రాకుమారి ఫ్యుజిట్సుబోను పెళ్లాడాలనుకుంటాడు. ఈమెకూ, మొదటి భార్య అయిన గెంజి తల్లికీ పోలికలున్నాయి. ఈలోగా గెంజి ఆమెతో రహస్యంగా సంబంధం పెట్టుకుని, సింహాసనానికి వారసుడిగా ఓ కొడుకును కూడా కంటాడు.




ఫుజిట్సుబోతో గెంజి పరిచయం కొనసాగటానికి నిబంధనలు ఒప్పుకోవు. అది రహస్యంగా ఉండిపోవాల్సిందే. ఆమెను పోలిన మరోకన్య, ఫుజిట్సుబో మేనకోడలు 'మురసాకి' అతణ్ణి తన ప్రేమతో పరవశింపచేస్తుంది. కథా ప్రారంభంలో పదేళ్లున్న మురసాకి పెరిగి గెంజికి భార్యగా బాధ్యతలు స్వీకరిస్తుంది. జీవితంలో అతడికి స్వర్గసుఖం ఇచ్చిన స్త్రీ మురసాకి. నవల నలభయ్యో అధ్యాయంలో ఆమె మరణంతో అతనిలో జీవితేచ్ఛ నశిస్తుంది. కాని ఈలోగా అనేకమంది స్త్రీలతో సాంగత్యం ఏర్పడుతుంది. మురసాకితో సహా స్త్రీలందరిలోనూ తల్లి పోలికలున్నందువల్లే అతడు సంబంధాలు పెట్టుకున్నాడని పలుమార్లు వివరణ ఇస్తుంది రచయిత్రి.

బాల్యంలో ఒకసారి యువకులందరూ స్త్రీలతో తమ అనుభవాలను నెమరేసుకున్నప్పుడు వింటాడు గెంజి. ఏ లక్షణాలున్న స్త్రీలు పురుషుల్ని బాగా తృప్తిపరచగలరో తెలుస్తుంది. ఆ తర్వాత తను స్వయంగా, ఆ జ్ఞానాన్ని పలువురు స్త్రీలలో పరీక్షిస్తాడు. స్త్రీ సంభోగమే పరమావధిగా బతికే పురుషుణ్ణి కాముకుడని అనటం సహజమే. గెంజి స్వభావం ఎలాంటిదైనా, ఈ దక్షిణ నాయకుణ్ణి వర్ణించే అనేక అధ్యాయాలు మాత్రం మహా ఆసక్తికరంగా, ఉత్కంఠభరితంగా పాఠకులను ఉరకలెత్తిస్తాయి. అయితే రాజుల ప్రవర్తనను తప్పుపట్టడం ఆ రోజుల్లో ఊహించలేని విషయం. అందువల్ల గెంజి తను పరిచయం పెట్టుకున్న స్త్రీలందర్నీ సమంగా ప్రేమించాడనీ, అందరిపట్లా తన బాధ్యత సక్రమంగా నిర్వర్తించాడనీ నొక్కి చెబుతుంది రచయిత్రి.

గెంజి స్ఫురద్రూపి. గొప్ప అందగాడు. అతణ్ణి మోహించకుండా ఉండటం పడతులకు అసాధ్యం. పైగా సంపదలో, అధికారంలో అతణ్ని మించినవాళ్లు లేరు. అటువంటి పురుషుడి కౌగిట్లో ఒదిగిపోవటం కన్న ఏ స్త్రీ అయినా మరేమి కోరుకుంటుంది? ఇంకా బాధ్యతలు స్వీకరించని బాల్య దశలో సుందరాంగనలే అతని లోకం. వయసు పెరిగి, కర్తవ్యం గుర్తెరిగిన పిదప రాజకీయంగా ప్రత్యర్థులను హడలెత్తించాడు గెంజి. అయితే స్త్రీలపట్ల ఉన్న వ్యామోహమే ఒకసారి అతడికి

చిక్కులు తెచ్చిపెట్టింది. తన ప్రధాన రాజకీయ శత్రువు కూతురు 'ఒబోరోజికియూ'తో క్రీడిస్తూ ఒక దండనాయకుని కంటబడతాడు. ఒబోరోజికియూ అక్క క్యోటో సింహాసనానికి వారసుడి తల్లి. ఆమె దుర్బుద్ధితో గెంజిని నాశనం చెయ్యటానికి ప్రణాళిక రచిస్తుంది. చేసిన తప్పుకు తలెత్తుకోలేక, దేశాంతరవాసమే శ్రేయస్కరమనుకుంటాడు గెంజి. కోబె నగర సరిహద్దుల్లో ఉన్న 'సుమా' సురక్షిత ప్రాంతమని సూచిస్తారు సలహాదార్లు. రహస్యంగా వెళ్లిపోతున్నాడు గనక మురసాకినీ వదలక తప్పదు. నవలలోని అనేక అధ్యాయాలు గెంజి అంతర్మథనాన్ని హృద్యంగా చిత్రిస్తాయి. ఒకసారి తుపానులో ప్రాణానికే ముప్పు వస్తుంది. ఆ విపత్తులో అతనికి కొన్ని వింత స్వప్నాలు కనిపిస్తాయి. స్వర్గస్థుడైన తండ్రీ, దివ్యపురుషులూ దర్శనమిస్తారు. తుపాను తీవ్రత తగ్గిన తర్వాత, తెప్పమీద ఒక ధనికుడు, పేరు అకాషి నోవిసె ప్రత్యక్షమై కాలువ ఆ దరినున్న తన ఇంటికి అతిథిగా రమ్మని ఆహ్వానిస్తాడు.

ధనికుని ఇంట్లో కొన్నాళ్లు సుఖంగానే గడుస్తుంది. గెంజి అతని కూతురు అకాషితో సంబంధం పెట్టుకుంటాడు. ఆమె గర్భం దాలుస్తుంది. రాజధానికి తిరిగి రమ్మని గెంజికి పిలుపు వస్తుంది. అప్పటికే అతడికి మొదటి భార్యతో ఒక కొడుకున్నాడు. పేరు యుగిరి. ఆమె మరణించి చాలా కాలమైంది. ఫుజిట్సుబో వల్ల పుట్టిన కుమారుడు, భావి రారాజు రెయిజి కూడా పెరుగుతున్నాడు. ఈ మూడో సంతానం ఆడపిల్ల. రెయిజి తర్వాత ఆమె సింహాసనాన్ని అధిరోహిస్తుంది. నవలలో ఈ పాత్రకు చాలా ప్రాధాన్యం ఉంది. రాజవంశానికి చెందిన అత్యున్నత వ్యక్తిగా, అంటే చక్రవర్తి మాతామహుడు అనే హోదాను గెంజికి కల్పిస్తుందీమె.

దేశాంతర వాసం నుండి తిరిగి వచ్చిన గెంజి బలం పుంజుకుంటాడు. అయినా అప్పుడప్పుడూ స్త్రీల అందాలు అతణ్ణి లొంగదీసుకుంటూనే ఉంటాయి. ఇప్పుడతని ఆలోచనలు సౌందర్యారాధనకే పరిమితం.

తొలిదశలో గెంజి, ఒకసారి రాకుమారి అసాగావోతో ప్రేమలో పడతాడు. అయితే ఆ వ్యవహారం ఎక్కువ కాలం కొనసాగదు. అసాగావోలో కూడా అతడు తల్లిపోలికలు చూశాడని మనం భావించాలి. అధికార వర్గాలలో పెరుగుతున్న పలుకుబడి వల్ల మురసాకి తనకు సరిజోడు కాదనుకుంటాడు గెంజి. రాజ కుటుంబానికి చెందని స్త్రీలకు అంతఃపురంలో ఉన్నత స్థానం లభించదు.

త్వరలో గెంజి అనూహ్యంగా ఎదిగిపోతాడు. దివంగతురాలైన తన ప్రేయసి రోకుజో నోమియా సుజోకురో వల్ల సంక్రమించిన సంపదతో నాలుగు అద్భుత హర్మ్యాలు నిర్మిస్తాడు. వాటి అంతర్భాగంలో ఒకదాని నుండి మరొకదానికి దార్లుంటాయి. ఈ నాలుగు భవనాలూ నాలుగు రుతువులకు ప్రతీక. ఒక్కొక్క దాంట్లో ఒక్కొక్క ఇష్టసఖి ఉంటుంది. దీనికి రోకుజో భవన సముదాయం అని నామకరణం చేస్తాడు. ఈ దశలోనే చక్రవర్తి తన రహస్య సంతానమైన అతణ్ణి 'విరమించిన గౌరవ చక్రవర్తి'గా నియమిస్తాడు. జపాను చరిత్రలో ఇటువంటి హోదా కల్పించటం అదే ప్రథమం.

ఒకసారి తన సవతి సోదరుడు 'విరమించిన చక్రవర్తి' సుజాకు నుండి గెంజికి వర్తమానం వస్తుంది. సుజాకు బలహీనుడు. గెంజికీ, అతడి అనుచరులకూ సమస్యలు సృష్టించమని అతడి తల్లి ప్రోత్సహిస్తుంది. తను ఈ లోకాన్ని

# సుక్కూర్‌కు తాగునీరు

అది 1893వ సంవత్సరం. సింధ్ ప్రాంతంలోని సుక్కూర్ నగరానికి సింధునది నుంచి తాగునీటి సరఫరా వ్యవస్థను ఏర్పాటు చేయాలని ప్రభుత్వం సంకల్పించింది. ఈ పనిని విజయవంతంగా పూర్తిచేయగల సమర్ధుడైన ఇంజనీరు కోసం వెతుకుతున్నారు. మొదట ఒక బ్రిటిష్ ఇంజనీరు నియమితుడయ్యాడు. కాని అతను ఆ ఉద్యోగంలో చేరలేదు. అక్కడ వేసవి అతి వేడిగానూ, చలికాలము అతి చల్లగానూ ఉంటుంది. అందు



చేత ఏ ఒక్క ఇంజనీరూ అక్కడికి వెళ్లేందుకు ఇష్టపడలేదు. పుణెలో చీఫ్ ఇంజనీరు, రెనోల్డ్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య పేరును ఈ సుక్కూర్ పథకానికి సిఫార్సు చేశాడు. ఇదివరకే తమ ప్రాంతములో పంజ్రా నది నుంచి దతారి గ్రామానికి విలక్షణ పద్ధతిలో నీటిని సైఫన్ చేసి, సరఫరా చేసే పథకాన్ని రెండే రెండు నెలల్లో విశ్వేశ్వరయ్య పూర్తిచేసిన సంగతి ఆయనకు తెలుసు. ముంబై ప్రభుత్వం సుక్కూరు నగరానికి తాగునీటి సరఫరా వ్యవస్థ నిర్మాణం పనులు చేపట్టేందుకు విశ్వేశ్వరయ్యను సింధ్ ప్రభుత్వానికి డెప్యుటేషన్‌పై 1894 నుంచి 1895 వరకు పంపుతూ ఉత్తర్వులు జారిచేసింది.

విశ్వేశ్వరయ్య 1894 ఫిబ్రవరిలో పనిలో చేరాడు. తాగునీటి సరఫరా వ్యవస్థ అవసరాలను గుర్తించడం కోసం వెంటనే ఓ సర్వే చేశాడు. సింధునది నీటిని పంపుచేయడం ద్వారా మాత్రమే సుక్కూర్‌కు కావాల్సిన తాగునీటిని తెచ్చుకోవచ్చని గ్రహించాడు. అలాగే నది నీరు బురదగా ఉంటుంది. అందుచేత ఆ నీటిని శుద్ధిచేస్తే తప్ప తాగడానికి పనికిరాదు. కాని ఈ జల శుద్ధీకరణ వ్యవస్థ ఆర్థికంగా పెనుభారం.

విశ్వేశ్వరయ్య శుభ్రమైన మంచినీటికోసం పర్యాయ పద్ధతి ఆలోచించాడు. నది గట్టు వెంబడి భారీప్రమాణంలో గుంతలను తీయించాడు. నదిలోని నీరు ఇసుక పొరల ద్వారా ఆ గుంతల్లోకి ఊట ఊరి స్వచ్ఛమైన నీరు చేరుతుంది. ఆ గుంతలలో జమ అయిన నీటిని, నగరానికి పక్కనున్న గుట్టపై కట్టిన భారీ నీటి ట్యాంకుకు పైపుల ద్వారా తరలిస్తారు. ఆ తర్వాత ఇళ్లకు సరఫరా చేస్తారు. ఈ ఊటబావుల నిర్మాణం వల్ల ప్రభుత్వంపై అధిక ఆర్థికభారం లేకపోగా ప్రజలకు శుభ్రమైన తాగునీరు పుష్కలంగా లభించింది.

ప్రభుత్వం విశ్వేశ్వరయ్యకు ఈ పథక నిర్మాణానికి 22 నెలల సమయం ఇస్తే ఆయన దీనిని కేవలం 18 నెలలలోనే పూర్తి చేశారు. ఒకపక్క ధనవ్యయం, మరోపక్క కాలవ్యయం తగ్గించి ఆయన అలా అందరికీ మార్గదర్శకంగా నిలిచాడు.

## మురసాకి షికిబు ( 978 - 1030 )

రచయిత్రి కలం పేరు మురసాకి షికిబు. 'లేడీ మురసాకి'గా ప్రసిద్ధురాలు. ఆమె అసలు పేరు తెలియదు. క్రీ.శ. 973 ప్రాంతంలో జపానులోని ఓ సంపన్న కుటుంబంలో జన్మించి ఉంటుందని పరిశోధకులు నిర్ధారించారు. తండ్రి ప్రావిన్షియల్ గవర్నర్. వీళ్లది రాజకీయంగా పలుకుబడి ఉన్న పుజివారా వంశం కావటంవల్ల, అంతఃపుర వ్యవహారాల్లో వివిధ హోదాల మధ్య సంబంధాలను పర్యవేక్షించే ఉద్యోగం సంపాదించింది రచయిత్రి. ఈమె రాసినదే టేల్ ఆఫ్ గెంజి. జపనీస్‌లో దీనిపేరు గెంజి మోనోటారి. నవలలోని కథానాయిక పేరు కూడా 'మురసాకి'. రచయిత్రి తండ్రి పేరు పుజివారా నో టామేటోకి. ఆయన 1029లో మరణించారు. హరిమా, ఎచిజెన్, ఎచిగో ప్రాంతాలకు గవర్నర్‌గా పనిచేశాడాయన. 998లో వివాహం చేసుకున్న మురసాకి రెండేళ్లకే వితంతువైంది. ఈమె కూతురు కటాకో 1080లో మరణించింది. 1006లో మురసాకి, రాణి అకికో కొలువులో చేరింది. ఆనాటి రాజవంశాల గురించి తెలుసుకోవటానికి ఈ రచయిత్రి డైరీలు, కవితలు ఎంతో తోడ్పడుతున్నాయి.



పదిహేనో శతాబ్దిలో జరిగిన పరిశోధనలో నవలలోని 54 అధ్యాయాలలో ఎక్కువ భాగం మురసాకి విరచితమే అని తేలింది. అయితే 42 నుండి 54 అధ్యాయాలు ఆమె కూతురు రాసివుంటుందని తేల్చారు. వెయ్యేళ్లనాటి ఈ నవల కర్తృత్వం గురించి కొన్ని ప్రశ్నలు తలెత్తడం సమంజసమే. నిజానికి మురసాకి స్వహస్తాలతో రాసిన రాతప్రతి ఇప్పుడు లభ్యం కావటం లేదు. 12వ శతాబ్ది ప్రతిని, మరో వందేళ్ల తర్వాత పరిష్కరించి తిరగరాశారు. ఆధునిక అనువాదాలన్నింటికీ అదే మూలం.

సాహిత్య చరిత్రకారులు టేల్ ఆఫ్ గెంజిని ఆధునిక నవలా లక్షణాలున్న తొట్టతొలి రచనగా పరిగణిస్తారు.

త్యజిస్తాననీ, తన కూతురు(చిన్నపిల్ల) పోషణ బాధ్యతలు స్వీకరించమని, పెళ్లి చేసుకొనమని అర్థిస్తాడు. గెంజి అంగీకరిస్తాడు. ఈ పిల్ల కూడా త్వరలో మురసాకి అంత సుందరిగా ఎదుగుతుందని భావిస్తాడు. ఈమె కూడా పుజిట్సుబో మేనకోడలే. అయితే ఆ పిల్లను పెళ్లాడాలనుకునే యువకులకు కొదవలేదు. కారణం మురసాకికి లేని అధికార హోదా ఈమెకుంది. ఆమె 'విరమించిన గౌరవ చక్రవర్తి'కి భార్య కాగలదు.

అయితే తన నిర్ణయానికి త్వరలోనే పశ్చాత్తాపపడతాడు గెంజి. 'విరమించిన చక్రవర్తి' కూతురు గనక ఆమెను ఉపేక్షించటానికి వీల్లేదు. కాని అనారోగ్యంలో ఉన్న మురసాకిని వదిలి ఉండలేడు. రాజవంశీకులకు ఇది ఘోర అవమానం. సుజాకి కూతురు ఒంటరిగా ఉన్న సమయంలో ఓ యువకుడు ఆమెను లొంగదీసుకుంటాడు.

ఈ విషయం తెలిసి గెంజి, ప్రతీకారేచ్ఛతో రగిలిపోతాడు. కాని ఈలోగా మరో ఉపద్రవం ముంచుకొస్తుంది. సుజాకి కూతురు గర్భం దాల్చి కొడుకు కావోరూని ప్రసవిస్తుంది. అందరూ అది గెంజి సంతానమే అనుకుంటారు. గర్భానికి కారకుడైన యువకుడు పశ్చాత్తాపంతో మరణిస్తాడు. సుజాకి కూతురు సన్యాసం స్వీకరిస్తుంది. మురసాకి ఆరోగ్యం మరింత క్షీణిస్తుంది. గెంజికి కొత్త వివాహం అలా

చేదు జ్ఞాపకంగా మిగిలిపోతుంది.

రెండు మూడేళ్ళ తర్వాత మురసాకి నలభయ్యో పడిలో మరణిస్తుంది. గెంజికి అప్పటికి యాభై దాటాయి. జీవితంలో సకల సౌఖ్యాలూ అనుభవించి, తన ప్రియాతి ప్రియమైన మురసాకిని పోగొట్టుకుని జీవచ్ఛవంలా మిగిలిపోతాడు. మరి కొన్నాళ్ళకు సన్యాసం స్వీకరించి, శేషజీవితం ఒక దేవాలయంలో గడిపి ప్రశాంతంగా కళ్లు మూస్తాడు.

అయినా గెంజి గాధ ఇంకా కొనసాగుతుంది.

కావోరూ, గెంజి మనుమడు నియోవు (ఇప్పుడు రారాణిగా ఉన్న అకాశి కూతురి కొడుకు)యువకులుగా తెరమీదికి వస్తారు. ఇద్దరూ మంచి మిత్రులు. ప్రేమ వ్యహారాలలో తరచూ పోటీ పడుతుంటారు.

చక్రవర్తి కొలువుతో మొహంమొత్తి, భార్యను కోల్పోయిన ఒక రాకుమారుడు తన ఇద్దరు కూతుళ్ళతో రాజధానికి సమీపంలో ఉన్న ఉజి గ్రామానికి తరలిపోతాడు. అక్కడ ఉజి నదీతీరంలో ఆశ్రమం ఏర్పరుచుకుని ఆధ్యాత్మిక చింతనలో గడుపుతుంటాడు. ఆ సాధుపుంగవుని పవిత్ర జీవితం కావోరూను ఆకర్షిస్తుంది. అతడిక్కూడా రాజభోగాల మీద విరక్తి కలిగింది. ఉజి గ్రామంలో ప్రవేశించిన తర్వాత, ఒక వృద్ధ స్త్రీ ద్వారా, కావోరూకు తన జన్మ రహస్యం తెలుస్తుంది. రాకుమారుని కూతుళ్లు కూడా అతణ్ణి ఆకర్షిస్తారు. పెద్దమ్మాయి 'ఒయిగిమి'ని గాఢంగా ప్రేమిస్తాడు. నిజానికి ఇద్దరూ కావాలని కోరుకుంటాడు. కానీ తన మిత్రుడు నియోవు చిన్నకూతురు 'నకనోకిమి'ని ఇష్టపడతాడు.

ఈ దశలో నకనోకిమిని నియోవు వివాహం చేసుకోవాలి. కాని అతడికి ఉజి రావటానికే వీలు పడదు. సుదీర్ఘ కాలం పాటు సంపర్కం పెట్టుకోకపోవటంతో తనమీద అతడికి ఇష్టం లేదు కాబోలు

## 'టేల్ ఆఫ్ గెంజి' నేపథ్యం

ఆధునిక పాఠకులకు, ఇందులోని పాత్రల ప్రవర్తన వింతగా, అసహజంగా కనిపిస్తుంది. ఎవ్వరూ, ఎప్పుడూ ఒంటరిగా ఉండరు. ఆడ, మగ అందరూ దాసదాసీ జనం మధ్య మాత్రమే కనిపిస్తారు. 'ఏకాంతం' అంతఃపుర వాసులకు తెలియదు. రాజవంశీకుల జీవితం పరదాల వెనకే గడుస్తుంది. పరిచారులు, పరిచారికలు వారికి రక్షణగా వెలుపల నిద్రిస్తారు.

అయితే చుట్టూ జనం ఉన్నప్పుడు రహస్యాలు మాట్లాడుకోవటం ఎలా? సేవకులకూ, జంతువులకూ తేడా లేదు. వాళ్ల మాటలకు, సాక్ష్యాలకు విలువ ఉండదు. రాజకుటుంబంలోని వారిని మాత్రమే వ్యక్తులుగా గుర్తిస్తారు. వార్తాహరుడు నేరుగా ఒక వర్తమానం అధికారికి చేరవెయ్యటానికి వీల్లేదు. అతడి మాటల్ని, ఇతర అధికారులు, అంచెలంచెలుగా ప్రభు సన్నిధిలో విన్నవిస్తారు.

ఆనాటి భాషా మనకు వింతే. యువకులు ప్రేమను వ్యక్తం చేసుకోవటాన్నీ, సంగమించటాన్నీ 'స్వప్నం' అంటారు. నిరంతరం మాట్లాడుకోవటం తప్ప, ఈ పాత్రలు ఎప్పుడైనా, ఏమైనా చేస్తాయా అని పాఠకులకు సందేహం వస్తుంది. కొన్నిసార్లు 'చూడటం'ను, 'కలుసుకోవటం' అనే మాటకు పర్యాయపదంగా వాడతారు.

జపానులో గెంజి గాథకు ముందు వచ్చిన సాహిత్యమంతా పద్యకావ్యాలే. అందువల్ల సహజంగానే, ఇది వచనమైనప్పటికీ, పద్యాలూ, కవితాత్మక వర్ణనలూ ఇందులో కూడా ఎక్కువే.

వెయ్యేళ్లనాడే ఆధునిక దృక్పథంతో రచనలు చేసిన మురసాకి తాను చూసిన అంతఃపుర జీవితం గురించే చిత్రించింది. ఆ సంఘటనల్ని కథగా మలచటంలో ఆమె ప్రతిభ ప్రశంసనీయం. రాజులదైనా సరే, జీవితం నిస్సారంగా ఉంటుంది. దాన్ని ఆసక్తికరంగా మలచాలంటే కల్పన తప్పనిసరి. పాఠకులను ఆకట్టుకోవటానికి పాత్రలు నాటకీయంగా ప్రవర్తించాలి. అందువల్ల గెంజి గాథలో, కొన్ని వందల పేజీలు అంతఃపుర ఆచార వ్యవహారాల వర్ణనలున్నా, రచయిత్రి కథనంలో కొత్త అందాలు సంతరించుకుంటాయి. చిత్రకారుడు బొమ్మలు గీసినట్టు, సప్త వర్ణ పద చిత్రాలు సృష్టించింది మురసాకి. అంటే ఇది వెయ్యేళ్లనాటి జపాన్ చరిత్ర కాదు. వెయ్యేళ్లనాటి ఓ స్త్రీ ఊహాలోక విహారం.

ననుకుంటుంది నకనోకిమి. కావోరూను ప్రేమిస్తే తన పరిస్థితీ ఇంతేనని భయపడుతుంది ఒయిగిమి. కోరిక తీరీ తీరకపోవటంతో నిరాహారదీక్ష చేసి ఆత్మాహుతికి పాల్పడుతుంది ఒయిగిమి.

ఈ సంఘటన నియోవులో మార్పు తెస్తుంది. నకనోకిమిని తన వెంట నగరానికి తీసుకుపోతాడు. కాని అక్కడ రాజకీయ ఒత్తిళ్లకు లొంగి, తల్లిదండ్రుల ఆజ్ఞను జవదాటలేక యుగిరి కుమారుడి కూతుర్ని వివాహం చేసుకుంటాడు. నకనోకిమితో కావోరూ పరిచయం కొనసాగుతుంది. ఆమె తన సోదరి అనే భావన అతనిలో పెరుగుతుంది. కాని వీళ్ల సాన్నిహిత్యం చూసి నియోవు అనుమానిస్తాడు. తమ ఇద్దరి మధ్యా లైంగిక సంబంధం లేదని నియోవుకు చెబుతుంది నకనోకిమి. తన పోలికున్న సవతి చెల్లెళ్ళుంటారామెకు. వాళ్ళలో ఒకతె 'ఉకిఫునె'. ఆమెలో 'ఒయిగిమి'ని చూస్తాడు కావోరూ. పెళ్లంటూ చేసుకుంటే ఆమెనే చేసుకుంటానంటాడు.

కొన్నాళ్ళ తర్వాత నకనోకిమి ఇంటికి వచ్చిన ఉకఫునెను చూసి నియోవు ఆమెను ప్రేమిస్తాడు. కాని అప్పటికే కావోరూ ఆమెతో సంబంధం పెట్టుకుని ఉజిలోని ఒక ఇంటిలో దాస్తాడు. అయినా నియోవు ఆమెను వెంబడించి లోబరచుకుంటాడు.

అలా ఇద్దరి ప్రేమికుల మధ్య నలిగిపోతుంది ఉకిఫునె. హోదాలో కావోరూ చాలా ఉన్నతుడు. అతడి భార్యలలో ఒకతిగా ఉండగలిగితే తన అదృష్టం పండినట్టే. ఎలాగైనా అతణ్ణి సంతోషపెట్టమని తల్లి కూడా బలవంతం పెడుతుంది. కాని నియోవు ఆమెనెక్కువ ఆకర్షిస్తాడు. ఆమె కోసం నగరంలో ఓ భవనం కట్టించి వెంట దీసుకుపోవటానికి వస్తాడు కావోరూ. నియోవు ఆమెను అపహరించటానికి ప్రయత్నిస్తాడు. ఇద్దరి మధ్యా తేల్చుకోలేక నదిలో దూకి ఆత్మహత్య చేసుకోవాలనుకుంటుంది ఉకిఫునె.

అలా ఆమె అదృశ్యమైన తర్వాత వాళ్లు ఆమె అంత్యక్రియలు కూడా నిర్వహిస్తారు. కావోరూ, నియోవు శోకదినాలు పాటిస్తారు. అయితే నిజానికామె మరణించలేదు. ఒక ఏకాంత ప్రదేశంలో కన్నీరుమున్నీరుగా విలపిస్తున్న ఉకిఫునే ఇద్దరు సన్యాసుల కంటపడుతుంది. వాళ్లు ఈ విషయం తమ ప్రధానాచార్యునికి నివేదిస్తారు. ఆశ్రమం నుండి ఒక సన్యాసిని వచ్చి ఆమెను చేరదీస్తుంది. అయితే అప్పటికే ఉకిఫునే జ్ఞాపకశక్తి కోల్పోతుంది. ఆ సన్యాసుల బృందం పుణ్యక్షేత్రాల పర్యటనలో భాగంగా ఉజి చేరుకుంటుంది. అక్కడ మరో సన్యాసిని ఆమెను 'ఓనో' గ్రామానికి తీసుకెడుతుంది. అక్కడ మంత్ర ప్రయోగంతో జ్ఞాపకశక్తిని పునరుద్ధరిస్తారు. ఆ తర్వాత ఉకిఫునే కూడా సన్యాసదీక్ష స్వీకరిస్తుంది.

ఉకిఫునే అదృశ్యమైన ఏడాదికి ఆమె బతికే ఉంటుందని సందేహం వ్యక్తపరుస్తాడు కావోరూ. వేగులవాళ్ల ద్వారా ఆమె జాడ తెలుసుకుంటాడు. పరిస్థితిని వివరిస్తూ లేఖ పంపిస్తాడు. ఉకిఫునే దాన్ని చదవటానికి కూడా నిరాకరిస్తుంది. ఇది 'నియోవు' కుట్రననుకుంటాడు కావోరూ.

ఇంతటితో అర్థాంతరంగా ముగుస్తుంది నవల.

రచయిత్రి అనివార్య పరిస్థితుల్లో ఇలా అసమగ్రంగా ముగించిందా? ఆ రాజకుటుంబీకుల కథలో చెప్పటానికి ఇంకేమీ లేదని అనుకుందా? రచయిత్రి మరణంతో కథనం ఆగిపోయిందా?

ఇలాంటి విషయాలు నేటికీ చర్చనీయాంశమే.

– ఎం.వసంత

# మనసున ఉన్నదీ...



★ చతుర నవలంటే మాకెంతో ఇష్టం. 'మధురిమ' ఫొటోతో అక్టోబరు కవర్ పేజీ చక్కగా ఉంది. 'పావురం' శివయ్యలోని మరో మనిషిని చక్కగా ఆవిష్కరించింది. హాస్యకథ 'కళాభిమాని' ఎన్ని నవ్వులు పూయించిందో!

**– వాడపర్తి వెంకటరమణ**, విశాఖపట్నం

★ పి.చంద్రశేఖర అజాద్ నవల 'పావురం' కమనీయంగా ఉంది. చతురలో వస్తున్న నవలలు వేటికవే సాటి. కొత్తగాలి నేటి యువకవులకు పవర్‌ఫుల్ టానిక్.

**– శ్రీకాళహస్తి వెంకటశేషగిరిరావు**, నెల్లూరు

★ మేము చతుర ఆసాంతం పూర్తి లోతుల్లోకి వెళ్లి చదివే అభిమానులం. టాంక్‌బండ్ కథ 'సుఖం' చాలా బాగుంది. ఈ సంఘంలో ఎంతోమంది శివయ్యలు ఆత్మన్యూనతా భావంతో బాధపడుతూ శాడిస్టిక్ మెంటాలిటీ, మొండితనాన్ని అలవర్చుకోవడాన్ని బాగా చిత్రించారు పావురం నవలలో. పావురం రెక్కలు విచ్చుకుని, తెగించి, ఎగిరితేకానీ స్వాతంత్ర్యం రాదని గుర్తింపజేయటం బాగుంది. రమాదేవి 'కళాభిమాని' కడుపుబ్బా నవ్వించింది. 'జ్ఞాన పీఠాలు' స్ఫూర్తిదాయకంగా ఉంటున్నాయి.

**– ఎన్.వి.రమణి**, హైదరాబాద్

★ 'పావురం'లో మనిషి ఎలా ఉండకూడదో చెప్పడంకోసం శివయ్య పాత్రను చక్కగా మలిచారు. అలాంటి వ్యక్తులనుండి ఇతరులు స్వేచ్ఛానురక్తులైన పావురాల్లా ఎలా దూరమవ్వాలనుకుంటారో నవల పేరే సూచిస్తోంది. హాస్యకథ 'కళాభిమాని' అవకాశవాదుల పట్ల అప్రమత్తంగా ఉండమని హెచ్చరిస్తోంది.

**– జె.వి.రమణ**,
కొంపల్లి, వరంగల్ జిల్లా

★ చంద్రశేఖర్ అజాద్ మంచి ప్రతిభ ఉన్న రచయిత. అలాంటి రచయిత 'పావురం' నవలను ఫ్రీక్ కేరెక్టర్స్‌ను సృష్టించడానికి మాత్రమే వినియోగించడం ఆశాభంగాన్ని కలిగించింది. 'ఒథెల్లో' నాటకంలో ఇయాగో పాత్రను వర్ణిస్తూ.. 'మోటివ్‌లెస్ మాలిగ్నాన్ని' అన్న మాటను విమర్శకులు వాడుతుంటారు. అయితే ఆ నాటకంలో ఆ పాత్ర తాలూకు కిరాతకత్వం ద్వారా ఒక ప్రయోజనాన్ని సాధించేడు షేక్స్పియర్. శివయ్య కిరాతకత్వం ద్వారా ఏం చెప్పాలని, ఏం సాధించాలని చూశారు అజాద్? గొప్ప నవలలు రాసే శక్తిగల రచయితలు తమ సామర్థ్యాన్ని వృధా పర్చుకోవద్దని మనవి. టాంక్‌బండ్ కథ 'సుఖం' విదేశాల్లో పిల్లల దగ్గరకు వెళ్లిన పెద్దల మనస్థితికి, వాస్తవికతకు అద్దం పట్టింది. . నేను నాలుగు నెలలు బోస్టన్, డెట్రాయిట్‌లో ఉన్నాను. ఎటూ కదలడానికి లేదు. ఇళ్లూ, చెట్లూ కళ్లకి ఎంత హాయినిచ్చినా రోజుల్లా వాటినే ఎలా చూస్తూంటాం? వెంటనే తిరిగి వచ్చేయాలన్పించింది. మంచి కథను అందించిన రచయితకు అభినందనలు.

**– ఎ.వి.రెడ్డిశాస్త్రి**, శ్రీకాకుళం.

★ పావురం నవల మనోవిశ్లేషణాత్మకంగా ఉంది. అయితే రచయిత పేరు గురించి ఓ అభిప్రాయం. 'ఆజాద్' అనే పదాన్ని ఆయన పీచమడిచి 'అజాద్' అని పెట్టుకున్నారెందుకో!

**– శ్రీ పెరంబుదూరు నారాయణరావు**,
హైదరాబాద్

★ పావురం నవలలోని పాత్రధారులు సింబాలిక్‌గా ప్రవర్తించేరు. కొత్తగాలి కవితలన్నీ బావున్నాయి. 'అపార్ట్‌మెంటాలజీ' హాస్యం బావుంది. ప్రతినెలా చతురకతలు ప్రచురిస్తే బాగుంటుంది.

**–జి.గోపాలకృష్ణ**, శ్రీకాకుళం

టాంక్‌బండ్ కథల్లో 'సుఖం' గతంలోని మా అమెరికా అనుభవాలను గుర్తుకు తెచ్చింది. రమాదేవి 'కళాభిమాని'లో హాస్యోక్తులు బాగా నవ్వించాయి.

**– విజయాదత్**, హైదరాబాద్



చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082
ఈ మెయిల్ :
vipula.chatura@gmail.com

# శతముఖాల మానవేతిహాస ఆవిష్కర్త

**వేషం, భాష, ఆలోచన, రచన- అన్నిటిలోనూ గ్రామీణ సొబగుల్ని గుబాళింపజేశారాయన. కథ, నవలా ప్రక్రియలను శక్తి సమన్వితం గావించి, వాటికి విలక్షణ రూపురేఖలు సమకూర్చారు. కార్మిక, కర్షక, పీడిత వర్గాల జీవితాల్ని ఇతివృత్తాలుగా స్వీకరించి మళయాళ సాహితీ రంగానికి నూతన దిశానిర్దేశం చేశారు. ఆయన రాసిన 'చెమ్మీన్' నవల 19 దేశ భాషల్లోకి అనువాదమైంది. 15 దేశ భాషల్లో వెండితెరకెక్కింది. అలాగే రెండున్నర శతాబ్దాల కేరళ సమాజాన్ని తన వేయిపుటల బృహత్ నవల 'కయర్'లో చిత్రించారు. ఆయన సాహిత్యకృషికి 1984లో ఆయన అరుదైన జ్ఞానపీఠ పురస్కారం లభించింది. భారతదేశం గర్వించదగ్గ ఆ విలక్షణ సాహితీకారుడే తకళి శివశంకరపిళ్ళై.**



తకళి శివశంకరపిళ్ళై

శివశంకర పిళ్లై జననం 1912 ఏప్రిల్ 17న కేరళలోని కుట్టనాడు ప్రాంతం తకళి గ్రామంలో. ఇది ఆలెప్పీకి పదిమైళ్ళ దూరంలో ఉన్న కుగ్రామం. తండ్రి వ్యవసాయదారుడు. ప్రముఖ కథకళి గురువు కుంజుకురుప్ ఈయన సోదరుడు. కేరళలో రామాయణ, భారత పారాయణం సంప్రదాయ కుటుంబాలలో అనూచానంగా వస్తోంది. తండ్రే పారాయణం చేసి అర్థ వివరణ చేసేవాడు. ఆవిధంగా తకళి విద్యాభ్యాసంగం ఇంట్లోనే ఆరంభమైంది. సొంతూరిలోనే ప్రాథమిక విద్య అభ్యసించాడు. అంబలపుళలో మాధ్యమిక విద్య పూర్తిచేశాడు. ఈ పాఠశాల సముద్ర తీరాన బెస్తగూడెం మధ్యలో వుంది. బాల్యంలోనే బెస్తల జీవితాన్ని సన్నిహితంగా పరిశీలించే అవకాశం లభించింది. వైకోం ఉన్నత పాఠశాలలో చదివి, పిమ్మట తిరువనంతపురంలోని న్యాయశాస్త్ర కళాశాలలో చేరాడు. వైకోంలో ఉపాధ్యాయుడు కైనిక్కర కుమారపిళ్ళై అతడిలో సాహిత్యాభిమానాన్ని పెంపొందిస్తే, తిరువనంతపురంలో ప్రసిద్ధ సాహితీవేత్త, 'కేసరి' పత్రికా సంపాదకుడు బాలకృష్ణ పిళ్ళై విశ్వసాహిత్య పరిచయావకాశం కలిగించాడు. ఆ కాలంలో మొపాసా, చెకోవ్, హ్యూగో, గోర్కీ, టాల్‌స్టాయ్, ఫ్రాయిడ్, మార్క్స్, బెర్ట్రాండ్ రసెల్ ప్రభృతుల రచనలు అధ్యయనం చేశాడు. ఆనాటి రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిణామాలను నిశితంగా పరిశీలించాడు. బాలకృష్ణ పిళ్ళై ప్రోత్సాహంతో కథారచన కుపక్రమించాడు. అవి 'కేసరి' పత్రికలో ప్రచురితమయ్యేవి. తకళి మఫస్సిల్ వకీలుగా వృత్తి జీవనం ప్రారంభించాడు. న్యాయవాదిగా ఆయన దగ్గరకు వచ్చేవాళ్ళలో బెస్తలు అధికం. న్యాయవాది వృత్తిలో వున్నా ఆయన వ్యవసాయం మరువలేదు. వీలు చిక్కినప్పుడు స్వగ్రామంలో సేద్యం పనుల్లో చురుకుగా పాల్గొనేవాడు. ఒక సందర్భంలో ఆయనిలా అన్నాడు- 'సంప్రదాయరీత్యా నేను రైతును. ఇప్పుడు కూడా పొలంలో పనిచేస్తా, నా కాళ్ళ మచ్చలే దీనికి తార్కాణం.' కుట్టనాడులో పంట పొలాలు




నీటిలో మునుగుతాయి. పొలంచుట్టూ గట్టువేసి, నీటిని తోడాలి. తర్వాత పైరు వేయాలి. ఇదంతా శ్రమతో కూడిన పని. తకళి శ్రమజీవి. భూస్వామ్యం గురించీ, రైతాంగ సమస్య గురించి లోతుగా పరిశీలించినవాడు.

తకళి కథలు, నవలలు ఔన్నత్యపరంగా వస్తువులో, నిర్మాణంలో పరస్పరం పోటీపడతాయి. తొలికథ 'సాధూకల్' 1929లో వెలువడింది. అప్పటికి తకళి ఉన్నత పాఠశాల విద్యార్థి.

నాయర్ సర్వీస్ సొసైటీ పత్రిక 'సర్వీస్'లో కథ అచ్చయింది. ఆయన అనుభూతులే ఎక్కువ భాగం కథావస్తువులయ్యాయి. వాస్తవికత ఆయన రచనల్లో ప్రత్యేకత. 'పుయుమలర్' ఆయన ప్రథమ కథాసంపుటి. తకళి ఎనిమిది వందలకు పైగా కథలు రచించారు. కథారచన గురించిన ఆయన అభిప్రాయం- 'కథ చెప్పడంలో మనకు ప్రాచీనమైన సంవిధానం ఉంది. అది పద్యరూపం. రామాయణ భారతాదులు దీనికి ఉదాహరణలు. స్వకీయ సాహిత్యరూప వికాసానికి మనం ఎందుకు ప్రయత్నించడంలేదు'.

లాస్ట్‌లవర్ కథలో ధనికవర్గ భోగలాలస ప్రవృత్తిని దుయ్యబట్టాడు. తన రచనల్లో అభాగ్యుల స్వరం వినిపించాడు. 'అట్టడుగు ప్రజలు, అస్పృశ్యులు, అభాగ్యులు, దళితులు నన్ను ప్రభావితం చేశారు' అంటాడాయన.

తకళి నవలలు కొన్ని ప్రపంచ సాహిత్యంలో మణిపూసలుగా వాసికెక్కాయి. తోటియుడెమకన్, చెమ్మీన్, అనుభవంగళ్, పాలిచ్చుకళ్, ఆకాశమ్, జీవనమ్ సుందరమ్ పక్షె, పెణ్ణు, నురయుమ్ పంతయుమ్, కయర్, రండిటంగజి, బల్లునుకళ్ మొదలైన ముప్పై రెండు నవలలు ఆయన రాశారు. ఆలెప్పీలో పాకీ పని చేసేవారి దైన్యస్థితికి చలించి 'తోటియుడెమకన్' రాశారు. మళయాళ పాఠకుల్లో జనాదరణ పొందిన కయర్(నార), వేయిపుటల నవల. ఇది రెండున్నర శతాబ్దాల కేరళ సామాజిక చిత్రణ. సమాజమే నాయకుడు, మనిషికి భూమిపై ఉండే కాంక్షే నవలా నాయిక. ఇదొక మానవేతిహాసం. కేరళ గ్రామీణ జీవితం ఈ నవలలో శతముఖాలతో ఆవిష్కృతమైంది. 1948లో రచించిన 'రండిటంగజి' (రెండు శేర్లు) రైతాంగ వ్యవస్థ చుట్టూ అల్లిన నవల. కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం పొందిన ఈ నవల ప్రధాన భారతీయ భాషల్లోకి అనువాదమైంది. పొలం కౌలుకు తీసుకుని రేయింబవళ్ళు శ్రమించే పేద రైతులు భూస్వాముల చేతుల్లో ఎలా బలైపోతున్నదీ చెబుతుంది. కాళిపరయన్-కుంజలి దంపతుల కుమార్తె చిరుత. ఆమెను కోరడికిచ్చి వివాహం చేస్తారు. సాలుకు నూటయాభై రోజుల పని, రోజుకు రెండుశేర్ల వడ్లు కూలిపై భూస్వామి తంబురన్ దగ్గర కొలువుకు కోరడి కుదురుకుంటాడు. అతడు ఎన్నో బాధలకు లోనవుతాడు. యూనియన్‌లో చురుకుగా పనిచేయడంతో భూస్వాములు కక్ష కడతారు. చిరుత గర్భవతి అవుతుంది. కోరడి జైలు పాలవుతాడు. 'దున్నేవాడికే పొలం' నినాదంతో నవల ముగుస్తుంది.

'చెమ్మీన్' (రొయ్యలు) 1956లో వెలువడింది. కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం పొందిన ఈ నవల 19 విదేశీ భాషల్లోకి అనువాదమైంది. 15 దేశాల్లో ఈ నవలను సినిమాగా తీశారు. రామూకరియత్ నిర్మించిన చిత్రానికి 1964వ జాతీయ చలనచిత్ర పురస్కారం వచ్చింది. ఈ నవలలో ఇరవై అధ్యాయాలున్నాయి. బెస్తల జీవితంలో అన్ని పార్శ్వాలను రసార్ద్రంగా, ప్రేమవృత్తాంతం జోడించి రచించిన నవల ఇది. బెస్తల ఆచారాలు, నమ్మకాలు, అలవాట్లు, సంప్రదాయాలు, చేపల వేట, సముద్రం అలజడి అన్నీ చిత్రించారు. బెస్తపల్లె నిర్కునంలో చెంబన్ కుంజు-చక్కి దంపతుల పెద్దకుమార్తె కరుత్తమ. రెండో కుమార్తె పంచమి. దుకాణం నడిపే సాహెబు కొడుకు పరికుట్టి, కరుత్తమ్మ గాఢంగా ప్రేమించుకుంటారు. కాని తృక్కున్నపుళలోని పళనికిచ్చి కరుత్తమ్మ పెళ్ళి జరిపిస్తాడు తండ్రి. చక్కి మంచాన పడుతుంది. కరుత్తమ్మ అత్తవారింటికి వెళ్ళక తప్పలేదు. పళనికి నా అన్న వాళ్ళెవరూ లేరు. ఆ పల్లెలో ఆడవాళ్ళందరూ కరుత్తమ్మ సాహెబుతో గడిపిందని పుకార్లు పుట్టిస్తారు. బెస్తల్లో స్త్రీ నీతి తప్పితే కట్టలమ్మ (కడలితల్లి) కోపగిస్తుందనే నమ్మకముంది. కరుత్తమ్మ నీతి తప్పలేదు. సోదరిలా భావిస్తానని చక్కి చనిపోయేటప్పుడు పరికుట్టినుంచి మాట తీసుకుంటుంది. కాని అతడు కరుత్తమ్మను మరువలేదు. కరుత్తమ్మ బిడ్డకు తల్లి అయింది. పళనికి చెప్పి ఆమె పుట్టింటికి వచ్చింది. పళని చేపలవేటకు వెళ్ళాడు. వెన్నెల్లో కరుత్తమ్మ తీరానికి వెళ్ళింది. పరికుట్టి పిలుపు విన్పించింది. ఇద్దరి గుండెల్లో ప్రేమ ఉప్పొంగి ఆలింగనం చేసుకున్నారు. మరోవైపు పళని విసిరిన గాలాన్ని మింగిన పెద్ద సొరమీన తోకతో పడవను కొట్టింది. సముద్రం కల్లోలమైంది. రెండు, స్త్రీ పురుష శవాలు, గాలం మింగి చచ్చిన సొరమీను తీరం మీద కన్పించాయి. ఇదే చెమ్మీన్‌లోని కథ. నేటికీ కేరళలో ప్రతియింటా మాటల సందర్భంలో 'చెమ్మీన్' ప్రస్తావన వస్తూనే ఉంటుంది. భారతప్రభుత్వం ఆయన గౌరవార్థం తపాలబిళ్ళ విడుదల చేసింది.

తకళి శివశంకర పిళ్ళై 1999 ఏప్రిల్ 10న తకళి గ్రామంలో పరమ పదించారు.

**– గోవిందరాజు రామకృష్ణారావు**










# ఆత్మీయ బంధానికి అరుదైన నిర్వచనం

## ప్రవాస ఆంధ్రుని విలక్షణ స్పందన

నేను పదిహేను సంవత్సరాల నుండి 'చతుర - విపుల' పత్రికల్ని చదువుతున్నాను. నా దృష్టిలో తెలుగువారంతా గర్వించదగ్గ పత్రికలివి. నెలవగానే ఎపుడెపుడు పత్రికలు వస్తాయా అని పదిహేడు వందల కిలోమీటర్ల దూరంలోని ఢిల్లీలో ఉన్న మేం పోస్టుకోసం ఎదురు చూస్తుంటాం.

'అమ్మ నాన్నలకు అందమైన కానుక' అంటూ 'చతుర'లో ప్రకటన చూసిన వెంటనే చిన్నప్రయోగం చేశాం. కొత్త సంవత్సరం కానుకగా మా దగ్గరి బంధువులు ఆరు (శ్రీమతి వైపు నుంచి రెండు, నా వైపు నుంచి రెండు, ఇద్దరి వైపు నుంచి రెండు) కుటుంబాలకు 'విపుల - చతుర'లకు రెండేళ్ల చందా కట్టాం. ఈ ఏడాది జనవరి నుంచి ఆ ఆరు కుటుంబాలకి 'విపుల-చతుర' అందుతున్నాయి.

మేం చేసింది చిన్నప్రయోగమే! ఫలితాలు మాత్రం చాలా సంతోషాన్నిస్తున్నాయి.

'అబ్బ.. ఎన్ని సంవత్సరాలకి మంచి కథల్ని చదువుతున్నాం.. థాంక్స్' బావగారి ప్రశంస.

'మళ్ళీ తెలుగుని మనసారా చదువుతున్నందుకు ఆనందంగా ఉంది' బామ్మర్ది ఆనందం.

'నెల ఎప్పుడైపోతుందా.. ఎప్పుడు 'విపుల-చతుర'లు వస్తాయా అని ఎదురుచూస్తుంటాం..' రిటైర్‌మెంట్ జీవనం గడుపుతున్న మామగారు తన కూతురుతో ఉత్సాహాన్ని పంచుకున్న ఘడియలు.

'కమ్మని తెలుగు చదివే అవకాశం ఇచ్చినందుకు నేను, బావగారు మీకు కృతజ్ఞతల్ని తెలుపుతున్నాం.. చదువుతుంటే మళ్ళీ ఉత్తరాలు రాయడం మొదలుపెట్టాలనిపిస్తోంది' చెల్లి ముచ్చట్లు.

'విడవబుద్ధికాకుండా ఒకే సిట్టింగులో అంతా చదివేశాను' అని టి.వి.ని ఎక్కువగా చూసే అన్నయ్య గర్వంగా చెప్పాడు.

మాకు ఇంతకంటే ఏం కావాలి? సంప్రదాయచట్రంలో ఇరుక్కుపోయి చీరలు-సారెలకు బదులుగా ఇలాటి కానుకలు ఇస్తే ఎంతో ఉపయుక్తంగా ఉంటాయి. ఈ మంచి పత్రికలకు చందా కట్టి మన బంధాల్ని, స్నేహాల్ని మరింత బలపరుచుకోవచ్చు.

ఎంతో డబ్బు ఖర్చు చేసి మన పెద్దలకి తాత్కాలిక సౌకర్యాల్ని, ఆనందాల్ని సమకూరుస్తాం. అతి తక్కువ ఖర్చు (సంవత్సర చందా ఒక్కోపత్రికకు 108 రూపాయలు మాత్రమే) తో 'విపుల - చతుర' అందజేస్తే వినోదం, విజ్ఞానంతో పాటు చక్కని కాలక్షేపం కూడా ఉంటుంది.

చిన్న కానుక.. విలక్షణమైన కానుక.. చూడడం పెరిగి చదవడం తరిగిపోయిన ఈ రోజుల్లో మంచి పత్రికల్ని గుర్తించి వాటిని అందుబాటులోకి తేవడం కోసం చందాల్ని కట్టి మన బంధాల్ని, స్నేహాల్ని మరింత బలపరుచుకోడానికి ఇదొక ఉత్తమ మార్గం. ఇదెవరి గొప్పకోసమో మెహర్బానీ కోసమో చెబుతున్న మాటలు కావు. మా అంతరంగాన్ని మీతో పంచుకున్నాం. మీ అనుబంధాలనూ ఆత్మీయంగా మలచుకోండి మరి!

-డా॥ టి. సంపత్‌కుమార్,
న్యూఢిల్లీ

 

# చతుర ప్రవేశిక



## నవంబరు - 2010

నవంబరు 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. నెపోలియన్ ప్రత్యర్థి ఎవరు?
2. మేనర్ క్షేత్రం యజమాని పేరేమిటి?
3. 'నెపోలియన్ మాట ఎప్పుడూ సరైనదే' అన్నది?
4. 'నాలుగు కాళ్లవి మంచివి, రెండుకాళ్లవి చెడ్డవి' అని అరిచేవి?
5. జోన్స్ పెంపుడు కాకి పేరు?
6. టేల్ ఆఫ్ గెంజి రచయిత్రి పేరు?
7. తకళి శివశంకరపిళ్లైకు ఏ సంవత్సరంలో జ్ఞానపీఠం లభించింది?
8. కనకధార సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రిలో చేరిందెవరు?
9. 'జక్కం వీరన్న' కథా రచయిత?
10. తాతబ్బాయిని హైదరాబాదుకు తోడుగా తీసుకెళ్లిందెవరు?

---

పంపినవారి పేరు: ---------------------------- వయసు (  )

చిరునామా: ------------------------------------

------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

ప్రవేశికలకు చివరి తేదీ 16

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.









## వారెవ్వా!

ఆకుల్లో ఆకుల్లా,
బెరడుల్లో బెరడుల్లా చెట్టూ
చేమల్లో కలిసిపోయే ఈ జీవుల
తపనంతా ఆత్మరక్షణకు,
ఇతర జీవుల్ని వేటాడి
పొట్ట నింపుకోవడం
కోసమే!





CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78